# భారతి

సాహిత్య మాసపత్రిక

సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

మార్చి 1957

సంపుటము 34 : : సంచిక 3

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## మార్చి 1957

# సెలకన్నె

శ్రీ బెళ్లూరి శ్రీనివాసమూర్తి

౧

ఓ సెలకన్నె! నీ విటుల యోగినివోలె నరణ్యవాటికా
వాసమునన్ ప్రశాంతిమయ పావన జీవనమున్ దరింతు—లీ
లా సుకుమార మంజుల గళంబుల నెత్తి శకుంత సంతతుల్
భాసుర వేదఘోషల వెలార్పఁగ నొక్కట తీరభూములన్

౨

నీ సౌందర్యములో పరాత్పరుని సందేశంబులన్ దాచి, త
ద్వ్యాసంగంబున పోత్సహించెద వనిర్వాచ్యంబు నీ ప్రేమ, నీ
పై సంధ్యాద్రి కషాయ దీధితులు ప్రోవై—పార్వతీ దివ్య దీ
క్షా సంశోభితవౌదు మాయెడదలన్ సాక్షాత్కృతిన్ జెందుచున్.

3

ఈ మృదులానిలంబుల చలించు త్వదూర్మికలందు తాండవ
శ్రీ మధురానుభూతి యలరించెదు—రమ్యకళానుషంగివై
మైమఱపొంది చూచు శశిమౌళివలెన్, గిరినిర్ఝరంబ! జ్యో
త్స్నామల మూర్తియైన హిమధాముని ఛాయలు బర్వె నీపయిన్.

౪

నీయొంపాటలోకరగి నిల్వని యీ జడవస్తు జాతముల్
నీ యమృత స్వరంబు సరణిన్ కలియంబడి గానమాధురిన్
పాయనివయ్యె, నేకముఖమై హృదయార్పణ సల్పి యీశ్వర
ధ్యేయము గాంచు ప్రాణులగతిన్—పరమార్థము వెల్వరించుచున్.

౫

త్యాగధనంబు గాఁచికొను తాపసవర్గము నీదు సన్నిధిన్
మూఁగి త్రిసంధ్యకాలముల మోకరిలున్ సుకృతాత్మవంచు, స్వే
చ్ఛాగతినంది యీ ప్రకృతి చారుతరున్ కయిసేతలిచ్చు ని
న్నో గిరిబాల! ప్రేమమయు లుత్సుకతన్ గని కొల్తురాత్మలన్.

# హిరణ్మయపద్మరహస్యము

శ్రీ వాసిరెడ్డి పార్థసారథి

మహర్షులు, బహు శ్రమలకోర్చి గొప్ప విద్యలను కనిపెట్టారు. కాని ఇవి మన కిప్పుడు అందు బాటులో లేవు. మన దేశంలోని రాజకీయ అరాచక ఫలితములు, అన్నిటిమీద ప్రతిబింబించినవి. వెయ్యి యేండ్లనాడు మహమ్మదీయ దండయాత్రలు ఈ భారత భూమిమీద అడుగు పెట్టినవి. ఇందువల్ల మన విశ్వ విద్యాలయములు రూపుమాసినవి. మన గ్రంథాలయ ములు అంతరించినవి. ఆశ్రమ జీవితములు, గురుకులములు మారిపోయినవి. అంతకు పూర్వము మన దేశములో బౌద్ధమహాయుగము వెలిసినది. ఇది స్వర్ణ యుగము మనకు. నాడు సమస్త కళలు షోడశకళాప్రపూర్ణము లైనవి. ఆనాడు, మన విద్యావంతులు, మన విద్యలను దేశదేశాలా ప్రచురించారు. అప్పుడు చీనా, టిబెట్, కొరియా, జపాన్ దేశాలు మన యోగ విద్యలకు నిల యములైనవి. తర్వాత, దండయాత్రల, అరాచకముల భయమువల్ల మన శాస్త్రములను పండితులు కొందరు పర దేశములకు జేరవేశారు. అప్పుడు మనగుప్త శాస్త్ర ములు టిబెటులో దాయబడినవి. ఇప్పటికీ అందు మన శాస్త్రములు చాలా వున్నవి. మనపూర్వుల విజ్ఞానమును మనము తెలిసికోవలె నన్న మనకు చీనా, టిబెటు దేశాలు శరణ్యములు.

రెండు శతాబ్దులకు పూర్వము, ఆయిరోపా ఖండము దీర్ఘ నిద్రనుండి మేల్కాంచినది. అప్పుడే జ్ఞానం వచ్చిన పిల్లవానివలె, ఎక్కడ ఏమున్నవో, తెలిసికో ప్రయత్నించారు. ఈ ప్రయత్నంలో కొన్ని జాతులు రాజ్య ధనములను సంపాదించారు. ఫ్రెంచి, జర్మను జాతులు జ్ఞానార్జనకు ఆసియా ఖండమంతను గాలించారు. భారతభూమిలో వున్న వేదములను, ఉపనిషత్తులను ఆత్మవిద్యలను, సాహిత్యకళలను సేకరించారు. టిబెట్ లో ప్రాణభయానికి కూడ వెరువక అనేక శాస్త్రములను సంగ్రహించారు. ఇట్లేచీనా దేశంలో కూడా గ్రహించారు. చీనాభాష చాలా కష్ట మైనది. అక్షరములే అయిదువేల పైచిలుకున్నవట. జర్మనీవారు కష్టమని వెరుకక, వారి భాషను నేర్చు కున్నారు. అందున్న అనేకగుప్త విద్యలను ఆర్జించారు. ఆధునికమానసిక శాస్త్రవేత్తలు ఈ యోగ విద్యలను చూచి చాలా ఆశ్చర్య పడ్డారు. అందువల్ల ఇవి అనేక పండితులను ఆకర్షించినవి.

చీనాలో రకరకాల యోగవిధానము లున్నవి. అందులో ముఖ్యమైనట్టి, గోప్యమైనట్టి, అనేక ఆధునిక పండితులను ఆకర్షించిన,ఒక యోగవిధానమును క్లుప్తంగా మనవి చేస్తాను.

ప్రపంచ జాతులలో చీనావారు తెలివిగల వారని ప్రతీతి. యూరపియన్లు చీనానుండి అనేక సాహిత్య, యోగవిజ్ఞానములను సంపాదించారు. ఇట్టివారిలో రిచ్చర్డువిల్ హెల్మ్ వకరు. ఈయన జర్మన్ జాతీయుడు జర్మనీలో స్క్రా ఫేన్ హార్ మొదలైన వేదాంతులు, పండితులు భారతీయ ఉపనిషత్తులకు, సాహిత్యముకు గొప్ప ప్రచారం చేశారు. జ్ఞానార్జనకై అనేక మంది జర్మన్ పండితులు తూర్పు దేశాలకు వచ్చారు. ఇట్టి వారిలో రిచ్చర్డు విల్ హెల్మ్ వకరు. వీరు చీనా దేశము వెళ్లారు. చైనా భాష చాలా కష్టము. అయినా చీనావారిలో నివసిస్తూ వారి భాషను నేర్చుకున్నాడు. తర్వాత, చీనావారి అనేక యోగ గ్రంథములను చదివాడు. అక్కడ అనేక రహస్య సంఘాలు, గుప్త విద్యలు ఉన్నవి. ఇవి బయటివారికి అభేద్యములు. అనేక శ్రమలకోర్చి కొన్ని గుప్త విద్యలను గ్రహించాడు. ఇందులో 'బంగారు పువ్వు రహస్యము' (Secret of the Golden Flower) అను గ్రంథము వకటి. ఇది అసంపూర్ణంగా వున్నది. సాధనపాదం చాలా క్లుప్తంగాను, కొద్దిగాను వున్నది. కైవల్య పాదము విశదంగా వున్నది. అందువల్ల సాధనపాదంలో ఇంకా గ్రంథం ఉండి వుంట్టుంది. అదిపోగా, ఏదో

క్షిప్తంగా ఇందుచేర్చారు. ఈ విద్య ఎనిమిదవ శతాబ్దములో చీనాలో ఆవిష్కరింపబడినది. అప్పటి నుండి, మన వేదములవలె గురువునుండి శిష్యునికి చెప్పబడుతూ క్రిందటిశతాబ్దమువరకూవచ్చింది. తర్వాత దీనినిఅచ్చువేశారు. అచ్చు గ్రంథాలు కూడా చాలా మితంగా వేశారు. ఈ గ్రంథాలు ఆ సంఘీయులకు మినహా యితరులకు దొరకవు. ఈ సంఘములు ఆది నుండీ రహస్య సంఘాలుగా వున్నవి. వీరు శక్తి సంపాదకులని, దానివల్ల వీరికి రాజ్యకాంక్ష వున్నదని భ్రమపడ్డారు కొందరు. అందువల్ల ప్రభుత్వమువారు వీరిని వెంటాడి, హింసించారు. అందువల్ల ఇతరుల కంటపడకుండా చాలా రహస్యంగా సంచరించేవారు. రహస్యమునకు ఇంకా కారణములున్నవి. ఎట్లయినా ఈ గ్రంథసంపాదన సులభంగాదు. కాని రిచ్చర్డు ఎట్లో వక ప్రతిని సంపాదించాడు. దీనిని జర్మన్ భాషలోనికి 1929 లో తర్జుమాచేశాడు. రిచ్చర్డు 1930లో పరమపదించాడు. C. G. Jung (యూంగ్) ఆధునిక మానసిక శాస్త్రవేత్త ఈ గ్రంథానికి ఉపోద్ఘాతమును వ్రాశాడు. అయిరోపావారి కెట్లు ఇది వుపయోగించునో వ్రాశాడు. దీనికి ప్రపంచంలో మంచి ప్రచారము గలిగింది. అనేక పాశ్చాత్య పత్రికలు వేనోళ్ళ ప్రశంసించినవి. క్రిస్టియన్, అబ్జర్వరు పత్రికలు ఈ విద్య పాశ్చాత్యులకు ఇప్పుడొక వరమన్నవి. అశాంతిలో పడివున్న, వారి మనశ్శరీరాత్మలకు, ఇదొక తరణోపాయమన్నారు. మన సర్వేపల్లి రాధాకృష్ణ పండితులు, భగవద్గీత వ్యాఖ్యానములో ఈ గ్రంథప్రశంస తెచ్చారు.

ఈ గ్రంథమును Cary F. Baynes క్యారీ యఫ్. బేన్సు, ఆంగ్లములోనికి తర్జుమా చేశాడు. యూంగ్ శాస్త్రోక్తమైన ఉపోద్ఘాతమును వ్రాశారు.

ఆంగ్లములో ఈ గ్రంథముపేరు (Secret of the Golden Flower) 'సువర్ణ పుష్ప రహస్యము.' సువర్ణ పుష్ప రహస్యమంటే ఆ గ్రంథోద్దేశ్యము ఇందులోరాదు. అందుకు తగిన పేరును అన్వేషించాలి. ఈ గ్రంథము ఆత్మవిద్య గురించినది. ఆత్మవిద్య అంతా సాంకేతిక భాష. ఆ పదాలు వాడితే వాటి అర్థముస్తుంది. 'సువర్ణ' అనే పదమునకు ఉపనిషత్తులలోను, పురాణాలలోను హిరణ్మయ అని వాడారు. సూర్యభగవానుని హిరణ్యగర్భుడన్నారు. ఇందుకు అమరకోశంలో అర్థము ఈ విధంగా వున్నది. 'హిరణ్మయో గర్భోయస్యసః హిరణ్యగర్భః' అనగా హిరణ్మయమైన గర్భముకలవాడని అర్థము. హిరణ్మయమైన గర్భము కలవాడనగా హిరణ్యమువలె, తేజోవంతమైన గర్భము కలవాడు. అగ్నిని హిరణ్యరేతస్సు అంటారు. కనుక హిరణ్య శబ్దమునకు తేజస్సు అర్థం వస్తుంది. ఈగ్రంథములో 'సువర్ణపుష్పము—తేజస్సు' అన్నారు కనుక ఈ గ్రంథోద్దేశ్యంప్రకారం, 'స్వర్ణ' అనే పదమునకు ఈ హిరణ్మయ అను పదము సరిపోతుంది. తర్వాత పుష్పము; యోగవిద్యలో పుష్పమనే మాటకు బదులు పద్మమును వాడారు. మనస్సులో అంతర్గర్భితములైన శక్తుల రహస్యమే ఈ హిరణ్యమయ పద్మమని ఈ గ్రంథంలో వ్రాసివుంది. ఉత్పత్తి, వికాసములకు సాంకేతిక పదము పద్మము. కనుక పద్మమును వాడాను. యోగశాస్త్రంలో హృదయపద్మము అని అంటారు. 'టో' మతం ప్రకారము, మానవుడు కోరికలకు వశుడై పశువౌతాడు. జ్ఞానమును తేజస్సును అపేక్షించువారు దివ్యులౌతారు. పశుత్వం పొందినవారు, మరణానంతరము భూతప్రేతములుగా పుడతారు. కొంతకాలానికి మళ్ళీ జన్మకువస్తారు. ఇట్లా పుట్టుచూ చచ్చుచుండుటే వీరి పని. కాని దివ్యతేజస్సును ఆశ్రయించినవారు పశుత్వాన్ని జయించకలరు. వారి జీవితము తేజోవంతము, అమృతమయము అవుతుంది. అమృతమయ జీవితమును పొందుటే ఈ గ్రంథోద్దేశ్యము.

దీనిని చీనా వ్యక్తి, లూ-యన్ అనే యోగి ఆవిష్కరించారు. ఈయన క్రీ. శ. 7౬౮లో జన్మించాడు. ఈయనను 'లూ-టింగ్-పెన్' అని కూడా అంటారు. అనగా పెద్దకొండగుహ నివాసి అని అర్థము. ఇతను 'టో' మతసాధకుడు. మహాజ్ఞాని. 'టో', కన్ఫూషియస్, బౌద్ధమతాల సమన్వయంతో ఈసిద్ధాంతమును నిర్మించాడు. ఇతనిగురించి అనేక పురాణకథలున్నవి. 'పి-సై-సేక్' అను అతడు, ఈయనను క్రిస్టియన్ మతస్థుడని కూడా వాదిస్తున్నాడు. క్రిస్టియన్ మతంలోని జ్యోతి, జ్ఞానస్నానమువంటివి ఇందులో వున్నవి. ఈయన జన్మించునప్పటికి చీనాలోని, సియాన్ఫో అనే పట్నంలో నే "నెస్టోరియన్" చర్చి వున్నది. అందువల్ల ఇతను ఆ తెగ క్రీస్తుమతం నుంచే దీనిని కనిపెట్టాడని వాదిస్తారు. కాని ఇది 'టో' మత సిద్ధాంతముమీద ఆధారపడి వుంది. బౌద్ధ

సాధనలను, కన్‌ఫ్యూషియన్ సిద్ధాంతములను కొన్నిటిని గ్రహించింది.

ఈ సిద్ధాంతమునకు 'టావో' తత్వము పునాది. 'టావో' అనగా అర్థమేమో తెలియుట చాలా కష్టము. అనేకమంది అనేక అర్థాలు చెప్పారు. ఇది సాంకేతిక శబ్దము. ఈ శబ్దములవల్ల వచ్చే చిక్కే ఇది. అర్థము లన్నీ చూచిగా టావో అను శబ్దమునకు, మూలప్రకృతి అని అర్థం వస్తుంది. కొందరు దీనిని ధర్మచక్రమని, దారి అని, భావమని, శిరస్సని అన్నారు. మరికొందరు దేవుడని కూడా అన్నారు. 'టావో' ఏకమైనది. కాని, దీని నుండి ద్వంద్వములు పుట్టును. 'టావో' స్వయంభువు. ద్వంద్వములు తిరిగి ఇందులోనే ప్రవేశించును. తత్త్వంలో, తత్ + త్వం శబ్దము లున్నవి. ఈ 'తత్' జ్ఞానులద్వారా చీనాలో ప్రవేశించి వుంటుంది. అక్కడ దానిని 'తావో' అనిగాని, 'టావో' అనిగాని వాడివుంటారని నా వూహ. లేక తత్, టావో అయి వుంటుంది. ఆత్మవిద్యవలె, చీనాభాష కూడా సంకేత పదములతో వున్నది. అక్షరము లన్నీ సంకేతములుగా వుంటవి. మనిషి అనుమాటకు కాళ్లవలె గుర్తు వ్రాస్తారు. చీనా భాషలో ప్రతిమాటకు వేరు సాంకేతిక పదము వుంటుంటుంది. అందువల్లే అయిదువేల పైచిలుకు శబ్దములున్నవి చీనా భాషలో. 'టావో'కు శిరస్సును తెల్పు సాంకేతిక అక్షరమును వ్రాశారు. దీనికి అనేక అర్థాలు చెప్పారు. శిరస్సు అంటే ప్రారంభమన్నారు. కాదు మెదడు వుంటుంది కనుక సుజ్ఞానమన్నారు. మన ఉపనిషత్తులకు భాష్యములను చెప్పినట్లుగా తిలోక అర్థం చెప్పారు.

'లూ' బరువు చెప్పింది ఇది. 'టావో' స్వర్గ జ్యోతిలో వున్నది. ఈ జ్యోతి కనుపించదు. ఇది రెండు నేత్రములలో వున్నది. హిరణ్మయపద్మమే ఈ జ్యోతి. ఈ జ్యోతి సత్యమైనట్టిది, అభిన్నమైనట్టిది, ఉత్కృష్టమైనట్టిది. అమృతమే ఈ జ్యోతి. అమృతసేకరణకు ఈ జ్యోతిని సేకరించుకుని, రక్షించుకోవాలి. ఇదే పరంజ్యోతి. సూర్య చంద్రులమధ్య వున్నది. ఇడా పింగళలమధ్యన వున్నది. భ్రూస్థానంలో వున్న వెలుగే ఇది.

చీనావారి "పసుపు పచ్చనికోట" అనే గ్రంథంలో ఇట్లు వ్రాయబడ్డది. చతురపు టడుగుమేడలో చదరపు టంగుళ స్థలమున్నది. ఇక్కడ అమృతం వర్షిస్తుంటుంది. దీనిని సేకరించిన వారు నిత్యత్వం పొందుదురు. దీనికి అంతరార్థము వున్నది. చతరపుఅడుగు అనగా మానవుని ముఖము. చతరంగుళి మనగా భ్రూస్థానము. ఇదే ఆజ్ఞాచక్రము. ఈ స్థానమును కన్‌ఫ్యూషియన్‌లు శూన్యము యొక్క మధ్యస్థానమంటారు. బౌద్ధులు జీవిత ఔన్నత స్థానమంటారు. 'టావో' మతస్తులు దీనిని పితృభూమి అనీ, పచ్చమేడ అనీ అంటారు. దీనినే చీకటి మార్గమని, స్వర్గధామ మనీ అంటారు. ఈ స్వర్గ హృదయము గృహమువంటిది. పరంజ్యోతి అధికారి వంటివాడు. జ్యోతి ప్రవహిస్తున్నప్పుడు శరీర ధర్మము సవ్యంగా నడుస్తుంది. గృహయజమాని శక్తివంతుడుగా వున్నప్పుడు గృహంలోని తతిమ్మవారు వారి పనులను సవ్యంగా నెరవేర్చినట్లే. కనుక ఈ సిద్ధాంత రహస్యము, ఈ జ్యోతి ప్రవహించునట్లు చూచుటే. జ్యోతి [illegible] తిరుగుతుంది. ఇది చక్రంవలె గిరగిర తిరుగుతుంది. అప్పుడు జ్యోతి పేరుకుంటుంది. ఇదే తేజశ్శరీరము, యమనియమాలను ఆచరించాలి. బ్రహ్మచర్యం వల్ల వీర్యమును ఓజస్సుగా మార్చాలి. ఇంద్రియములను జయించాలి. కామక్రోధములను వదులుకోవాలి. చిత్తవృత్తులను నిరోధించాలి. హృదయమును, శ్వాసను, చూపును నియమబద్ధం చేయాలి. ఇట్లా ఒక సంవత్సరము సాధనచేయాలి. అప్పుడు తేజశ్శరీరమునకు గర్భం ఏర్పడుతుంది. అవ్యక్త జగత్తులో ప్రవేశం లభిస్తూవుంటుంది. దీనిని పోషించుకుంటూ ముందుకుసాగాలి సిద్ధిదగ్గర పడేకొలదీ కొన్ని నిదర్శనములు కనుపిస్తాయి. సాధకుడు చాలా జాగ్రత్తగా వుండాలి. అనేక అపాయములను ఎదుర్కొనవలసి వుంటుంది. కత్తిమీద సాము చేసినట్లే. దీక్షగా సాధనచేసిన వారికి అమృతత్వం లభిస్తుంది.

'టావో' నుండి వాస్తవములయొక్క మూలములు పుట్టును. ఇవి రెండు. ఇందులో ఒకటి వెలుగు, ఒకటి చీకటి. వెలుగు పురుషసంబంధమైనది. చీకటి స్త్రీ సంబంధమైనది. టావోలో ఇవి రెండూ వున్నవి. టావో, భారతీయుల అర్ధనారీశ్వరునివలె వున్నది. శివునిలో సగము పురుషుడు సగము స్త్రీ. స్త్రీపురుషులు ప్రతివారిలో స్త్రీపురుషుల రెండు స్వభావములూ ఉన్నవని ఆధునిక శాస్త్రజ్ఞులు చెప్పుతున్నారు. వెలుగునుంచి స్వర్గము పుట్టింది. చీకటినుంచి భూమి పుట్టింది. ఈ స్వర్గభూముల కలయికవల్ల, పదివేల వస్తువులు పుట్టినవి.

# హిరణ్మయపద్మ రహస్యము

మానవుడు ఈ పదివేల వస్తువులలో ఒకడు. పదివేల వస్తువులనగా ప్రపంచమంతా అని భావము. మానవుని లోని స్వభావము లన్నీ వెలుగునుండి పుట్టినవి. భౌతిక మైనట్టి, ప్రపంచ సంబంధమైనట్టి వన్ని చీకటినుండి పుట్టినవి. ఈ శక్తి ద్వయమే మానవుని నడుపుతున్నవి. వెలుగు సంబంధము ఎక్కువగా వున్నప్పుడు మానవుడు ఉన్నతగామి యగును. చీకటి సంబంధం ఎక్కువగా వున్నప్పుడు అధోగామియగును. భారతీయసంప్రదాయములో త్రిగుణాలున్నవి. భగవద్గీత మానవుని నడిపేది త్రిగుణాలేనని చెప్పుతుంది. చీనావారు రెండుగుణాలే చెప్పుతారు. వారి వెలుగు సత్వగుణం వంటిది. చీకటి తమోగుణం వంటిది. మధ్యస్థమైన రజోగుణం వారు చెప్ప లేదు.

వెలుగును, స్వర్గమని, నిగ్గుఅని, జ్ఞానమని అంటారు. రిచ్చర్డు ఈపదమును అనేక విధాల చర్చించి 'యానిమస్' (animus) అని అన్నాడు. దీని భావం ఆత్మ అని చెప్పవచ్చు. చీకటిని భూలోకమని, ప్రాణమని, పశుత్వమని అంటారు. ఇందుకు రిచ్చర్డు 'యానిమా' (anima) అని వ్రాశాడు. దీనికి పశువు అనిగాని, ప్రాణము అనిగాని చెప్పవచ్చు. మానవుని మరణానంతరము ఆత్మ దేవలోకమునకు వెళుతుంది. ప్రాణశక్తి ప్రేతలోకంకు వెళ్ళి, భూతములుగా రూపొందుతుంది. మానవుడు జన్మించబోవునప్పుడు, మధ్య పరమాణువు రెండుగా చీలుతుంది. ఈ రెంటిలో ఒకటి వెలుగు వకటి చీకటి. ఇవి రెండు మానవునిలో వుండి, అతని కష్ట సుఖాలకు కారణములౌతవి. వెలుగు భ్రూస్థానమందు వుంటుంది. చీకటి (పశుత్వము) మానవుని హృదయమంతా వుంటుంది. ఈహృదయము పెద్ద దొంతపంటువలె వుంటుంది. హృదయమునకు రెండు వైపుల పక్షి రెక్కలవలె వూపిరితిత్తులున్నవి. ఈ హృదయము యకృత్తు (liver) చే బలపర్చబడి పొటచేత సేవించబడుతుంది. ఈహృదయము భౌతిక ప్రపంచము మీద ఆధారపడివున్నది. ఒకరోజు ఆహారంలేని యెడల ఇది చాలా బాధపడుతుంది. భయంకరమైన వాటిని చూచినప్పుడూ విన్నప్పుడు హృదయం అతిగా కొట్టు కుంటుంది. సంతోషమైన వాటిని చూచి విన్నప్పుడు ఈహృదయం ఆనందం అనుభవిస్తుంది. ప్రపంచంలోని వస్తువుల ఆకర్షణలకు ఈహృదయం వశమౌతుంది. కాని భ్రూస్థానం పరిస్థితి వేరు. అది దేనికీ వశంకాదు. వెలుగు జాగ్రదావస్థలో కన్నులరెంటియందువుంటుంది. నిద్రాసమయమందు, అది యకృత్తులో చేరి, కలలు కంటుంది. కలలనగా సూక్ష్మలోకసంచారము. తొమ్మిది స్వర్గాలు, తొమ్మిది పాతాళలోకములలో జీవి స్వప్నమందు సంచరిస్తుంది. వెలుగు చాలా తేలిక యైనది. చీకటి చాలా బరువైనది. హృదయబలం ఎక్కువైనప్పుడు మానవుడు ఇంద్రియలోలుడౌతాడు. ఇంద్రియలోలునకు పాపపుణ్యాలు తెలియవు. అతను పశుప్రాయుడౌతాడు. వెలుగు అట్టిపరిస్థితులలో ఏమీ చేయలేదు. చీకటి బరువైనది కనుక, మరణానంతరం క్రిందకు వెళ్లును. భూతరూపములను తాల్చును. వెలుగు బలం ఎక్కువైనప్పుడు హృదయం ఏమీచేయలేదు. మరణానంతరము వెలుగు పైకిలేచిపోవును. జీవించి ఉండగా ఈజ్యోతియొక్క ధ్యానంవల్ల తేజస్సు ఒనకూడును. కొంతకాలానికి ఇది పెరిగి ఒకరూపం తాల్చును. దీనినే వజ్ర శరీరమంటారు. దీనికి జననమరణములు లేవు. ద్వంద్వములు లేవు. అమృత జీవనుడౌను.

అశోకచక్రవర్తికాలంలో బౌద్ధులు చీనాకు యోగశాస్త్రములను తీసుకొని వెళ్లారు. అక్కడ వానిని నాటారు. కాని అవి అనేకరూపాలు తాల్చినవి. కొన్ని అసలు రూపమునే పోగొట్టుకున్నవి. పై విచారణవల్ల ఇది భారతీయ యోగసంప్రదాయమునకు, ఎంత దగ్గరో తెలుస్తుంది. తెలుగునాగులో చూడ చక్కని చిన్నదీ, కడమేడ గదిలోనున్నదీ అనే తత్వం పాడుతారు. చతురపు ఒడుపు మేడలో చతురపుటంగుళ స్థలమున్నది అన్న దానిని పైన వ్రాశాను. ఇది మన తత్వంనుండే వచ్చినదా అన్నట్లున్నది.

కాని ఇందున్న సిద్ధాంతములు కొన్ని, ఉపనిషత్తుల సిద్ధాంతములకు వ్యతిరేకంగా వున్నవి. చీనావారు మానవహృదయమును పూర్తిగా గ్రహించలేదా అనిపిస్తుంది. చీనావారు హృదయమునకు పూర్తిగా పశుత్వమును ఆరోపించారు. ఉపనిషత్తులు హృదయము పరమాత్మునికి స్థానంగా చెప్పుచున్నవి. భ్రూస్థానంలోఆజ్ఞాచక్రమున్నదని, హృదయస్థానంలో అనాహతచక్ర మున్నదని చెప్పుచున్నవి. దేవాలయములలో చెప్పు మంత్రపుష్పంలో హృదయమునకు ఉన్నతస్థానం ఇవ్వబడ్డది. ఈ మంత్రములు తైత్తిరీయోపనిషత్తునుండి తీసికోబడినవి. దేవాలయములలో మూర్తిపూజ చేస్తున్నట్లు బైటికి కనుపిస్తుంది.

కాని వాస్తవానికి అట్లుగాదు. ఇందుకు మంత్రపుష్పమే సాక్ష్యము. మంత్రపుష్పం హృదయాంతర్యామికి నమస్కారములు చెప్పుచున్నది. హృదయకమలము అధోముఖమై వున్నది. ఈ హృదయాగ్రమందు ఒకసూక్ష్మమైన, కమలమున్నది. దీనియందు అగ్నిజ్వాలలు ఊర్ధ్వముఖంగా ఎగయుచున్నవి. ఇవి నల్లని మేఘములమధ్య మెరుపువలె వున్నవి. ఇక్కడ సర్వము ప్రతిష్ఠించబడినది. దీనియందు పరమాత్మ ఉన్నాడు. ఇతడు స్వయంప్రకాశకుడు. మూలకారణుడు. రమణమహర్షి హృదయధ్యానమును ముఖ్యంగా చెప్పారు. అందుకు ఆత్మయైన తను హృదయమునందు ఉండుటే కారణము. యోగశాస్త్రములలో కూడా హృదయమందు సూర్యుడు, మణిపూరకమందు అగ్ని (జఠరాగ్ని) ఆజ్ఞాచక్రమందు చంద్రుడు ఉన్నాడని చెప్పబడినది. ఈ చంద్రఅగ్నులు స్వయంప్రకాశములుకావు. హృదయమందున్న సూర్యుని తేజస్సువల్లే ఇవి ప్రకాశిస్తున్నవి. ఉపనిషత్తు ఇట్లు హృదయముకు ఉన్నతస్థానం ఇవ్వగా ఈ చీనాయోగము అథమస్థానం ఇచ్చింది. బుద్ధుడు కూడా హృదయ ఏకాగ్రతవల్ల అసంభవమునేది లేదన్నాడు. ‘[illegible]’ అంతర్వీక్షణంవల్ల అసంభవమునేది లేదంటుంది. కన్ఫ్యూషియన్ జ్ఞానమువల్ల అంటాడు.

మానవునికి తెలియు జ్ఞానమేకాక, ఇంకొక జ్ఞానమున్నది. అదే అవ్యక్తము. ఈ రెంటికి సంబంధమున్నది. వ్యక్తజ్ఞానమునుండి అవ్యక్తమును పొందవచ్చు. ఇది చాలాకష్టము. ఈ అవ్యక్తజ్ఞానమే సచ్చిదానందము. ఇందులో సత్యము, జ్ఞానము, ఆనందము మిళితమైవున్నవి. భారతీయులకుగాని చీనావారికిగాని ధ్యేయమిదే. ఇందువల్ల అమృతత్వసిద్ధి కలుగుతుంది.

సాధనకాలమందు, సాధకుని మనస్సు బహు ప్రశాంతంగా వుండాలి. లేనియెడల సాధన మానుకొనుటే మంచిది. సాధనస్థలం కూడా ప్రశాంతంగాను, పవిత్రంగాను వుండాలి. కాలంకూడా అట్టిదే కావాలి. స్థల, కాలములు సాధకునికి ప్రశాంతత కల్పించేట్లుండాలి. పచ్చనివృక్షములున్న అడవులయందో పర్వతములయందో, నదీప్రాంతములయందో సాధన మంచిది. సాధకుడు పద్మాసనంలో నిటారుగా కూర్చోవాలి. చూపును నాసికాగ్రమందు వుంచాలి. ప్రారంభకులకిది చాలాముఖ్యము. కన్నులు తెరిచీ తెరవకుండా భ్రూస్థానమును చూడాలి. కన్నులు తెరిచినయెడల ప్రపంచము ఇతనిని ఆకర్షించును. తెరచినదృష్టి పౌర్ణమీదృష్టి అంటారు భారతీయులు. ఇది ప్రారంభకులకు తగదు. కన్నులు మూయుట అమావాస్య దృష్టియంటారు. దీనివల్ల మనస్సు స్తబ్దత చెంది, నిద్రపోవును. ఇదిగాక ఇంకా కొన్ని భయములున్నవి. అంతర జగత్తులో భూతములు, పిశాచములు ఉన్నవి. ఇవి తిరుగుతూవుంటవి. అప్పుడప్పుడు సాధకులను భయపెట్టుతుంటవి. ఇందువల్ల తెలియని సాధకుడు అపాయములపాలు పడవచ్చు. కనుక కన్నులు అర్ధనిమీలితములుగా వుంచాలి. దీనిని అష్టమీ దృష్టి అంటారు. కన్నులయందు జ్యోతి వున్నది. ఈ నేత్రముల దృష్టిని ఒకచోట వుంచినప్పుడు, ఆ రెండు నేత్రములలోని జ్యోతి ఒకచోట చేరును. అందువల్ల అక్కడ వెలుగు కనిపించును. ముద్రలలో కూడా ఇట్టి చూపులను చూపుతారు. భ్రూస్థానంలో జ్యోతిః ప్రవాహము కలుగును. ఇందుకు ముఖ్యంగా గమనించవలసినది శ్వాస. మనస్సుకు, చూపుకు, శ్వాసకు సంబంధమున్నది. వీటిలో ఏది స్వాధీనమైనా, తక్కినవి స్వాధీనమైనట్లే. ఈ సిద్ధాంతము శ్వాసకు ఎక్కువ ప్రాముఖ్యమిచ్చింది. శ్వాస హృదయమునుండి వస్తుంది. హృదయచలనమును ధ్యానించినయెడల, శ్వాస లయబద్ధమగును. హృదయం ఏవిధంగా కొట్టుకుంటుందో చూస్తూ వుండొచ్చు. శ్వాస లోనికీ బైటకిపోవుట హృదయంవద్ద చూస్తుండొచ్చు. ఇక్కడ సిద్ధిపొందిన తర్వాత, నాసికాగ్రమందు శ్వాసనడకను గమనిస్తూ వుండొచ్చు. ఈ సాధనవల్ల శ్వాసనడక నిమ్మళిస్తుంది. శ్వాస నిమ్మళించినకొలదీ హృదయంకూడా నిమ్మళించి ప్రశాంతత పొందును. చివరకు శ్వాస పూర్తిగా కట్టుబడిపోతుంది. అప్పుడు సమాధిసిద్ధి కలుగుతుంది. జ్యోతిర్దర్శనం కలుగుతుంది. శ్వాసనియమమునకు భారతీయులు ఆసన ప్రాణాయామమును చెప్పుతారు. ఈ గ్రంథంలో చెప్పబడలేదు. బహుశః ఈ భాగము పోయివుండొచ్చు. సాధన మధ్యలో కూడా, మనస్సు ఒకొక్కసారి ఉద్రేకపడుతుంది. బెదరిన ఎద్దువలె వుంటుంది. అప్పుడు ఆ మనస్సుతో తగవుపడి అణచుట లాభంలేదు. లాభంలేకపోగా చాలా అపాయం కలుగును. అట్టి సమయాల్లో సాధన మానుకోవాలి.

# హిరణ్మయపద్మ రహస్యము

లేచి అటూ ఇటూ నడవటం మంచిది. మనస్సు తగ్గి ప్రశాంతమైతే సాధనకు రావచ్చు, లేనియెడల ఆ పూట కంతే - సాధనకాలమందు కోపతాపములు లేకుండా వుండాలి. శరీరము మనస్సుతోపాటు ఆరోగ్యంగా వుండాలి. సాధకుడు సాధనలో భ్రూస్థానముమీద, నాసికాగ్రంమీద, రెండుకన్నుల దృష్టిని నిలిపి అర్ధనిమీలితంగా చూస్తుండాలి. ఇదే సాధనరహస్యం. ఇతరమేమీ అవసరంలేదు. తేజఃప్రవాహము దానంతటకదే కలుగుతుంది. సాధనకాలమందు అనేక ఆలోచనలు వస్తూవుంటవి. సముద్రంలోని అలలవలె వస్తూవుంటవి, పోతూవుంటవి. బజారున మనుష్యులు వస్తూ పోతున్నట్లుగా వుంటవి. వీరిని పలుకరించరాదు. ఎటునుండి, ఎక్కడనుండి ఆలోచనలు వస్తున్నవో, ఎటు పోతున్నవో గమనిస్తుంటే చాలు. వాటిని రాకుండా బలం ఉపయోగించకూడదు. ఒక ఆలోచనుండి ఇంకో ఆలోచన తెంపులేకుండా వస్తుంటవి. చూస్తూ కూర్చోవాలి. కొంతకాలానికి వాటంతటవే తగ్గిపోతవి. అప్పుడు మహాప్రశాంతంగా వుంటుంది. దీనివల్ల ధ్యానము సవ్యంగా నడుస్తున్నట్లు గుర్తు. కొన్ని నిదర్శనములు కనుపిస్తవి. ఒక్కొక్కసారి అప్పుడే స్నానం చేసినప్పుడు ఎంతసుఖంగా వుంటుందో అట్లా వుంటుంది. మకరంద పానం చేసినట్లుంటుంది. ఇందువల్ల హిరణ్మయపద్మము మొగ్గ తొడుగుతున్నట్లు సూచన. ఇట్లు కొంతకాలం సాధనచేయాలి. తర్వాత ఆజ్ఞాచక్రంలో శరదృతువులోని పున్నమనాటి వెన్నెల కనుపించును. షోడశకళా ప్రపూర్ణుడైన జాబిల్లి వెండి వెన్నెలలను వర్షించును. సాధకుడు ఆనందంతో తన్మయుడౌను. ఇది హిరణ్మయ పద్మము వికసిస్తున్నట్లు గుర్తు. కొంతకాలానికి శరీరము పర్వతంవలె స్థిరమైనదానివలె తోచును. ఏనుగువలె బలం వచ్చినట్లు కనుపించును. కష్టసుఖాలనే తుపానులకు చెదరనట్లుగా తోచును. శరీరము సువర్ణచ్ఛాయ పొందును. జ్యోతిస్సముద్రము కనుపించును. అంతటా వెలుగు వెల్లువలే. దీనితో హిరణ్మయ పద్మము వికశించినట్లు సంకేతము. కొంత కాలానికి దీనిలో ఒక బంగారుమూర్తి దర్శనమిచ్చును. బుద్ధ భగవానుడే ఇతడు. ఇతడు స్వర్ణమూర్తి. ఈ హిరణ్మయపద్మము భారతీయుల సహస్రార పద్మమని నా ఉద్దేశ్యము. భారతీయ సంప్రదాయ ప్రకారము సహస్రారకమలం వికసించుటే సిద్ధి. కుండలిని మేల్కొని సహస్రారమందు ప్రవేశించును. అక్కడ పరమేశ్వరునితో సంగమించును. కుండలిని విద్యుత్ కంకణమువలె, అగ్నిజ్వాలవలె, మెరుగుపెట్టినబంగారు పాచికవలె వుంటుందని జ్ఞానేశ్వరుడు భగవద్గీతావ్యాఖ్యానంలో వ్రాశాడు. బౌద్ధులకు స్వర్ణబుద్ధునివలె భారతీయులకు, పార్వతీపరమేశ్వరులు కనుపించెదరు. కైలాసపర్వతంమీద గొప్ప కమలంలో బుద్ధుడు వుంటాడని చీనా వారి నమ్మిక. భారతీయులు కైలాస పర్వతము మీద పార్వతీ పరమేశ్వరులుంటారని నమ్ముతారు. పార్వతీదేవి, ఈ పర్వతరాజు కూతురు. ఈ కైలాసపర్వతము, ఆత్మ విద్యా వీణా దండము శిఖరమందున్న సహస్రారకమలము. ఇదేహిరణ్మయ పద్మము.

ఇవిగాక ఇంకా అనేక అనుభవాలు కలుగును. భౌతిక ప్రపంచములో వేలఘనము పొందినవానికన్న, సాధకుడు ఈ అనుభవాలు పొందినప్పుడు ఎక్కువగా ఆనందించును. తన్మయత్వము చెందును. భౌతికసుఖం కన్న, ఆత్మ సుఖంచాలా గొప్పదని గాంధీమహాత్ముడు నిష్కామయోగంలో వ్రాశాడు. ఆత్మసుఖము అనుభవించినవాడు, ఇంద్రియసుఖాలను తుచ్ఛంగా చూస్తాడని అన్నారు. అట్టి సుఖము ఇది. దివ్యులు, లోయలోవున్నట్లు తెలుస్తుంది. చాలా దూరంగా మాట్లాడుతున్నట్లు వినబడుతుంది. కాని మాటలు స్పష్టంగా తెలుస్తవి. సాధకుడు ప్రశాంతంగా వున్నప్పుడు ఆతనికన్నులు మెరుస్తున్నట్లు కనుపిస్తవి. సాధకునిశరీరం, సాధకునికి కనుపించదు. లోన బైటా, వెలుగుతో నిండివుండును. ధ్యానముచేయుటకు అప్పుడు అసంభవంగా తోచును. ఏదో పైకి లాగుతున్నట్లు తోస్తుంది. సాధకుడు ఆకాశంలో తేలిపోతున్నట్లు తోచును.

అనుభవాలు అందరికి ఒకే విధంగా వుండవు. ఒకొక్కరికి ఒక్కొక్కవిధంగా వుండును. ఈ అనుభవములనుగురించి శ్వేతోపనిషత్తులో చెప్పబడ్డది. మంచు, పొగ, నిప్పు, గాలి, మిణుగురు పురుగులు, మెరుపులు, చంద్రుడు కనుపిస్తుంటవి. ఇందువల్ల సాధకుడు బ్రహ్మజ్ఞానం పొందుతున్నట్లు భావించవచ్చును. భగవద్గీతలో, బ్రహ్మాండమైన వెలుగువలె అర్జునునకు కనుపించినట్లు వ్రాయబడ్డది. సర్వేపల్లి రాధాకృష్ణగారు భగవద్గీతవ్యాఖ్యలో మహనీయు లందరికి జ్యోతిఃస్వరూపంలో భగవంతుడు కనుపించినట్లు వ్రాశారు. ఏసుప్రభువు జ్ఞానస్నానం చేసుకుని పైకి రాగానే జ్యోతి

కనుపించింది. మహమ్మదువారికి కూడా జ్యోతి స్వప్నం కనుపించినట్లు చెప్పతారు. ఏదో ఊహించి వ్రాసినవి కావు ఇవి. ఋషులు తమ అనుభవంలో చూచి వ్రాసినవి. మంత్రపుష్పంలో నల్లని మేఘం మధ్య మెరుపువలె, అగ్నిజ్వాలవలె పరమాత్మ వున్నాడని చెప్పబడ్డది. సాధకులు మబ్బులోని మెరుపువలె చూచి భయపడి సాధననుండి పారిపోవుటకద్దు. ఏదో ఉరిమి మీద పడుతుందనే భయం కలుగుతుంది. అగ్నిజ్వాలలూ అంతే. తేజస్సముద్రం కనుపించినా అయోమయావస్థ వస్తుంది. భయం ప్రవేశిస్తుంది. అందువల్ల సాధననుండి లేస్తారు. ఇది మంచిదికాదు. భయమును తొలగించుకోవాలి. సాధనలో, నేను అనేదానిని పోగొట్టుకోవాలి. నేను అనేది ఉన్నప్పుడే భయంవస్తుంది. అహం నశించినప్పుడు ఏదీవుండదు. అరవింద మహర్షి జ్యోతిర్దర్శన మప్పుడు కదలకూడదని సెలవిస్తారు. కదలగానే జ్యోతి అదృశ్యమవుతుంది. వెలుగుదానంతటది, ఇష్టమైనప్పుడే తళుక్కునకనుపిస్తుంది. సాధకుడు కోరినప్పుడల్లా జ్యోతికనుపించదు. కానిపూర్ణసిద్ధులు తాము కోరినప్పుడు జ్యోతిర్దర్శనం పొందగలరనీ, తాము కోరినంతకాలము దానిని ఉంచగలరని అరవిందులవారు చెప్పారు.

జ్యోతిర్దర్శనమే చివర అనుకోరాదని రాధాకృష్ణ పండితులు భగవద్గీత వ్యాఖ్యలో వ్రాశారు. కొన్ని ఉపనిషత్తులు జ్యోతి తర్వాత శూన్యం వున్నదంటున్నవి. శూన్యం దాటిన తర్వాత బ్రహ్మజ్ఞానం కలుగుతుందంటారు. బ్రహ్మజ్ఞానమే అమృతసిద్ధి. దీనిని లోకకల్యాణమునకై వినియోగించాలంటారు రాధాకృష్ణులు. లోకకల్యాణమునకు, ధర్మసంస్థాపనకు దానిని వినియోగించారు. మహాత్ములంతా ఇంతే. చీనావారు కూడా తన ఒక్కనికైవల్యమువేకాక, జీవుల అందరికైవల్యమును అపేక్షించమంటారు. ఇందుకుతగ్గట్లు నడవమంటారు. భారతీయ ఋషులు సమస్తలోకములు సుఖించుగాక యని, శాంతిపొందుగాక అని ఆశించారు. భారతీయుల, చీనావారి సాధన ఉద్దేశ్యము ఇదే.

అసతో మా సద్గమయ
తమసో మా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతం గమయ.

అయిరోపాదేశము పూర్తిగా భౌతికవాదంలో మునిగివున్నది. ఏది నమ్మినా వాటికి కార్యకారణ సంబంధం వుండాలంటారు. కాని అక్కడ చాలా మందిలో అసంతృప్తి కనుపిస్తుందని డాక్టరు యూంగ్ అంటాడు. ఇందువల్ల వారిలో శరీరమానసిక వ్యాధులు వ్యాపించిన వంటున్నారు. ఆసియావాసులు జబ్బులకు గాయత్రులు మంత్రాలు వుపయోగిస్తే ఎగతాళిచేశాము. ఇప్పుడు కొన్ని వ్యాధులు మందులకుకూడా లొంగుటంలేదేమని ప్రశ్నిస్తున్నాడు డాక్టర్ యూంగ్. ఒకస్త్రీ నరాలజబ్బుతో బాధపడుతుండేదట. అనేకమంది వైద్యులవద్దకు వెళ్లి మందుతిన్నది. కాని నయంకాలేదు. ఒకమానసిక వ్యాధుల వైద్యునివద్దకు వచ్చింది. అతను, నీకు జబ్బుఏమిటని అడిగాడు. ఆమె జీవించటందేనికి? అని డిగింది. ఈప్రశ్న మనస్సుకు శాంతిలేకుండా చేస్తున్నదన్నది. ఈ వైద్యుడు కూడా ఆసంగతి నాకు తెలియదన్నాడు. భౌతికవాదుల స్థితి ఇట్లు వుంది. ఈ యోగసిద్ధాంతము, యూరోపియనులకు లాభించవచ్చని ఆశించి ఈగ్రంథమును ప్రచురించాడు యూంగ్. నేటి భారతీయులు కూడా ఇట్లే వున్నారు. యూంగ్ మానసికవైద్యుడు. గొప్పపండితుడు, అనుభవజ్ఞుడు. అనేకవిద్యలను శాస్త్రములను చదివాడు, 'Zen' (జన్) అనే యోగవిధాన గ్రంథమును వ్రాసిన మహనీయుడు. తనఅనుభవములు ఈగ్రంథములో వ్రాశాడు. హిరణ్మయపద్మము ఒక మండలమంటాడు. మనశాస్త్రములలో యంత్రతంత్ర మంత్రము లున్నవి. ఇవి బహుశక్తివంతములు. యూంగ్ యొక్క ఒకమానసికరోగి ఒకసారి నృత్యంచేసిందట. మండలనృత్యంఅని ఒకవిధానము వున్నది. ఇట్టిదివున్నదని ఆమె ఎరుగదు. కాని శాస్త్రోక్తంగా ఆమె మండల నృత్యం చేసిందట. తాను ఆశ్చర్యపడ్డానని అన్నాడు. ఈ సిద్ధాంతం ప్రకారం కొందరు సాధనలు చేశారు. కొందరికి మంచిలాభములు కలిగినవని యూంగ్ గారికి తెలిపారట. కాని ఈసాధనను జాగ్రతతో చేయాలి. సాధకునికి అవ్యక్త ప్రపంచముతో సంబంధము కలుగుతుంది. అవ్యక్తప్రపంచము చాలా తీవ్రమైనది. దాని ధాటికి మనము ఆగలేము. ఇందుకు సాధనాబలం, పెద్దల ఆశీర్వచనము, భగవంతుని దయ కావాలి.

ఇప్పుడు భౌతికశాస్త్రము ఎక్కువగా వృద్ధైంది. ఇది మానవుని సుఖపెట్టుటకు బదులు, కష్టములలో పెట్టుతున్నది. భౌతికవాదులు ప్రతివిషయాన్ని కారణం లేకుండా నమ్మరు. భౌతికవాదము ప్రపంచ రహస్యాన్ని కనుక్కోలేదు. ఇప్పుడు, భౌతికములకు కూడా, అవ్యక్త కారణమున్నదని చెప్పుతున్నారు. అవ్యక్తమువద్దకు వెళ్లగలది ఆత్మవిద్య ఒక్కటే. నేటిపరిస్థితులకూ, అసంతృప్తికీ ఆధునిక పండితులైన యూంగ్ వంటిమహనీయులు, ఈ చీనావారి సాధన ఉపయోగకారి అని తలుస్తున్నారు. ఇందువల్ల శరీరము మనస్సు ఆత్మలు శాంతిపొందును. ఇదే అమృతత్వము.

---

మ. రా. 'స్వర్ణపుష్ప రహస్యము' ('Secret of the Golden Flower') అనేగ్రంథం ఆధారంగా ఈ వ్యాసం వ్రాశాను.

# ఆకాశదీపం

'శ్రీ విరించి'

ఒక్కసారిగా పెద్దకూత పెట్టి రైలుబండి బయలుదేరింది. ఒక మూలగా చతికిలబడిన సుబ్బన్న తాత 'అమ్మయ్యా' అనుకున్నాడు. గంట సేపటినుంచి యీ క్షణంకోసరం ఎదురుచూస్తున్నాడు. ఎంతకూ రైలుబండి బయలుదేరక పోవడంతో 'యింక యిది కదలదా యేమిటి?' అనిపించింది కూడాను. ఆఖరుకు ఎలానయితేనేమి రైలు బయలుదేరింది. మంచిదోరు అనుకున్నది కూడాను!

ఎముకలు కొరికే చలి. చుట్టూ చీకటి. ఈ గాఢాంధకారంలోనే నల్లటి ముసుగు వేసుకున్న ఆకాశం అంచులో మిలమిల మెరుస్తున్న నక్షత్రాలు కనుపిస్తున్నాయి. బండి హోరుతోపాటు బయటి చలికూడా ఎక్కువవుతుంది. సుబ్బన్న తాత తను కప్పుకున్న చిగుగుల గొంగళి మరింత దగ్గరగా లాక్కున్నాడు. ఒళ్లో పడుక్కుని అప్పుడే కునికిపాట్లు తీస్తున్న రాముడికి నిండుగా కప్పాడు. పసి వెధవ! ఈ చలిగాలికి వాడి శరీరం ఎలా పదునుదం అవుతోందో యేమిటో! వాడిని యింకా గట్టిగా రొమ్ముకు అదుముకుని చలిబాధ తెలియకుండా తన శరీరంతో కప్పుతున్నాడు తాత!

రైలుబండిలో ఆట్టే జనం లేరు. అక్కడక్కడా చెదురుగా బల్లకు యిద్దరు ముగ్గురు కూర్చున్నారు. అయినా సుబ్బన్న తాత తన మనమడిని పెట్టుకుని కిందనే ఒకమూలకు ఒరిగి కూర్చున్నాడు. పడుకున్నా అక్కడే పడుకుంటాడు. తనకు అతి ఆశ లేదు; తన కోరికలన్నీ తనకు తగినంతిగానే వున్నాయి! ఈ కూర్ప్రవాసమయినా సజావుగా సాగి అనుకున్నట్లు రేపు ఉదయం ఆరుగంటలకల్లా బెజవాడ చేరుకుంటే అంతే చాలు! బెజవాడ చేరుకున్నాక యింకేం దిగులు, విచారం వుండదు. కాని యీ బండిలో వున్నంతసేపు కష్టమే. టిక్కట్ల తనిఖీకి ఎవరన్నా వొస్తే తనకు ప్రమాదమే! వాళ్లలో నానారకాలవాళ్ళు! ఒక్కొక్కళ్లయితే చూచీచూడనట్లు వొదిలేస్తారు. కాని కొందరు మాత్రం స్టేషన్లో దింపి, తన్ని, చేతిలో వున్న రాగిదమ్మిడీలు వసూలుచేసేంతవరకు విశ్రాంతి తీసుకోరు. వాళ్ళకు అంత పట్టుదల ఎందుకో! తనేం మహారాజులాగ పైన పడుకుని ప్రయాణం చెయ్యటం లేదుకద! అందరి కాళ్లకీ అడుగున అందరి దయాదాక్షిణ్యాలమీద ఆధారపడి కూర్చున్నాడు! అయినా కొందరు అయ్యలకు తనంటే యింతకోపం ఎందుకో సుబ్బన్న తాతకు అర్థంకాదు. వారి సొమ్ము తనేం కట్టుకుపోతున్నాడు. ఇస్తే కాలణా జోలెలో వేసుకుంటాడు, లేకపోతే నోరు మూసుకూర్చుంటాడు. పోనీ టిక్కెట్టు కొనుక్కుందామా అంటే అందుకు తాహతు ఎక్కడుంది? ఆపాటి శక్తి వుంటే తనకు యిన్ని అవస్థలెందుకు? అగచాట్లు ఎందుకు?

రాముడు బాగానే కునుకుతీసి నిద్రపోతున్నాడు. తాతకు నిద్రఅనే మాటే స్ఫురణకు రావడం లేదు. గుండెల్లో చెప్పరాని భారం. అడపదడప దగ్గు. ఈ దగ్గే అతని ప్రాణం తీస్తోంది. మనమడి ముఖంలోకి తదేకంగా చూస్తూ ఒక్కొక్క అశ్రుకణమే రాలుస్తున్నాడు, పాపం. ఎప్పుడూ ఒక్కటే ఆలోచన — ఒకటే ఆశ — ఒక్కటే కోరిక! తను ముసలివాడైపోతున్నాడు: బతికినన్నాళ్లు బతకబోడు. తను కాస్తా కనుమూశాక యీ పసివెధవ రాముడి సంగతేమిటి? వీడికింక దిక్కెవరున్నారు? వాడికేదయిన మార్గం చూపించిపోతే తనకు యింత బాధ వుండదు!

చేతుల్తో ముడతలుపడ్డ శరీరాన్ని తడుముకుంటున్నాడు తాత! ఇన్నాళ్లూ తనకాలం చురుగ్గా సాగిపోతూ వుండేది. కాని యిప్పుడు—బొత్తిగా వారంరోజులనుంచి—అడుగుతీసి అడుగు వేయడమే ప్రళయమైపోతూంది. కళ్లు మసకలు మసకలుగా కనిపిస్తాయి. ఇల్లా యింకా ఎన్నాళ్లు దొర్లుతాయో తెలియదుగద. ఈ కాళ్లుచేతులు పడిపోయి కంటిచూపుగూడా మాయమైపోయి—తను యేం చేసేట్లు? మనమడి గతి యేమయ్యేట్లు?—ఈరోజు తనస్థితి మరీ అధ్వాన్నంగా వుంది. ఆరోగ్యం పూర్తిగా నాశనమైపోయింది. ఇంక తన వ్యవహారం రోజుల్లోనే పడిపోయినట్లుంది. తనచావును గురించి అంత బాధలేదు. కాని రాముడు, యింకా పన్నెండేళ్లయినా నిండని వాడు—యీ రాముడు, యేం అయ్యేట్టు? ప్రతిరోజూ యిదే ప్రశ్న. ఇదే వేదన! కాని జవాబు దొరకదు. నీరసం ఎక్కువవుతుంది. నరాలు వొంగిపోతాయి. హృదయం బాధగా మూలుగుతుంది. ఈ దేశంలో తనకు యేం మిగిలివుంది? ఎవరు మిగిలివున్నారు? అంతా తనే! తనకు మనమడు, మనమడికి తను!

అనాథ బిడ్డడైన రాముడికి యేదో జీవనమార్గం చూపించాలి! కాని యేం చూపించాలి? సుబ్బన్న తాత కళ్లు రెండూ నిర్విరామంగా నీళ్లు కారుస్తున్నాయి. మనమడివంక దిగాలుగా చూస్తూ చేతుల్తో తల బాదుకుంటున్నాడు.

కుర్రవాడు కదుల్తున్నాడు. కొద్దికొద్దిగా కళ్లు తెరుస్తున్నాడు. ఈ చంద్రుడటి ముఖం, విశాలమైన కళ్లు లేతబుగ్గలు, నిడివైన ముక్కుతో వాడు ఎంతఅందంగా కనిపిస్తున్నాడు. బిడ్డకి పూర్తిగా తల్లిపోలికే వచ్చింది! సందేహం లేదు—వీడు తప్పకుండా అదృష్టవంతుడే అవుతాడు. హాయిగా జీవితం గడుపుతాడు. కులాసాగా బతుకుతాడు. కాని అందుకు తన ప్రయత్నం వుండాలి కద! ఏం చేయాలి, ఎట్లా చేయాలి? మొదటి నుంచీ అదృష్టం అంటే యేమిటో సుఖం అంటే ఏమిటో తెలియని యీ కుర్రవెధవ హాయిగా బతుకుతాడా? ఏమో, ఎవరికి తెలుసు!

'రాముడూ, నిద్రపట్టిందా నాయనా?'

'ఊఁ—'

'నిద్రపో తండ్రీ, నిద్రపో తెల్లారాక లేపుతాను—'

'ఎక్కడికి పోతున్నాం తాతా?' —

'బెజవాడ!'

'బెజవాడా? యింకా ఎంతదూరం తాతా?'

'ఓ—బోలెడు దూరం!'

'తాతా, ఎందుకుపోతున్నాం ఆవూరు? మన వూరికంటే పెద్దదా తాతా, బాగుంటుందా?'— తాతకి ఒక్కసారి నవ్వువచ్చింది. మనమడిముఖంలోకి లోతుగా చూచి ముద్దు పెట్టుకున్నాడు.

'చెప్పు తాతా!'

'అవును నాయనా! నిద్రపో, హాయిగా.'

తాత తర్వాత మనసులో నవ్వుకున్నాడు. కాని నవ్వుకోవడం చేతకాక, ఒకనిమిషం అయ్యాక ఆగిపోయాడు. కుర్రవాడికి తనేం సమాధానం చెప్పగలిగాడు? ఇంతకూ తను బెజవాడ ఎందుకు వస్తున్నట్లు? తనకే అర్థంకాదు స్పష్టంగా! తనకు ఒకవూరేమిటి, వాడేమిటి?—ఎక్కడమాత్రం ఏముంది? ఎక్కడైనా పూటకు ఇన్ని మెతుకులు దొరికితే అక్కడే తన నివాసం! అక్కడే తనయిల్లు. ఒకవూరేమిటి, నగరమేమిటి ఇట్లా ఎన్నోవూళ్లు, పట్టణాలు, మహానగరాలు తిరిగాడు, యింకా జీవితయాత్ర సాగిస్తూనే వుంటాడు, చివరివరకు.

మళ్లీ సుబ్బన్న తాతకు మనమడిని గురించే ఆలోచన పోయింది.

వాడు పసివాడు. ఇంకా వాడికి యేది సత్యమో యేది అపసత్యమో తెలీదు. ఏది మంచో చెడ్డో తెలీదు. కాని వాడు యిప్పుడిప్పుడే యేదో ఆలోచిస్తున్నాడు. కొద్ది కొద్దిగా అన్నిసంగతులు నేర్చుకుంటున్నాడు. తనతో గడ్డిగా వాదనలకు కూడా దిగుతున్నాడు. వాడికి తనకున్నంత భయంలేదు, ముందును గురించి. ఎట్లా వుంటుంది? తన వయస్సెంత, వాడివయస్సెంత? తన అనుభవంముందు వాడెంత? తనజ్ఞానం వాడికి అప్పుడే ఎలా కలుగుతుంది? అందుకనే అట్లామాట్లాడుతాడు, తను చెబితే నేర్చుకుంటాడు. వాడికి ముందును గురించి యేదో మొండిధైర్యం వుంది. వాడికి తనకంటే ఎక్కువ ధైర్యం, ఎక్కువ చొరవ!

'నేను లేకపోతే యెట్లా బతుకుతావురా?' అంటే నిర్లక్ష్యంగా తల ఎగరవేస్తాడు. తెలిసీ తెలియని యీడు. ఎరిగీఎరగని వివేకం. అందుకనే యిట్లా ప్రవర్తిస్తాడు. వాడికి యిలాంటి మాటలు తన నోటిమీదుగా వినడం బాగా అలవాటయిపోయింది. బాగా విసుగెత్తిపోయాడుకూడాను! తనవేపు వంకర చూపొకటి పారేసి నిర్లక్ష్యంగా నిర్లిప్తంగా 'ఆమాట నేను ఎప్పుడో చెప్పేశానుగా!' అంటాడు. మొదట మొదట వాడు తనమాటలకు భయపడి యేడుస్తూ వుండేవాడు. కాని క్రమంగా నిర్లక్ష్యం యేర్పడింది. వాడి నిర్లక్ష్యానికి తనకు అప్పుడప్పుడూ కోపంవస్తూ వుంటుంది, పెద్దగా అరిచేవాడు: 'నువ్వు సోమరి వెధవ్వి! నామీద గౌరవంలేదు. ఈ ముసలి వెధవ ఎప్పుడు చస్తాడా, ఎప్పుడు ఈ పీనుగను ఊడ్చి అవతల పారవేద్దామా అనిచూస్తున్నావు! నీకు జీవితం అంటే ఎంతనికృష్టమైనదో తెలీదు. హాయిగా వేడి వేడి బువ్వ తిన్నట్టు వుంటుందనుకుంటున్నావు! నీచేత యేమవుతుంది. వేలెడులేని గుంటడివి. నీకు ఎవరుమాత్రం యెందుకని సహాయంచేస్తారు? నీకు ఎవ్వడూ ఎర్రని యేగానయినా ధర్మంచెయ్యడు. దరిద్రంలోపుట్టి దరిద్రంలో పెరిగిన ముసలివెధవను నాకే ముష్టిఎత్తుకోవడం ఎంతో కష్టంగా సిగ్గుగా వుంది. ఇంక పసుచు వెధవవు నీవల్ల యేమవుతుంది? ఎవడూ నీ ముఖాన ఉమ్మయినా వెయ్యడు. బండబూతులు తిట్టి బడితె పూజ చేస్తారు! వాళ్లదృష్టిలో బిచ్చగాడు మనుష్య మాత్రుడనుకుంటున్నావా? — గడ్డిపోచకంటే కనాకష్టం!—'

ఈవిధంగా తను వాడికి ఎంతగా విడమర్చి చెబుతూన్నా అర్థంచేసుకోకుండా వున్నాడు. సుబ్బన్న తాత హృదయం విచారంతో బాధలో కుమిలిపోతూంది. కళ్లు ముడతలు పడుతున్నాయి.

మహాప్రవాహంలా దొర్లిపోయే తన మాటల మధ్య, వాడు—బొత్తిగా అనుభవంలేని పదకొండేళ్ల

గుంటవెధవ — యేమీ లెక్కలేకుండా యిలా అంటాడు: 'ఊరుకో తాతా! నన్నుగురించి యేమీ దిగులుపడకు! నాకేం రాజాలావుంటాను. ఏ కొట్లోనో గుమాస్తాగా చేరుతాను. పరుకులు అందించేపని చేస్తాను. నే నేదో బతుకుతాగా!' ఏమి నిర్భయం? 'వాళ్లు నీ ప్రాణాలు తోడేస్తారురా! నిన్ను సుఖంగా వుండనివ్వరురా!' అంటాడు తను. 'వాళ్లేం చెయ్యరు. ఒకవేళ వాళ్లు యేదేనా చెయ్యిచేసుకున్నా ఆ కొలువుమాని మరోచోట చేరతాను. ఏదేమయినా ఒకడికింద తొత్తుగా పడివుండాల్సిన అవసరం నాకేం లేదు!—లేకపోతే యేదన్నా ధర్మసత్రంలో చేరతాను.'

వాడి యీ ధోరణే తనకు అర్థంకాదు. వాడికింత మనోధైర్యం ఎట్లావచ్చింది? ఎక్కడనుంచి వచ్చింది? పైగా వాడికి తను కష్టపడటం నిరంతరం తాపత్రయపడటం బొత్తిగా యిష్టంలేదు. "ఎందుకు తాతా, యిట్లా ఊరు ఊరూ తిరగడం? ఎందుకిట్లా డబ్బులుపోగు చెయ్యడం?' అంటాడు. వాడంటే తనకు ఎంత ప్రేమయినా యీ మాటలతో కోపంవస్తుంది. 'ఓరి కుర్రకుంక, నోరుముయ్యి. నే నీ యమయాతనంతా ఎవరికోసరం పడుతున్నా ననుకుంటున్నావు? నా తాపత్రయమంతా నిన్ను యీ దరిద్రంనుంచి తప్పించడానికే! ఇకనన్నా నోరుమూసుకుని, సంగతులు తెలుసుకుని—మెదులు!' అంటాడు తను. కాని వాడు ఇంకా అర్థంచేసుకోలేకపోతున్నాడు. అందువల్ల తనబాధ మరింత ఎక్కువ అవుతోంది. కాని వాడు అర్థంచేసుకోగలిగినా చేసుకోలేకపోయినా తన కర్తవ్యం ఒకటే కద!

చుట్టూ అంతా నిశ్శబ్దం. రైలెక్కిన మహరాజులు దుప్పట్లు ముసుగులుతన్ని నిద్రపోతున్నారు. సుబ్బన్న తాతమాత్రం యింకా అక్కడే ఆ మూలనే ఒదిగి కూర్చున్నాడు. పడుకుందామంటే చలి! పైగా ఒడిలో పడుకున్న మనమడు కదుల్తాడు. తన నిద్రకేమొచ్చె! వాడికి కంటినిండా నిద్రపట్టితే అంతే చాలు! అంతా వాడికోసమేగాని తనకోసం కాదుగా!

సుబ్బన్నతాత కూర్చునే కునికిపాట్లు పడుతున్నాడు. మధ్య మధ్య శరీరం తడుముకుంటున్నాడు. మనమడిని నిమురుతున్నాడు. గజగజ లాడించే చలిలో దగ్గరగా తీసుకుంటున్నాడు.

*　　　*　　　*

తెల్లవారింది. రైలు ఆగింది. జనం బిలబిలా నడుస్తున్నారు. లోనికి ఎక్కేవాళ్లు, లోనించి దిగే వాళ్లు—చాలా రద్దీగావుంది రైలుబండి గుమ్మాలదగ్గర. తెల్లవారడం పూర్తయింది కాని యింకా ఎండపొడలు పడటంలేదు. ప్లాట్‌ఫారమ్‌మీద అందరూ హడావడిగా నడుస్తున్నారు, పరుగెత్తుతున్నట్లుగా నడుస్తున్నారు.

సుబ్బన్నతాత రాముడిని లేపి కిందికి దింపాడు. 'మాడరా మాడు- కళ్లువిప్పి మాడు. చుట్టూ ఎంత గొప్పగా వుందో!' అన్నాడు.

రాముడు నిద్రకళ్లు నులుముకుంటూ చుట్టూరా ఒకసారి కలయచూచాడు. ఈ జనాన్నందరినీ చూచి మనమడు భయపడిపోతా డనుకున్న తాతకు నిరాశే మిగిలింది. రాముడు చాలా సంతోషంగా హుషారుగా తయారయాడు. నవ్వుతూ చప్పట్లుచరిచాడు.

'ఉష్- గొడవచెయ్యకు. ఎవరన్నా చూస్తే పట్టుకుంటారు! పోలీసులకు పట్టిస్తారు!'

రాముడికి పోలీసులంటే సహజంగా భయం లేదు. తాత వాళ్లకు వూరికే వంగి వంగి దణ్ణాలు ఎందుకుపెడతాడో వాడికి అర్థంకాదు. అందుకనే వాళ్లు తాతని దబాయించి లాఠీలతోమోది డబ్బులు గుంజుకుపోతారు! వాళ్లను యేమీ పలకరించకుండా వున్నా సరిపాయె! అందుకనే తాతమీద కోపం రాముడికి.

'నేనేం గొడవ చెయ్యలేనే!'

'అదుగో మాడు అక్కడ నీళ్లకుళాయి. వెళ్లి ముఖం కడుక్కుందాంరా.'

ముఖం కడుక్కున్నాక తాత రాముడిని చేయి పుచ్చుకుని హోటలు గుమ్మం దగ్గరికి తీసుకెళ్లాడు.

'బాబూ! కుర్రాడికి నాలుగు రోజులనించీ భోజనంలేదు. ఏదయినా ధర్మప్రభువులు దయచేయించండి బాబూ! పసివాడు బాబూ!' అని కాస్సేపు అరిచాడు. ఎవ్వరూ వాళ్లముఖమయినా చూడలేదు.

'రాముడూ! ఆకలిగావుందా?'

'ఊఁ!'

'ఉండు నాయనా! ధర్మప్రభువులకు దయ కలగడంలేదు.' అంటూ ఒక అణా మిఠాయి కొనిపెట్టేడు, పక్కకొట్లోంచి. తాతదగ్గర డబ్బులుంటాయి, రాముడికి తెలుసు. కాని ఎంతో అవసరం వస్తే తప్ప ఖర్చుచెయ్యడు.

'నువ్వూ తిను తాతా మిఠాయి.'

'నాకు వొద్దులే, నాన్నా. నువ్వు కడుపు నిండా తిను.'

ఇద్దరూ మళ్లీ మంచినీళ్లు తాగారు.

ఇంక ఊళ్లోకి వెళ్లారు. పెద్దబజారు, ఆ బిలబిలా సాగిపోతున్న జట్కాలు, రిక్షాలు, మనుషులు-! ఎంత దూరం పోయినా తరగని రోడ్డు. తాత ఆగి, 'యిక్కడే ఎంత బాగా ఎక్కడాకా కూచుందాం, యిద్దరం ఒకచోటే కూచుందామా? వేరు వేరుగా కూర్చుందామా?' అన్నాడు.

మనుమడు జవాబు చెప్పేలోపునే 'కలిసి కూచుంటేనే మంచిది. నీకు సరిగ్గా యాచించడంకూడా చేత కాదు. ఎవరూ రాగి కానీ అయినా రాల్చరు!' అన్నాడు.

రాముడు మత్తుగా తల ఊపుతూ 'తాతా, నీకు దొరికిందంతా నువ్వే తినెయ్యవుగా! ఎట్లా అయినా ఒకటే!' అన్నాడు.

'ఓరి కుర్ర వెధవా! మన దగ్గరేం నిలవలుపడి వుంటాయనుకుంటున్నావా యేమిటి? డబ్బంటే నీకు గడ్డిపోచంతయినా విలువలేదేంరా? పదిరాళ్లు చేరితే, ఒక వేళ నేను కన్నుమూసినా ఫరవా వుండదు!' అని బుజ్జగించే ధోరణిలో అని తాత రాముడి తల మృదువుగా నిమిరాడు. అలా నిమురుతూ 'యింతవరకు నీ కోసం ఎంత నిలువచేశానో తెలుసా?' అన్నాడు.

'ఎంతేం?'

'పాతిక!'

రాముడిలో యీ అంకె యేమీ మార్పు తీసుకు రాలేదు. తాత గట్టిగా ఊపిరి సలిపి 'నువు కుర్రాడివి. నీకేం తెలీదు. సరేలే. ఇద్దరం విడివిడిగా పడదాం. అంతేనా?' అన్నాడు.

'అంతే!'

'సరే. నేను యిక్కడే కూర్చుంటాను. నువ్వు యీ రోడ్డు చివరకు వెళ్లి కూర్చో. ఎండ నడినెత్తిమీదికి వచ్చాక లేచి నా దగ్గరకు వచ్చేయి.' అంటూనే సుబ్బన్న తాత రాముడిని ముందుకునెట్టి తను అక్కడే రోడ్డుకు పక్కగా కూలబడ్డాడు. రాముడు పదడుగులు ముందుకు వేసేటప్పటికి వెనకనించి 'దయామయులార! ధర్మప్రభువులార!' అన్న అరుపులు వినిపించాయి. ఎవరో చెడిపోయిన వీణను పలికిస్తున్నట్లుగా వున్నది గొంతు. తాత గొంతు యీ మాటలు పలుకుతున్నప్పుడల్లా రాముడికి గుండెల్లో దేవినట్లు వుంటుంది. ఎవరూ యెర్రని యేగానయినా దానం చేయనప్పుడు తాత యేడుపు ముఖం మరీ ఎబ్బెట్టుగా వుంటుంది.

రోడ్డు రొదలో కలిసిపోయి తాత అరుపులు ఆక్రందనలు వినరావడం లేదు. రాముడు రోడ్డు చివరకు చేరుకున్నాడు. బుజంమీది గుడ్డ నేలమీద పరిచాడు. దాని పక్కగా కూర్చుని చేతులు ముందుకు చాచాడు. ఆకాశం వేపు ఒకమారు చూచాడు.

గుడ్డమీద డబ్బులేమీ పడటం లేదు. రాముడి నోటిమీదుగా మాటలుకూడా యేమీ రావడం లేదు.

ఒక గంట గడిచింది. తను మరీ రోడ్డుకు చివర కూర్చున్నాడు. దుకాణాలన్నీ దాటి దూరంగా కూర్చున్నాడు. జనం ఎవరూ మెసలకుండా ఉండేచోటు చూచుకుని కూర్చున్నాడు, రాముడు. ఎక్కడో దగ్గరలోనే పసిపిల్ల యేడుపు స్వరం వినిపించింది. ఎవరో చిన్న అమ్మాయి — ఏడెనిమిదేళ్లు వుంటాయేమో —. యేడుస్తూ రోడ్డుమీదనుంచి తన వైపుగానే వస్తూంది రాముడు తీక్ష్ణంగా చూచాడు ఆ అమ్మాయివంక.

అమ్మాయి చాల అందంగావుంది. సుకుమారంగా వుంది. మంచిగౌను వేసుకుంది. మెడలో సన్నటి గొలుసు వేసుకుంది. రోడ్డుమీదే యేడుస్తూ వస్తోంది. ఏడవడంవల్ల అతి సుకుమారమయిన ఆ అమ్మాయి ముఖం కందగడ్డలా ఎర్రగా కందినట్లనిపించింది— రాముడికి. ఆ అమ్మాయి గౌనుతోటే, మళ్ళీ మళ్ళీ, కళ్లనీళ్ళు తుడుచుకుంటూంది. ఒంట్లో శక్తిలేనట్లు నీరసంగా కాళ్లు యీడ్చుకుంటూ నడుస్తూంది. ఎక్కడికో, ఎందుకో?

ఆ అమ్మాయి తనకు దగ్గరగా రాగానే రాముడు "ఎందుకమ్మాయి, యేడుస్తున్నావు?" అనడిగాడు సాదరంగా. ఆ పిల్ల యేడుపు ఆపేసి అబ్బాయివంక సూటిగా చూచింది. ఆ పిల్ల పెదవులు మళ్ళీ వణికాయి; ముఖం ముడుచుకుపోయింది. మళ్ళీ మెల్లిగా, నెమ్మదిగా అడుగులు ముందుకు వేయసాగింది. ఈ అమ్మాయి యేడుపుతో తనకేదో సంబంధం వున్నట్లనిపించింది రాముడికి. ఆ పిల్లవెంట నడుస్తూ అనునయంగా అన్నాడు: 'ఏడవకమ్మా! ఛీ! పెద్దదానివి కదూ, యిలా యేడవచ్చా? తప్పుకదూ?'

ఎదురుగా నిలుచుని 'యెందుకు యేడుస్తున్నావో చెప్పవూ?' అనడిగాడు.

'ఆ! నువ్వయితేనా?'—' అంటూ ఆ పిల్ల నేల మీదపడి దొర్లింది.

'అయ్యొయ్యొ. ఛీఛీ! లే! కిందపడి దొర్లకమ్మా—మట్టి అంటుకుంటుంది. లే—లే—' అని రాముడు ఆ పిల్లను లేవదీశాడు.

ఆ అమ్మాయి ఎంతకూ యేడుపు మానకపోవ ఎంతో రాముడికికూడా యేడుపు వచ్చినంతపనయింది. ఎట్లాగో సంబాళించుకుని, 'ఎందుకమ్మాయీ యేడుస్తున్నావు? ఎవరయినా కొట్టారా?' అన్నాడు.

'ఉహు'

'ఏమన్నా పోయిందా?'

'ఊ'

'ఏం పోయింది?'

'జేబు రుమాలు!'

'ఎక్కడ పోయింది?'

'తెలీదు. ఈ రోడ్డుమీదే పోయింది.'

'పోతే పోయిందిలే. ఏడవకు!'

'నాన్న కొడతాడు. అమ్మ కొడుతుంది. కొత్త రుమాలు. నీలం రుమాలు. ఎక్కడో జారిపోయింది' అని ఆ అమ్మాయి మళ్ళీ యేడుపు మొదలెట్టింది. క్రమ క్రమంగా యీ యేడుపు పెద్దదవుతోంది. స్థాయి, గతులు మారుతున్నాయి. రాముడికి యేమీ పాలు పోలేదు. తను యేం చేయగలడో తోచలేదు.

'యేడవకమ్మా! దొరుకుతుందిలే—' అన్నాడు. ఆ అమ్మాయిమాత్రం అతని ఓదార్పు గమనించే స్థితిలో లేదు.

రాముడు మనసులో యీ అమ్మాయి కష్టాన్ని తలుచుకున్నాడు. కొత్త రుమాలు పారేసిన అమ్మాయిని ఏ తలిదండ్రులూ తేలికగా వొదలరనిపించింది వాడికి! అబ్బా! ఈ చిన్న అమ్మాయిని—అందమైన అమ్మాయిని కొడతారా? కొడితే యింకా యేడవదూ? పాపం— అనుకున్నాడు.

తనేమీ సహాయం చెయ్యలేనందుకు రాముడికి తనమీదే తనకు కోపం వచ్చింది. నాలుగు అడుగులు అటు యిటు వేశాడు. ఆ పిల్లకు ఎదురుగా నిలుచుని—యేం మాట్లాడాలో తెలియక చివరకు 'రోడ్డుమీద యిట్లా యేడవకూడదమ్మా తిన్నగా యింటికి వెళ్ళు. అమ్మతో చెప్పు. ఇంకెప్పుడూ యిలా అజాగ్రత్తగా ఉండకనీ రుమాళ్ళు పారేయకనీ. ఒట్టు వేసుకో' అన్నాడు.

ఆ అమ్మాయి యేడుపుమానేసి తాపీగా కూర్చుంది. రాముడు సంతోషించాడు. 'ఆ! అదీ! యిప్పుడింక యింటికివెళ్లు. నీతోకూడా మీయింటిదాకా వచ్చేదా? మీ వాళ్ళతో నిన్ను కొట్టవద్దని చెప్పమంటావా?'

గొంతుకు అంటిన దుమ్ముదులుపుకుంటూ ఆ అమ్మాయి తల అడ్డంగా వూపింది.

'అయితే వస్తాను—' అంటూ బయలుదేరాడు రాముడు.

అమ్మాయి కళ్ళుతుడుచుకుని నాలుగువేపులా పరికించి చూచింది. ఎదురుగా రాముడు నుంచుని వున్నాడు.

'నువ్వు రావద్దు. అమ్మకు బిచ్చగాళ్ళంటే తగని కోపం' అంటూ ఆ అమ్మాయి ఒక్కత్తే ముందుకు నడిచి వెళ్ళిపోయింది.

రాముడు నిలువెల్లా కుంగిపోయాడు. ఠీవిగా హుందాగా నిలుచున్నవాడల్లా క్రమంగా వణుం వంచేసి యథాప్రకారం దీనంగా తయారయాడు.

బాగాయెండ ఎక్కినట్లనిపించింది. తాత దగ్గరకు వెళ్ళాడు. ఇద్దరూ కలిసి తాత సంపాదించిన కొద్ది అన్నం తిన్నారు. ఈ అన్నం సంపాదించడానికి తాత ఎన్ని గుమ్మాలో ఎక్కిదిగాల్సివచ్చింది. రాముడికి, యీ పనికాకుండా, తాత తన దగ్గరున్న డబ్బుల్తో తనకు మంచి భోజనం ఎందుకు కొనిపెట్టడో అర్థంకాదు. ఆమాట పైకి అంటే తాత చీవాట్లు మొదలెడతాడని భయం!

ఆ సాయంత్రమంతా కూడా యేపనిచేస్తున్నా రాముడి ఆలోచనలన్నీ ఉదయం కనిపించిన అమ్మాయిని గురించే వుండిపోయాయి. ఏమయిందా అమ్మాయి? ఇంటికి క్షేమంగా చేరుకుందా?—వాళ్లు భాగ్యవంతులేనా? భాగ్యవంతుల పిల్ల అయినట్లయితే యివాళ దెబ్బలు తప్పవు! వాళ్లెప్పుడూ మంచివాళ్ళు కారు. బీదవాళ్ళు అంత తొందరగా చిన్న పిల్లలమీద చెయ్యిచేసుకోరు—ఏమంటే పెద్దవాళ్లకు పిల్లకాయ కష్టంమీద భోలెడంత ఆశవుంటుంది—ఒకటొకటిగా యీ ఆలోచనలన్నీ అతని మెదడులో పనిచేశాయి.

క్రమంగా హృదయభారం ఎక్కువవుతోంది, విసుగనిపిస్తోంది కూడా.

సూర్యాస్తమయం అవుతూవుండగా రాముడు తను కూర్చున్నచోటనుంచి లేచి మళ్లీ తాత దగ్గరకు బయలుదేరాడు. అక్కడ తాత—వొంగి నుంచుని భుజాన బరువైన మూటమోస్తూ ముఖానికి చెయ్యి అడ్డం పెట్టుకుని వొచ్చేపోయేవాళ్లను యాచిస్తూ చెయ్యి చాపుతున్నాడు. తాత వెనకగా టోపీ ముందుకు లాక్కొని పోలీసువాడొకడు వున్నాడు. అతని చేతిలో లాఠీ కర్రకూడా వుంది! దగ్గరకువచ్చి నిల్చున్న మనమడిని చూచి తాత "ఒరే! నీ జోలి ఖాళీగానే వుందే! నాది మూడు-నిండిపోయింది. ఇక్కడివాళ్లు ఎట్లాగయినా ధర్మప్రభువులు" అన్నాడు.

* * *

ఆరోజు తాను సంపాదించిందంతా తాపీగా లెక్కపెట్టి మూట కట్టుకున్నాడు తాత. రాముడు నిర్లక్ష్యంగా రోడ్డు ప్రక్కనే పడుకుని ఆకాశం వైపు చూస్తున్నాడు. తాత మూటకట్టడం అయిపోయాక మళ్లీ యిద్దరూ బజార్లలోకి బయలుదేరారు. తాత కర్ర పొడుచుకుంటూ మాడాకవళం యెత్తాడు. ఇద్దరూ కడుపునిండా భోంచేసి కుళాయి నీళ్ళు తాగారు.

తర్వాత ఊళ్ళో సత్రం అరుగులమీద పడక వేశారు. నాపరాతి బండలు చలిగాలికి మరింత చల్లగా వున్నాయి. తాత తన పాతచేలికలన్నీ కింద పరిచాడు. రాముడిని పడుకోబెట్టాడు. పైన గొంగళి కప్పాడు. వెచ్చగా నిద్రపొమ్మన్నాడు. కాని యింకా నిద్ర రావడం లేదు. తాత మరోసారి తన మూటలన్నీ భద్రంగా వున్నాయో లేదో చూచుకున్నాడు. ఒక మూట విప్పాడు, మళ్ళీ కట్టాడు. ఇలా తన పనిలో తను నిమిషం తీరుబాటు లేకుండా సదమదమవుతున్నాడు. దూరాన మరో మహాప్రపంచాన్ని పెద్ద పెద్ద నగరాలను మంచి మంచి మనుష్యులను-అడగక్కర్లేకుండానే దానధర్మాలు చేసే పెద్దలను—ఊహించుకుంటూ తాత మనసులోనే ఎంతో సంబరపడుతున్నాడు.

తాత యేదో వస్తువుతీసి మనమడికి చూపుతూ "ఒరే! రాముడూ యిది చూడరా! అంతా వెండి! కనీసం ముఫ్ఫై అయినా పలుకుతుంది" అన్నాడు.

అతడి ముఖంలో ఎంతో సంతోషం తాండవిస్తోంది.

"యేమిటది?"

"వెండి గిన్నె!"

'ఎక్కడిది?'

"మరేం భయపడకులే! ఒక కిటికీలో ఎదురుగుండా కనిపించింది. కిక్కురు మనకుండా తీసుకుని కోటు కింద దాచేశాను. ఎవరూ చూడలేదులే. ఇంకో ఊరు వెళ్లాక తాపీగా అమ్మేద్దాం!—యిదిగో యీ గిన్నె సరే! ఈ రుమాలు చూడు. ఎంత పెద్దదో, నీలం రంగులో ఎంత బాగుందో చూడు!"

కంపిస్తున్న చేతులతో చేతిరుమాలు బయటకు తీసి చూపించాడు తాత. రాముడు చూచాడు. నీలం రంగు రుమాలు! ఎంతో అందంగా వుంది. కొత్తది—సందేహం లేదు! అదే!

రాముడి మనఃఫలకంలో అకస్మాత్తుగా యేడుస్తూన్న యేడేళ్ళ చిన్న అమ్మాయి మెరిసింది. తాతముఖంవంక వికారంగా చూచాడు. అసహ్యం వేసింది.

ఇంతసేపు తాత యేమిటేమిటో చెబుతూనే వున్నాడు. దగ్గుతెర అడ్డం వచ్చి మాట సాఫీగా రాక అవస్థగావున్నా అలాగే చెప్పుకుపోతున్నాడు. చేతులు వూపుతూ యెందుకో గాని నవ్వుకుంటున్నాడు. ముఖం మీది చెమటబిందువులను చేత్తో తుడుచుకొంటున్నాడు.

రాముడికి తాత ముఖం స్పష్టంగా కనబడటం లేదు. బజారుదీపం కాంతి తగ్గింది. ఇటు తాత ముఖాన్ని, అటు యేడుస్తూన్న యేడేళ్ళ అమ్మాయి చిన్నారి ముఖారవిందాన్ని పక్కపక్కనే ఊహించుకుంటూ చాలాసేపు ఆలోచనలలో మునిగిపోయాడు రాముడు. అంత చక్కటి పిల్లను యీ ముద్దు-మొరటు మనిషి-నిమిషంలో ఎట్లా ఏడిపించేశాడు? ఎంత ఇదిగా బాధపెట్టాడు? ఇద్దరికీ పోలికెక్కడ? ఎంత భేదం అంతస్తులో!

తాత గొణుక్కుంటున్నట్లుగా అనుకుంటున్నాడు: 'యింకో వందరూపాయలు సంపాయించానంటే యింక నిర్విచారంగా చచ్చిపోవచ్చు.'

ఈ మాట రాముడిలో చెప్పరాని ఆవేదన కలిగించింది. ఒళ్లు మండిపోయింది. 'ఇక నోరు మూసుకుందూ? ఎందు కట్లా గొణుక్కుంటావు! ఎట్లాగయినా చస్తావులే. చావక యిక్కడే ఉట్టె కట్టుకు ఊరేగవు. చావక యేం అవుతావు. ముసలితొత్తువు-దొంగవు...అన్నం పున్నం ఎరగని చిన్న అమ్మాయి సొత్తు దొంగిలిస్తావుగా! ఇంత వయసువచ్చి నువ్వు చేయగలిగిందిదేగా! నువ్వెట్లాగూ నరకానికే పోతావులే!' అంటూ ఉద్రేకంకొద్దీ పిడికిలి బిగించి తాత ముఖంవేపు చూపాడు చేయి.

ఉన్నట్లుండి నిశ్శబ్దం ఆవరించుకుంది. కారు మబ్బులు చంద్రుడిని దాస్తున్నాయి.

సుబ్బన్న తాత నిశ్చలంగా కూర్చున్నాడు. రాముడు ఆత్మపరిశీలన చేసుకుంటున్నాడు.

'తాతా—' అంటూ యేడుపు మొదలెట్టాడు రాముడు.

'ఏమిరా! భయంభయంగా వున్నది కదూ? యేమిటి అంటున్నావు?' అన్నాడు తాత, నిశ్చలంగానే. రాముడికి యీగొంతు ఎంతో కొత్తదిగా తోచసాగింది.

ఉరుములు-మెరుపులు.

దారుణంగా వర్షం కురుస్తోంది.

చలికి ముడుచుకుపోయి పడుకున్నారు.

'రేపు ఊళ్ళోకి వెడదామంటావా? నేను రాను. నన్ను వదిలెయ్యి. నేను ముసలితొత్తును—దొంగను—నేనెందుకు. ఈ వానలో తుపాను గాల్లో వకవకలాడిపోతూ దిక్కుమాలిన చావు చస్తాను. నేను రాను. నువ్వు ఒక్కడివే వెళ్లు. వెళ్లు—' తాత నెమ్మదిగా అరుపుల్లోకి దిగాడు.

'తాతా, నన్ను క్షమించు—' అంటూ రాముడు తాత వొడిలోకి ఒరిగిపోయాడు. తాతలో కలిసిపోయాడు.

'ఉహు—లాభం లేదు. నేను రాను. పది సంవత్సరాలు నీకోసం నానా బాధలు పడ్డాను. నీకోసమే యింకా యీ భారంమోస్తూ భూమిమీద ఉన్నాను. నన్ను తిట్టుతున్నావుగా! నేను చచ్చిపోతానులే! నన్ను దొంగవంటావుగా! నేను దొంగనే! అయితే ఈ దొంగతనం ఎవరికోసం చేయవలసి వచ్చింది? తెలుసా? నీ సుఖంకోసం, నీ జీవితం సుఖమయం అవడంకోసం! సరే! కానీ—దొంగతనం చేశాను. నేను నరకానికే వెడతాను! హరి భగవంతుడా! ఈ కుర్రాడిద్వారా నన్ను శిక్షిస్తున్నావా? నన్ను వెంటనే నీలో కలిపేసుకోరాదూ!'

రాముడు భయపడిపోయి, తప్పుచేశానన్న భావంతో కుమిలిపోతూ, తాత పెడుతున్న చివాట్లన్నీ భరిస్తున్నాడు. కళ్లు మూసుకోవడానిక్కూడా ధైర్యం లేకపోతోంది. వాన క్రమంగా పెద్దదవుతోంది. రాముడికి తాతను యిక్కడే వదిలేసి తను ఎక్కడికైనా పారిపోదామని ఒక్కక్షణంపాటు అనిపించింది. కాని తనకు తెలియకుండానే తాతకు మరింత దగ్గరగా జరిగాడు. అకస్మాత్తుగా ఆయన మోకాలు తనకు తగలడంతో యేం ఉపద్రవం జరగనున్నదోనని భయపడ్డాడు.

ఉరుములు మెరుపులు యింకా తగ్గలేదు. తాత ముఖాన్ని చూస్తున్న కొద్దీ రాముడికి భయం ఎక్కువ అవజొచ్చింది. ఆముఖం బాగాపాలిపోయింది. దానిలో కళాకాంతులు లవలేశమయినా లేవు.

తాత కడుపులో తన తలదాచుకుంటూ 'తాతా, వెడదాం పద—' అని యేడుస్తున్నాడు రాముడు. తాత మనమడిని దగ్గరగా లాక్కున్నాడు. రొమ్ముకు గట్టిగా అదుముకున్నాడు. అనుకోకుండా వలలో యిరుక్కున్న సింహంలా గర్జించాడు. ఈగర్జనతో దాదాపు పిచ్చెక్కినటయి రాముడు తాతపట్టునుంచి విడిపించుకుని దూరంగా పోయిపడ్డాడు.

కాస్సేపటికి వర్షపుగోద, ఉరుములు మెరుపులు తగ్గిపోయాయి. వాతావరణమంతా అతి ప్రశాంతంగా తయారయింది.

తాత, మనుమడు తమకు తెలియకుండానే నిద్రకుపడ్డారు. ఆనిద్రలోనే ఒకచోటికి చేరుకున్నారు.

# ముహూర్తములో స్పష్టలగ్న ప్రయోజనము

శ్రీ రాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యులు

శుభకార్యములకు ముహూర్తములను నిర్ణయించుటవిష యమున నేటికాలమున జరుగుచున్న అనాదరము లను, అవిచారపరతనుగూర్చి కడచిన అక్టోబరు నెల 'భారతి' సంచికలో మనవిచేసియుంటిని. దృష్టాంత ములు కొన్ని చూపవలసియున్నవి. మచ్చున కిది యొకటి.

ఈ క్రింద నున్నది ఒక పురుష జాతకము. 'మామూలు' ధోరణిలో వేసిన నిరయనరాశి కుండలి ఇది:—

| | | | |
|---|---|---|---|
| | ల | | |
| చ<br>శ | రాశికుండలి | | కే |
| రా<br>ప | (నిరయనము) | | |
| బు<br>ర | | గు | కు |

నక్షత్రము శతతార. జన్మకాల రాహుమహాదశా శేషము 16 సంవత్సరములు, 9 నెలలు, 12 దినములట!

దశమకేంద్రములో శుక్రుడు, సప్తమ కేంద్ర ములో బృహస్పతి, భాగ్యస్థానములో తృతీయ, పంచ మాధిపతులగు బుధరవులు, లాభస్థానములో సుఖ, రాజ్యాధిపతులగు చంద్రశనులు, ఆరింట కుజుడు కాన వచ్చుటచే, యీ జాతకము గొప్ప యోగప్రదముగా తోచును. ధన, కళత్రాధిపతి శుక్రుడు రాజ్యస్థానములో ప్రకాశించుట, చతుర్థాధిపతి చంద్రుడు లాభాధిపతి యగు శనితో చేరి లాభస్థానములోనే యుండుట, భాగ్యాధిపతియగు బృహస్పతి కళత్రస్థానములో నిలిచి లగ్నమును పూర్ణదృష్టితో వీక్షించుట, కళత్రాధిపతికి లగ్నాధిపతి కుజుడు భాగ్యములో నుండుట, ఈ కార ణములచే జాతకునికి యోగ్యమగు కళత్రము వచ్చు ననియు, భాగ్యవంతుల యింటి సంబంధమే లభించు ననియు, దాంపత్యజీవితము శోభాయమానముగా రాణించుననియు, భార్య యింటికి వచ్చిన తరువాత భాగ్యాభివృద్ధి అగుననియు, సామాన్యముగా ఊహిం చుట సులభము. పలువురు అట్లే ఫలాదేశము చేసిరికూడ.

గురుమహాదశ రాగానే, భాగ్యము పండు సూచ నలు చూపట్టినవి. 18 సంవత్సరములు వయసు నిండిన కొన్నాళ్ళలోనే, భాగ్యవంతుల ఇంటిలో 18 సంవ త్సరముల వయస్సులోనున్న చక్కని కన్యకొకతెను పెండ్లియాడినాడు జాతకుడు. అరణముగనే, కొన్ని వేలు ముట్టినది. గురువు బాగుగా యోగించినాడు.

కాని, విశేషమేమనగా, ఆత్రములోనున్న జాత కునికి అద్దములో భార్యను చూసినట్లయినది. వివాహ మైనా, భార్య అబ్బలేదు. పెండ్లిసమయములోనే, ఏవో కొరతలలో, కలతలలో, ఏర్పడి వైషమ్యమునకు అవ కాశము వచ్చినదట! తరువాత కొన్నాళ్ళకుగానే, అల్లుడు మామగారియింటికి పోయినపుడు, అతనికి సము చిత సత్కారము లభించకపోవుట అట్లుండగా, పెండ్లి కూతురే పెడమొగము పెట్టినదట! భార్యను పంపమని అడుగగా, నేడు రేపని, పున్నమ, అమావాస్యలని, అడుగడుగు గడువులతో అత్తివారింటివారు కాలయాప నము చేసినారు. ఎంత సాహసము చేసినా, భార్య తన యింటికి వచ్చునను ఆశ జాతకునికి కానరాదు. ఉడుకు రక్తములో ఉద్రేకములూగు యువకుడతడు. బలాత్కా రముగా భార్యనుపట్టి తెప్పించ నిశ్చయించి, న్యాయవా దులతో సంప్రతించి, మీసము మెలివేయుచు జాతకుడు న్యాయస్థానమున కెక్కినాడు. వివాహము జరుగుచున్న కాలమందే సహించరాని గొప్ప లోపమొకటి వధువునిలో చూపట్టినందున, "సప్తపది" తంతు జరుగకయే పెండ్లి నిలిచిపోయినదనియు, కట్టిన 'తాళి' అప్పుడే త్రెంచి పారవేయబడినదనియు, ప్రతివాదము వచ్చినది. న్యాయస్థానములో జాతకుని చూపినపుడు అతడెవడో తనకు తెలియదని ఆ తరుణి మొగమోటము లేక తేలబలికినదట! భాగ్యాధిపతియై భార్యాస్థానములో నున్న మహానుభావుడు బృహస్పతి బలే వివాహము జరిపినాడు!

# ముహూర్తములో స్పష్టలగ్నప్రయోజనము

వ్యవహారము రెండు సంవత్సరములు జరిగినది. కడకు న్యాయస్థానములో జాతకుని వాదము గెలిచినదట. దీనితో మొలచీ మొలకని మీసమే మో మిగిలినట్లై! కాని, ఫలము శూన్యము. కాపురము చేయ నొల్లని భార్యతో ఏ కోర్టువారు కాపురము చేయించగలరు? దప్పి లేని గుర్రమును ఏటి యొద్దకు తీసుకొనిపోవచ్చును కాని, దానిచే నీరు త్రావించుట ఎవరికి సాధ్యము? ముల్లుతీసి కొర్రు అడచుకొన్నట్లు వేరుకన్యను వివాహమాడుటకు గొప్ప ప్రతిబంధక సామగ్రిగా ఏర్పడుట తప్ప, ఈ వ్యవహారపు తీర్మానమువలన ఇసుమంతైనా ఇతర ఫలము కానరాదని వివేకశాలు రెవరో జాతకునికి హితము బోధించినారు. ఆలోచించగా, వాస్తవమనియే తోచినదతనికి. ఇంతలో వ్యవహారము హైకోర్టువరకు ఎక్కినది. అచట తెలివి నుపయోగించి, ఈ బంధము వదలిపోతే చాలునని, జాతకుడు ప్రతివాదులతో 'రాజీ' పడినాడు. వివాహము సక్రమముగా జరుగనందున అదినిష్ప్రయోజనమైనదనువాదమునుఅతడు సమ్మతించి ఈ నిర్బంధమునుండి విముక్తుడైనాడు. వేరు కన్యకను వెతకుటకై ప్రయత్నము. తరువాతికథ దైవాయత్తము.

అది యట్లుండె.

ఈ వివాహపు పరిణామము ఆకస్మికముగా ఇట్లగుటకు ప్రాపంచికముగా ఏమి కారణము లేర్పడినవో, వధూవరులకు, వైషమ్యమేల వచ్చెనో, ధర్మశాస్త్రము ననుసరించి ఇది వివాహమగునో, కాదో, అను విషయములతో మనకు ప్రసక్తి అనవసరము. ఈ పెండ్లినిగూర్చి ఇంత రాద్ధాంతము జరుగుటకు జాతకములో ఏమిసూచనలున్నవో, ముహూర్తములో ఏమి లోపమున్నదో, అనువుమాత్రమే మనమిచట గమనింపదగినవి.

"దారే జీవే, ధర్మశీలా, పతివ్రతా," అని శాస్త్రము ఘోషించుచుండగా, భాగ్యాధిపతియై భార్యాస్థానమునకు శ్రీకార్యకర్తగా ఏర్పడిన గురుమహాశయుడు జాతకునికి చూపగల సౌభాగ్యమిట్టిదేనా? అందులో, అతనిదశలోనే ఇట్టి అనుభవములా? శత్రుక్షేత్రములో నున్నాడని కొందరు కారణములు చెప్పుదురేమో? వాస్తవమునకు, శుక్ర గురువులు సములు. అది ఎట్లయినా, శుక్రక్షేత్రములో బృహస్పతికి 'సారావళి' ఉత్తమఫలమునే చెప్పినది. శుక్రుడు రాహుసంయోగములోనున్నాడను కారణము దుర్బలము. వీరున్న స్థానమున కధిపతి శని మూలత్రికోణములో ప్రబలుడై లాభములో నున్నాడుగదా? మరి, ఈ అవ్యవస్థా ప్రసంగ మేల వచ్చినది?

సాయనచక్రములో విశేషమేమైనా తేలగలదేమో పరిశీలించుట, విద్యార్థులకు, పరిశోధకులకుసహా, ఉపయోగకరము.

ఈ క్రిందనున్నదే సాయనచక్రము:

| | | | |
|---|---|---|---|
| చ 0-44 | వ 27-30 | 18 ●-20 | |
| శ 25-44<br>X 8-40<br>రా 1-51 | [సాయనము]<br>——<br>స్పష్ట<br>జన్మకుండలి | | యు 25-8 |
| కు 29-14<br>బు 22-0<br>ర 17-8-37 | | | కే 2-51 |
| | గు 18-3 | శు 12-47 | ఇ 14-27 |

లగ్నము, ఇచట వృషభమైనది. భావస్థితిలో మార్పులేకపోయినా, గ్రహముల అధికారము లన్నియు తారుమారైనవి. 'మీసరగండు'డగు కుజునికే కళత్రభావాధిపత్యము సంక్రమించుట భార్య సమర్థురాలని అర్థము. ఇప్పటి సాంఘికపరిస్థితులలో దీనినొక గొప్ప లోపముగా భావించనక్కరలేదనుకొందాము. కాని, శత్రుభావములో (ఆరింట) కళత్రస్థానాధిపతి ఉండుటమాత్రము నిస్సందేహముగా దుర్గుణమనక తీరదు.

"శత్రుస్థితే, కామపీడా,
కాంతాయాః కలహో గదః."

అని ప్రాచీనులు దీనిఫలము చెప్పిరి. భార్య శత్రువగుట సన్యాసికి హితముకావచ్చునేమో కాని, సంసారికిమాత్రము కొరవితో తలగోకుకొనుటే అగును. అందులో, భార్య సమర్థురాలయినచో ఎంతకైనా సరే. ఒకవేళ, 'ముష్టాముష్టి'వరకు రాకపోతే మాత్రము, నిరంతరకలహశీలయగు భార్యతో కాపురముచేయుట ఎవరితరము?

"మగనిమాటకు మాట,
కెదురుపల్కెడిబోటి,
మృత్యుదేవతసాటి, ఓకూనలమ్మ."

అని, మా కూనలమ్మ సాక్షి చెప్పినది.

ఈ జాతకములో, భాగ్యరాజ్యాధిపతియై యోగకారకుడైన శని స్వక్షేత్రములో లాభస్థానములో చంద్రునితో చేరియున్నాడు. ఇది ఉత్తమమగు యోగము.

"ఉపచయ భవనేషు సర్వ సంపన్నః" అని 'హోరాసారము.' ఇంటితనపుయోగ్యత, పెద్దల ఆశ్రయము, ఆర్థికసౌకర్యము, ఇవి అభివృద్ధి సూచకములు కాని ఈ శనిచంద్రయోగమునకు సార్థ కేంద్రదృష్టిలో కుజుడుండుటచే, భాగ్యకారణముగా ఈ యోగము కొంత దెబ్బతినగలదని సూచన.

ఇక, సప్తమభావ కార్యనిర్వాహకుడగు బృహస్పతిగారికో, పట్టకూడని అష్టమభావాధిపత్యము పట్టినది. గుప్తస్త్రీలపై ప్రేమ, భార్యతో ద్వేషము, ఇవి దీని ఫలములట! తెలిసినట్లుగా రెండవఫలమేమో, ప్రత్యక్షముగానే చేతికి అబ్బినదికదా? దీని పరిణామముగా జాగరూకత వహించనిచో, కాలక్రమమున మొదటి ఫలమునకు దారి ఏర్పడునేమో? ఈ గురువునకు లాభాధిపత్య మున్నది. వివాహకాలములో అరణము కొన్ని వేలు మూపట్టినదికదా?

"గ్రహైశ్చ భావాంశగతైః ఫలో క్తిః" అనురీతిః నూటికి నూరువంతులు ఫలమునిచ్చునాడే బృహస్పతి. అట్లే ఇచ్చినాడు. ఇక, లగ్నాధిపతియు కళత్రకారకుడు నైన శుక్రుని మాట యేమి. ఇతనితో చేరి రాజ్యస్థానములో రాహువు బుసకొట్టుచున్నాడు కదా! జాతకుడు గొప్ప చొరవ, తెగదారితనము చాకచక్యము కలవాడు. నాల్గు మాటలలో ఎవరితోనైనా క్షణములో స్నేహము సంపాదించు నేర్పు కలదు. ఈ శుక్రునికి వ్యయభావమందున్న వరుణునితో కేంద్రవేధ సమ్యగ్దృగా కలదు. ముందువెనుకలు పరికించక, వ్యామోహావేశములో తిరుగుకొనటయు, వియోగక్లేశ మనుభవించుటయు సూచించు యోగమిది. ఇంతమాత్రము చాలక, విషయసుఖ (పంచమ) స్థానమందలి మాయలమారి ఇంద్రునితో ఈ శుక్రునికి సార్థకేంద్ర విషమదృష్టివేధ యొక్కటి కలదు. ఆకస్మికముగా కనువేరుగులపట ఊహాసౌధములు నిర్మించుకొని గాలితరగలలో ఊగి ఆనందించుట ప్రాపంచికముగా సత్యాసత్యములను తారుమారుగా అన్వయించుకొని మోసమునకు పాల్పడుట, వంచకుల మాయలు, కుతంత్రములు సకాలములో గుర్తించలేకపోవుట, ప్రేమవిషయమందుకాని వృత్తివ్యవహారములయందు కాని, అతి ధారాళబుద్ధివలననో, అసంప్రేక్ష్యకారిత్వమువలననో, చొరవచేసి నష్టపడుట, ఇత్యాగులు ఈ ఇంద్ర శుక్ర ప్రతికూలదృష్టివలని ఫలము.

ఈ రెండిటి సమష్టిఫలమే జాతకుడు అనుభవించి యుండుట.

భావఫలవిచారమున సూక్ష్మవిషయవివేచనకు సహాయపడు "సహమ"లెంగు లున్నవని చదువరు లెరుగుదురు. వానిలో, ప్రకృతాంశమునకు సంబంధించినవి, కొన్ని ఈ క్రింద చూపబడినవి :—

(1) పుణ్యసహమము ... 1-57 కర్కాటకము.
(2) భార్యా ,, ... 1-58 సింహము
(3) దాంపత్య ,, ... 7-26 మీనము.
(4) వివాహ ,, ... 21-50 మేషము.
(5) దాంపత్యమోక్ష ,, ... 1-13 వృశ్చికము.
(6) భార్యామోక్ష ,, ... 25-40 కుంభము.

ఇవి చాలును.

పుణ్యసహమము చంద్రుని స్నేహదృష్టితో, కర్కాటకములో తృతీయభావములో నున్నది. జాతకుడు పరాక్రమశాలి. వర్గోత్తమాంశలోనున్న ఈ సహమము స్వవర్గములో ఇతడు సమర్థుడని తెలుపగలదు. దీనిలో గల దోష మొక్కటే. ఏమందురా, సప్తమస్థానమందలి బృహస్పతితో సార్థకేంద్రదృష్టిని కోరుచుండుట. కళత్రవిషయకముగా, పుణ్యము కొంత దెబ్బతినగలదని దీని సూచన. భార్యాసహమము కేతుసంయోగములో నున్నది. కేతువు మోక్షకారకుడని మనవారి నిర్ధారము. ప్రాపంచికముగా అన్వయించుకొన్నచో, సామాన్యముగా, వివాహమువలన గౌరవమునకు, అర్థమునకు హానియనియో, భార్యలో ఏదో లోపమున్నదనియో, సూచన వచ్చును. ఇట్లుండగా, వ్యయభావమందలి వరుణునినుండి ఈ సహమమునకు కేంద్రవేధ యొకటి దాపురించినది. ఇది వియోగసూచకము. వివాహ సందర్భమున, ద్రవ్యముపై దృష్టి యుండునని, ధనాధిపతి బుధునితో అర్ధకేంద్రమందలి దాంపత్యసహమము సూచన. ఇది శత్రుదృష్టి యగుటనే, హితకరముగా నుండదు. వివాహసహమము సహా ఆ బుధునికి నిండు కేంద్రమందే యుండుట. ద్రవ్యము నాశించినచో, వివాహము రుచికరముగా నుండుట అసంభవము. ఈ సహమములు సార్థకములని అనుభవము తెలిపినది కదా !

నిరయనకుండలినుండి సాధించగలిగిన ఫలముల కంటె, సాయనచక్రము సూచించు ఫలములు జాతకుని జీవితానుభవములతో హెచ్చుగా అతుకుచున్నవని నిష్పక్షపాతదృష్టిగల పాఠకమహాశయులు గమనించి యుందురు. సాయన సంప్రదాయము ఫలప్రదమని అతి ప్రాచీనకాలమందే భారతదేశమందలి మహర్షులు అంగీకరించియుండిరి. మనము దానిని తిరస్కరించనేల ?

ఉండనిండు. జాతకఫల మేదైనా, జీవితదశల సందర్భమున అనుగుణముగా వ్యాప్తికి రావలసి యుండును. ఇట్టి జాతక వాగ్దానములుగల వ్యక్తి వివాహముకొరకు దైవానుకూల్యముగల కాలమును, జాతకానుకూల్యము గల కన్యను సాధించుట హితము. ఇతడు నిర్ధరించుకొన్న కన్యక జాతకము లభించలేదు. కనుక, జాతకానుకూల్య మెట్లుండెనో తెలియదు. నా దృష్టిలో, అది ఉండియుండదు. అరణపు సౌక

# ముహూర్తములో స్పష్టలగ్నప్రయోజనము

ర్యము కుదిరిన తరువాత, ఇతర విషయములు ఏమి లెక్క? వీరి అభిప్రాయమును గుర్తెరిగిన జ్యోతిష్కులెవరైనా, గుణములు బాగానే వచ్చినవని చెప్పియుందురు.

జాతకునికైనా, దశలెట్లుండెనో చూతము. వివాహపు వయస్సునకు ఇతనికి కేవమానదశలో గ్రహస్థితిని ఈ క్రిందనున్న కుండలి చూపుచున్నది:—

| | | | |
|---|---|---|---|
| దాంపత్య 29-15 | వ 27-41 | వివాహ 12-30 | I 6-15 |
| కు 27-44<br>X 26-40<br>బు22-9<br>స 22-1<br>ర 5-37<br>రా 0-54 | చలిత జాతక చక్రము<br>—<br>(సాయనము)<br>— | | పుణ్య18-0 |
| | | | కే 0-54<br>భాగ్య18-0 |
| | శ 20-36 | శు 19-17<br>చ 20-16 | ఇ 14-9 |

రాహువు 'సహవాస'ముతో దశమకేంద్రమందు ఉద్యోగాతిశయమున్న లగ్నాధిపతి శుక్రుడు, 17 సంవత్సరముల ప్రాయమునకే, చలిత కళత్రస్థానాధిపతి కుజునితో నిండు (త్రికోణ) ప్రత్యక్షమిత్రదృష్టికి వచ్చుట ఈ జాతకమందలి విశేషము. చిన్నవయసునందే దాంపత్యజీవితమువంక జాతకుని దృష్టి బరపుట వింత కాదు. తరువాత రెండేండ్లలోగానే, చలిత దాంపత్యసహమము జన్మశుక్రునికి అర్ధకోణమునకు వచ్చుట. "కారక నే గుంతల్లి [illegible] మరింత వేగ." అన్నట్లయినది. ప్రపంచానుభవవివేకము చాలినంత లేక, ఉద్రిక్త చిత్తవృత్తిగల చిన్నవయస్సులో, ఇట్టి దశలు వచ్చి అలముకొన్నచో, యువకులకు కోరికలు ఉచ్ఛృంఖలముగా పరుగిడుట సహజము. ఈ శుక్రునికి విషయసుఖ (పంచమ) స్థానమందలి ఇంద్రుని విషమదృష్టి యున్నదని మరువరాదు. యుక్తాయుక్త వివేచనలేక 'దుస్సాహసము' చేయుందుమట దీని ఫలము. భావాంబరవీధిలో విశృంఖలముగా విహరించు ఆనందానుభవమునకై మనస్సు ఉవ్విళ్ళూరును. అదే సమయమందే, చలితజాతకమున వక్రబుధులు చేరుకొన్నారు. ఈ బుధుడో, ధన, పంచమాధిపతి. "ఏకక్రియాద్వ్యర్థకరీ." అని ధనముతోకూడ సుఖము రావలెనని ఉత్కంఠ వచ్చినది. శని సంయోగమందున్న చంద్రుడు పుణ్యసహమాంత్రికోణ దృష్టిలోనున్నాడు గదా? గొప్ప అరణము నీయగల ధనికుల ఇంటి కన్యను పెద్దలు (శని) నిశ్చయించినారు. చలిత చంద్రుడు కళత్రాధిపతి కుజుని సంయోగమును పొంది చలిత బుధశుక్రుల మిత్రదృష్టిని అభిలషించుచుండిన కాలము రాగా, వివాహ ముహూర్తము వచ్చినది.

వివాహమును సూచించు దశలిన్ని యుండినా, ఇది పెండ్లి కాకూడని కాలమే. లగ్నపంచమాధిపతులగు చలిత వక్రబుధులకూ చలితలగ్నము సార్ధకేంద్ర క్రూరదృష్టిలోనుండిన కాలమది. జన్మకాలమున యమవరుణుల క్రూరవేధగలవాడే శుక్రుడు. కనుక, చలిత బుధశుక్రులు సూచించు 'చట్టాభేదము' హితకరముగా నుండదు. మరియు, మృత్యుస్థానాధిపతియై, భార్యాస్థానములో నున్న గురువులో చలిత భార్యాసహమము నిండుకేంద్రవేధకు వచ్చియుండిన కాలమది. ఆ కాలములో భార్యవచ్చినచో, ఆ వివాహపు ఫలితములో అష్టమాధిపతిత్వముకు దోషము అనుభవమునకు రావలసియుండెను. భార్యతో వియోగము, అరణద్రవ్యమునకు నష్టము, ఏకరూపముగా వచ్చునట ఈ దశావాగ్దానపు ఫలితము. సరి, ఇట్టి వివాహారంభమువలన ఏమి సాధించినట్లు? ఇంతే కాదు. దశమాధిపతి శని చలించి కళత్రాధిపతియగు కుజునితో సార్ధకేంద్ర స్థానమునకు వచ్చియుండిన కాలమే అది. వివాహమునకై పెద్దలు చేసిన ప్రయత్నము సఫలదాయకమగుట కల్ల. వారి ఉద్దేశము మంచిదైనా (శని ధార్మికుడే) దైవానుకూల్యములేని కాలమగుటచే, ప్రయత్నము ఫలశూన్యమునే ఇచ్చును. వివాహము నేర్పరచిన కాలమునకు నాల్గు సంవత్సరములలో భార్యాసహమము చలించి, చలిత గురువుతో కేంద్రస్థితిని సంపాదించుకొనును. చలిత భాగ్యమోక్షసహమము చల్లగా చలిత గురువుతో త్రికోణమైత్రిని పొందును. జన్మబృహస్పతి ఆరంభించిన పెండ్లినాటకమునకు చలిత బృహస్పతి అప్పుడు భరతవాక్యమును పాడగలడు.

కాని, ఒక్క విశేషమున్నది. ఈ కథలో అష్టమాధిపత్యము సహజసౌమ్యుడగు గురువునకు వచ్చుట, 'గుడ్డిలో మెల్ల' అనురీతిగా కొంతనయము. క్రూరగ్రహమునకే ఈ అధికారము వచ్చి ఇట్టిదశ వచ్చియుండెనేని, నిస్సందేహముగా, ఏదో ప్రమాదమునకే దారితీసియుండెడివి.

"క్రూరే భార్యా ద్వేషీ,
కళత్రదోషాత్ మృతిం లభతే."
అని వృద్ధయవనుని సూత్రము.

అంతటి పాపమునకు బృహస్పతి, సామాన్యముగ పూనుకొనడు. అయినా తన అధికారముయొక్క ధర్మ

మును మాత్రము అతడు నిర్వహించవలసినదే. తప్పదు. ఆర్భాటముగా పెండ్లిసంబరము సాగించి, వధూవరులను న్యాయస్థానమున కెక్కించి, మంచి మాటలతో వివాహము కాలేదనిపించి, అరణద్రవ్యము జాతకుని కంటకుండా, పునర్వివాహమునకు ప్రతిబంధకము కాకుండా, నాటకమాడి, సులభోపాయముతో బృహస్పతి తన పని నెరవేర్చినాడు. అంతో ఇంతో చేతి ద్రవ్యము వదలుటతో పీడ విడిచినది.

ఒక్క వింత. జాతకములో 'అరణ' సహమము మిథునములో 15°-24'లో నున్నది. దీనికి బుధుడే అధిపతి. చలిత జాతకములో బుధశుక్రులు చేరగా, అరణముపై ప్రబలమగు ఆశ వచ్చినది. అప్పటికి ఈ సహమము చలించి నికరముగా పుణ్యసహమమును చేరుకొనవలయునా? పుణ్యము పండినట్లు చూపట్టినది. కాని, జన్మగురువుతో సార్థకేంద్రస్థానమది యని మనము మరచిపోరాదు. ఆ గురువు అరణమును అంటనిచ్చునా? నాలుగేండ్లకు ఆ సహమము చలించి చలిత గురువుతో సార్థకేంద్రస్థితికి వచ్చునప్పటికి నాటకము ముగిసినది.

సరే—వెతికి వెతికి సంపాదించినారా, అనిపించు ఈ వివాహ ముహూర్తమును చిత్రగింపుడు :—

| | | | |
|---|---|---|---|
| ర 16-30 | బు 2-45<br>X 17-15<br>శు 20-30<br>మ 26-53 | గు 16-43 | |
| రా 10-35 | వివాహ<br>ముహూర్తము | | వ 14-32 R<br>I 20-30 |
| | —<br>(సాయనము) | | కే 10-36<br>యమ<br>21-29 (వ) |
| | చ 29-52 | ఇ 23-26(వ)<br>శ 26-31 (వ) | |

ముహూర్తము 1-30 P.M. (IST) అని మౌహూర్తికు లెవరో నిర్ధరించియుండిరట. పెండ్లి పీటలమీద, ఇచ్చి పుచ్చుకొను విషయములలో ఏవో అసమాధానము లేర్పడుటచే, వాదప్రతివాదముల ధోరణిలో, ఏర్పరచియుండిన "పుష్కరాంశ" ఎప్పుడో దాటిపోయినది. ఉభయపక్షములకు సమాధానముకలిగి వరుడు వధువునకు 'తాళి' కట్టు కాలమునకు 2 25 P. M (IST) అయినది. అనగా భూమండలము రమారమి వేయిమైళ్ళు ఆలోగా తిరిగినదనుట! ముహూర్త కాలముపైన ఎంత శ్రద్ధ? అందుబాటులో నున్న అందాలరాశిపైననూ, అరణపుసంచులమీదనూ, నిలచియున్న దృష్టిని ఆకాశములో, ఎచటనో ఎన్ని లక్షల యోజనముల దూరమందో, తిరుగుచున్న గ్రహములవైపు మరల్చుట సులభమా? వీరి సమస్యలు తృప్తికరముగా పరిష్కారమగుదాక కాలచక్రమును స్తంభింపజేయని అచాతుర్యము ఆ సృష్టికర్తదే కాబోలు!

ఆ దినమున ముహూర్తమును నిర్ణయించిన మహానుభావు లెవరో కాని, ఈ క్రింది దోషముల పట్టికను చూడుడు :

(1) ఫాల్గుణ బహుళములో ఈ ముహూర్తము. కామదహనము జరిగిన కొన్ని దినములకే అనుట! ఇది నిషిద్ధము.

(2) నక్షత్రము అనూరాధ. అది జాతకునికి విపత్తార. ఫలము క్లేశము.

(3) ముహూర్తపు కళలో ప్రబలదోషమగు 'విష్టి' కరణము వ్యాప్తిలో నుండినది. అందులో, అది పూర్వార్ధ 'విష్టి.' పగటి ముహూర్తములకు అమంగళ సూచకము.

(4) ప్రమాదకరమైన 'వ్యతీపాత' యోగము. ఇది మహాదోషము.

(5) చంద్రుడు గండసంధిలో నున్నాడు. అందులో అతడే లగ్నాధిపతి. కన్యావరులకు ఇది గండము వంటిది.

(6) అనూరాధా నక్షత్రమందలి విషనాడీప్రదేశము వృశ్చికములో 28°-44' నుండి 29°-38' వరకు ఉండినది. చంద్రుడు దీనిలో నున్నప్పుడే కన్యాదానము జరిగి యుండుట సంభవము. విషబీజము అప్పుడే నాటబడియుండును.

(7) రవిచంద్రాంతరము 253°-22' అగుచున్నది. ఆదినమున తిథిత్యాజ్యము రవినుండి 252°-48' నుండి 253°-36' దాక వ్యాపించుటవలన, చంద్రునికి తిథిత్యాజ్యదోషము పట్టినది. వధూవరుల మనస్సంకల్పముల కిదిదోషము.

(8) పునర్వసూ నక్షత్రపు విషనాడీదోషము కర్కాటక రాశిలో 19°-51' మొదలుకొని 20°-45' వరకు వ్యాపించును. ఈ విషనాడిలో లగ్నమున్న సుముహూర్తములోనే 'తాళి' కట్టుట. తోడనే 'తాళి' త్రెంచివేయబడినదను వాదము వచ్చినది కదా? కాని ఆ సుముహూర్త మెప్పుడో, తెలియ లేదు.

(9) లగ్నములో వియోగప్రదుడగు వరుణుడు ఉదయించినాడు. చంద్రునికి—అనగా, వివాహ లగ్నాధిపతికి—ఇతనినుండి సార్ధకేంద్రవేధ! విడాకులు పంచుకొను వ్యవహారమునకు తగిన లగ్నమిది.

(10) దశమకేంద్రములో కుజు డున్నాడు. "రణేషు భౌమః" అని, యుద్ధమునకు తగినయోగమిది.

# ముహూర్తములో స్పష్టలగ్నప్రయోజనము

(11) శనికి కళత్రకారకుడగు శుక్రుడు సాక్షాత్తుగా సమసప్తకము. అనగా, భార్యాస్థానాధిపతికి "ముక్కు ఎదురు". వధువు పెడమొగము పెట్టినదికదా!

(12) నాల్గింట శనికి ఇంద్ర సంయోగము, కుజుని సమసప్తక వేధ. ప్రయత్నఫలము '(కుజుడు దశమాధిపతి), ఇంద్రజాలములోవలె, కనిపించి అంతర్ధానమైనది.

హిమాలయశిఖరములవంటి ఈ దుర్యోగములుగల ముహూర్తమునకు ఇపుడు కలిగిన ఫలము ఎంతో తగియున్నది.

ఈ ముహూర్తపు ప్రభావము వధుని జాతకమునకు ఎట్లు వ్యాపించినదో గమనింపుడు. జన్మవరుణుని పైన శుక్రుడు వచ్చియుండగా, ఆ శుక్రునికి శని ఎదురుగా నిల్చిననాడు, ఈ వివాహాభాసము జరుగుట! చలిత కుజచంద్రుల సంయోగస్థానమునకు సమసప్తకముగా కుజుడు ఆనాడే నిలుచుట మరింత విశేషము. ఇంత చాలక, జాతకుని దైనిక లగ్నము ఆనాడు నికరముగా వియోగకారకుడగు వరుణునిమీదనే—కర్కాటక రాశిలో 14½° భాగలో—'తిష్ఠ' వేసినది. దినజాతకములో కళత్రభావము మాత్రము చలిత భార్యాసహమముతో (సింహములో 18° భాగలో) సంయోగము నొందినది. భార్య వచ్చినది, సరే! దాంపత్యధర్మనిర్వహణమునకై కాదు, మరి వ్యాయస్థానములో ప్రతివాదగా నిలుచుటకే! ఎట్టికాలమునకు అట్టి ఫలము! విత్తొకటియై, చెట్టు వేరొకటి మొలవదుకదా?

దశలో గ్రహవైషమ్యము కల కాలము దైవప్రాతికూల్యమును సూచించును. ఈ శుభకార్యము లేవియు అప్పుడు తలపెట్టరాదు. ఫలము విషమించును.

"యదా గ్రహాణాం వైషమ్యం
సర్వారంభం పరిత్యజ."

అని మహర్షి భరద్వాజుడు హితము బోధించియున్నాడు. అట్టి గ్రహవైషమ్యదశ కల కాలములో, శుక్రునికో, సప్తమభావమునకో, సప్తమాధిపతికో ప్రబలమగు ఉత్తేజనము కలిగించు దశ సయితము సిద్ధమయ్యేనేని, తగిన వయసులో నున్నవారికి వివాహముకొరకు ఉత్కంఠ మితిమీరగలదు. తగినరీతిగా సలహాలిచ్చి, చొరవకు దిగకుండా అట్టి జాతకులను కాపాడు బాధ్యత పెద్దలది. అట్లుకాక, వివాహము జరుపుటకై ప్రయత్నములే జరిగినచో, దశాదుష్ఫలమును సులభముగా చేతికి అందియ్యజాలిన గ్రహయోగములుగల కన్యకలే వారికంట బడుదురు. కాని, పరిస్థితులన్నియు ఆశాజనకముగానే పొడగట్టును. ఆ కన్యకలలో అందమో, అరణమో, మరొక్కటో, అసాధారణముగా వారి నాకర్షించును, దుష్ఫలము అనుభవింపజేయుటకొరకే అంత ప్రబలాకర్షణము వచ్చినదని, పాపము, వారి కపుడు తోచదు. ఇట్టి దుర్దశలలో వివాహము చేసుకొని క్లేశపాత్రులయినవారిని అనేకులను చూచుచున్నాము.

దశ అంత పటిష్ఠముగా నున్నపుడు, వివాహము జరుగవలసినదే కదా? విధి అట్లున్నప్పుడు ఎవరేమి చేయుదురు? అని ఆక్షేపించుట సులభము. చేసిన తప్పునకు, లేదా, జరిగిన అవిచారపరతకు, సమాధానము చెప్పుటకో, తృప్తిపడుటకో, ఈ తత్త్వము బాగా పనికి వచ్చుచున్నది. అంతే. దైవవశమున, అనగా, ప్రాచీన కర్మపరిపాకమువలన, ఈ వయస్సులో ఇట్టి స్వభావముగల పరిస్థితు లేర్పడగలవని గ్రహస్థితి సూచించునే కాని, ఆ పరిస్థితులలో ఆ వ్యక్తి ఇట్లే ప్రవర్తించవలెనని అది నిర్ధరించదు, శాసించదు. ప్రవర్తనము వ్యక్తుల పురుషకారమునకు చెందినది. సహవాసము, అనుభవము, విద్య, విజ్ఞానము, ఉపదేశము, సంస్కారము, మున్నగువాని ఆధారమున ఆయా పరిస్థితులలో తనకు ధర్మమేదో, ఏది హితమో, నిర్ణయించుకొని ప్రవర్తించవలసిన బాధ్యత వ్యక్తిదే. దైవ మెట్టిదైనా, పురుషకారము లేనిదే ఫలము రాదని ఎందరో పెద్దలు చాటిచెప్పిరి—పాశ్చాత్యులే కాదు, మనవారుసహా.

"న దేశ కాల వ్యవసాయ వర్జం,
భవేత్ ఫలాప్తిః సతి చాపి దైవే."

అను సిద్ధాంతమును మనము తిరస్కరించరాదు. దైవము అనుల్లంఘనీయమే. ఎవరు కాదనిరి? ఆయా వయస్సులో జాతకానుసారముగా ఆయా దశలు వచ్చుట దైవమువలననే. వలదన్నను, అవి రాకమానవు. అంతే విధి. ఆ దశలలో ఏమి చేయవలయుననుట విధి పనికాదు. వేసవిలో మిట్టమధ్యాహ్నమున సూర్యతేజస్సునకు వేడి ఉండరాదని ఎవడుగాని శాసించలేదు. అట్లు వేడియుండుట విధి. అంతేకాని, ఆ ఎండలో పాదరక్షలు, ఛత్రము, మొదలగు ఉపాయములు లేక, మానవులందరు బైట నడచి మాడిపోవలయుననుట విధికాదు. వారివారి శక్తిని, సౌకర్యమును, అనుసరించి వారు తమ పనులను నెమ్మదిగా జరుపుకొనుటకు సూర్యుడు ప్రతిబంధకము చెప్పడుకదా? దశాఫలములను సైతము ఇట్లే అన్వయించుకొనవలసి యుండును. కానిచో, మహర్షుల వాక్యములను మనము తిరస్కరించినవార మగుదుము.

ప్రశంసలోనున్న జాతకునికి అపుడు వివాహము జరిగినచో క్లేశ మబ్బునని సూచించుదశలు వచ్చినవి.

ఆ కాలములో పెండ్లి జరిగనేని, దానినుండి దుష్ఫలమే కలుగునని, సహేతుకముగా జాతకునికి, అతని పెద్దలకు సహా, తగినవారు నచ్చచెప్పి యుండినచో, ఈ వివాహాభాసప్రసక్తి వచ్చియుండదుకదా! ఇది అసాధ్యముకాదు. కాని, వివాహము జరిగి

యుండనిచో, అప్పుడిదశ లేమి చేసియుండును? అను ప్రశ్న వచ్చును. మంచిదే! పది సంవత్సరముల వయస్సులోనే ఇట్టిదశలు వచ్చియుండెననుకొందము. అప్పుడు వివాహము, వియోగము, వ్యవహారము, ఇవి జరిగియుండవుకదా? దశవచ్చిన వయస్సులో ఏ అవకాశములు, మార్గములు, సిద్ధముగా నుండునో, వానిలోనే దశాఫలము చూపట్టును. భ్రాతృభావమును నెరముదశ వచ్చినప్పుడు, అన్నదమ్ములు, అక్కచెల్లెండ్రు, లేనివ్యక్తికి, ఆ దశాఫలము భార్యా సోదరీసోదరుల పైపున ప్రచురించుట అనుభవములోనిది. మాటవరుసకు ఆలోచింతము. తగిన నాటకములలో పాత్ర ధరించి జాతకుడు ఈ దశాఫలమంతయు అనుభవమునకు తెచ్చుకొని యుండవచ్చును. ఇట్లే, ఎన్నియో మార్గములున్నవి.

లోక కళ్యాణమే పరాయణముగా పాటుపడిన ప్రాచీన మహర్షులు రచించినది జ్యోతిశ్శాస్త్రము. ఏకాలము అభివృద్ధికార్యములకు తగినదో, ఏ వయస్సులో అట్టి కార్యములకు దైవము అనుకూలించునో, దైవానుకూల్యమును చూపు వ్యక్తులెట్టివారో, ఎట్టి ముహూర్తములో వివాహాదులు జరుపుట ఇహాపరములకు శ్రేయస్కరమో, ఆ శాస్త్రము గంటవాయించి చెప్పుచున్నది. వానిని తిరస్కరించి, లేక నిరాదరించి, స్వేచ్ఛగా, దుష్టదశలో, దుష్కాలములో, కార్యములు జరిపి, తరువాత విధినో, దైవమునో, నిందించుట నీతి కాదు. జాతకుడు ఏమి సాధించగలిగెను? ఆశించిన భాగ్యమూ, లభించలేదు; సరికదా, వచ్చుననుకొన్న అరణ్యద్రవ్యమైనా, దక్కలేదు. మూడు నాలుగు సంవత్సరముల కాలము మనోవ్యథ, న్యాయస్థానముల వెంట తిరుగుట, ద్రవ్యనష్టము, గౌరవహాని, ఇంతేకదా ఫలము?

ముహూర్తకాలమును నిరాదరము చేయువారికొక్క మనవి. జాతక మెట్లు జీవితములో దశలను చూపునో. వివాహముహూర్తము సయితము దాంపత్య జీవితమునకు సంబంధించిన శుభాశుభములను సూచించు దశలను తెలుపగలదు. ముహూర్తమును నిర్ణయించుట లగ్నపత్రికలలో అచ్చువేయించి పారవేయుటకొరకు కాదు, వైవాహికజీవితమందలి శుభాశుభదశలను తెలుపుటకొరకు, ఈ సత్యమును, సామాన్యులమాట అట్లుండగా, మౌహూర్తికులే అనేకులు గమనించకుండుట ఈ కాలపు శోచనీయవిషయములలో నొకటి.

ప్రశంసలో నున్న వివాహలగ్నమునకు జీవమాన దశను సాధించినచో, చలిత చంద్రుడు ధనస్సులో 26వ భాగకు పోయి శుక్రదశలో మిత్ర దృష్టిని సంపాదించినప్పుడు, భార్యను రప్పించుకొనుటకై జాతకుడు న్యాయస్థానమున కెక్కినాడు. శనిభార్యాస్థానాధిపతి. శుక్రుడు గృహ, లాభాధిపతిగా రాజ్యస్థానములో నున్నాడు. న్యాయాధికారుల ఆశ్రయమున అమీనా సహాయముతో తన ఇంటికి భార్యను రప్పించుకొనదలచినాడు జాతకుడు. నాల్గు సంవత్సరములకు చలితకుజునికి ఇంద్రునితో సమసప్తక వేధ సిద్ధమయినది. ఆ వేళకు సరిగా వివాహలగ్నము చలించి, దౌర్భాగ్యవశమున, ఆ కుజునికి, ఆ ఇంద్రునికి, సరిమధ్యమునకే వచ్చి 'పాపకర్తరి' పాలయినది. ముహూర్తమువలని ఫలము అప్పుడు విచ్ఛిత్తి కావలసినదే. ఆకాలమునందే, నికరముగా, చలిత చంద్రుడు సప్తమభావబిందువును చేరుకున్నాడు. గండాంతములో ఉండిన ఫలమును అప్పుడేకదా ఈ చంద్రుడు కళత్రభావమునకు అందియ్యగలడు? ఇవన్నియు ఏకకాలమందే సమకూడుట! ముహూర్తచక్రము చూపగల దశాపరిపాక మిది.

ముహూర్తచక్రమునకు జీవమానదశలే కాక, వరజాతక, దినజాతకాదులు సయితము సాధింపవచ్చును. ఎంతో స్పష్టముగా వానిలో సహా ఫలములు చూపట్టగలవు. గ్రంథవిస్తరభీతిచే, వానిని ఇచట చూపనైతిని. మచ్చునకొక నిదర్శనము చూపుదును. న్యాయస్థానములో వివాహబంధము విముక్తి అయిన నాటికి ఈ ముహూర్తమునకే దినజాతకము గుణించినచో, దినలగ్నము సింహరాశిలో 7వ భాగకు పోయి సాక్షాత్తుగా నాటి వరుణునిమీద వ్రాలినదని పాఠకమహాశయులు కనుగొనగలరు. ఒక్క కాలములో వ్యయస్థానములోనుండి శుక్రుని స్వీకరించుచున్నవాడీ వరుణుడు. అట్టివానిని ముహూర్తకాలములో మంగళాక్షతలతో ఆహ్వానించి లగ్నములో కూర్చుండబెట్టినారుకదా? పైగా, వివాహలగ్నాధిపతియగు చంద్రుని సార్థకేంద్ర క్రూరదృష్టితో గండాంతములో త్రోయుచుండిన గ్రహముకదా ఈ వరుణుడు! తాను సంకల్పించిన కార్యమును ఆనాటి దినజాతకలగ్నములో కూర్చుండి పూర్తికావించినాడు. కాలపురుషుని మహిమ!!

చెప్పవచ్చిన దేమనగా, ముహూర్తములలో స్పష్టలగ్నకాలమునకు గొప్ప విలువ కలదనుట. అనాలోచితముగా, ఏదో ఒకరాశి లగ్నమనకొని ఒకటి, రెండు గంటల కాలమును శుభకాలముగా మౌహూర్తికులు నిర్ణయించుటయు, దానిక ననుసరించి పెండ్లిపెద్దలు ఏదో ఒక క్షణములో శుభకార్యము జరుపుటయు, వధూవరులకు ఎంత ప్రమాదకరములో, పాఠకమహాశయులకు వేరుగా విన్నవించుట అనవసరము.

# కల్పవృక్షము: కైకేయి

శ్రీమతి నాయని కృష్ణకుమారి

సప్త సంతానములందు ప్రశస్తి గాంచినది కృతి. అట్టి కృతిశత నిర్మాత శ్రీ విశ్వనాథ. ఆయన పరమ భక్తాగ్రగణ్యుడు. స్వప్న సుషుప్తులందు కూడ నాయన మానస జిహ్వలు రామనామ గ్రహణము చేయును. రామ కథా ప్రగ్రహము బిగించి లాగు ధాటికి సంశ్లిష్టమై ధురావశమై చను నాయన మనోఽశ్వమునకు రామకథ సర్వమును తెలిసిన ఉగ్రుడు చోదకుడు. పగ్గముల పట్టు సడల్చి దిద్దు ఆ దేవుని అనుమతినిబడియే కవి రఘుదేవుని సానుకథా ప్రపంచమును నిర్మించెను.

ఈనాడు మరల నీ రామాయణ మేలయని యెవ్వరైన నందురు. అట్టి సంశయాళువులకు కవి సమాధానమిచ్చెను. ఈ ప్రపంచ మెల్ల వేళల తినుచున్న అన్నమే తినుచున్నది. చేసిన సంసారమే చేయుచున్నది. ఒక్కరి రుచి మరొక్కరికి రాదు. ఒక్కరి బ్రతుకు లింకొక్కరు బ్రతుకరు. అట్లే యీయన తలచిన రాము నే తలచి రచనలో మలచును. ఈ తలపులు మరొక్కరు తలచలేరు. ఈ రచన యింకొకరికి రాదు.

ఇంతకు నీ కవి వాల్మీకి రామాయణము నాంధ్రీకరింతుననలేదు. రామకథ చెప్పెదననెను. ఆ చెప్పుట తన రుచికి వచ్చునట్లు చెప్పుట. ఆ కథావిషయమున తన మనఃప్రాణములు సర్వమును ఓహో యనునట్లు చెప్పుట. వాల్మీకి రాముడు మహేతిహాస నాయకుడు. వేదాంతర్గత విధినిషేధములను మిత్ర సమ్మితములు చేసి తన చరిత నుదాహరణగా చూపి ప్రబోధించు ధర్మవీరుడు. వాల్మీకి తన రాముని ధర్మ పరిణతుకునిగా చెప్పెను. ఏకపత్నీ మహావ్రతునిగా చెప్పెను. పితృవాక్య పరిపాలనా దక్షునిగా చెప్పెను. సాధుజన పరిత్రాణునివలె, శత్రుజన నిస్తారణకారకునివలె చెప్పెను. అతడు బ్రహ్మాది జనసంఘమువలన, మహర్షి వ్రాతము వలన ప్రార్థితుడై పుడమి నవతరించిన దశరథాపత్యము.

ఈ స్ఫురణ వాల్మీకిరామునియం దాద్యంత మున్నది. అందువలన, ఆ పాత్రయందలి సద్గుణ పుంజములను వివి సభక్తికముగ నమస్కరించి గౌరవింపగలముగాని, మన మస్య శరీరప్రాణములతో మనగల వ్యక్తిగా తలచి యానందించి మన్నింపలేము.

రంగనాథుడేమి, భాస్కరుడేమి, ఈ కాలపు వారు ఆంధ్రవాల్మీకి కావ్యతీర్థు లేమి అందరును రామాయణ మహేతిహాసమును తెలుగులోనికి దించిరి. వారెవ్వరును కథా కథనమున కిచ్చిన ప్రాముఖ్యము తత్కథాగత పాత్ర చిత్రణమున కీయలేదు. అసలు వారిదృష్టియం దన్ని పాత్రలును పాత్రలే కావు. ఒక్క రాముడే అద్యంతమును కవి గమనింపదగిన పాత్ర. ఈ రామునిచుట్టను కథ శరవేగమున తిరుగును. తద్వేగాతిశయమునబడి సుడిగాలికి దిరుగు నప్ప పత్రములవలె మిగిలిన పాత్రలు తేలిపోవును. ఈ లోపము ఆయాకవుల ప్రతిభాలోపమువలన కలిగినది కాదు. వారు రామాయణమును ధర్మప్రధాన కావ్యముగా జెప్పిరి కాని సరసప్రబంధముగా జెప్పలేదు. అట్లువిశ్వనాథ చెప్పెను, ఇదియే యీయన రామ కథ చెప్పుటలో వేరైన గుణము. ఇదియే యీయనపాత్ర చిత్రణమందు చూపిన సునిశిత శ్రద్ధాళుత్వము.

ప్రతికావ్యమునందలి పాత్రలను రెండువిధములుగా విభజింపవచ్చును. అవి ప్రధాన పాత్రలు అప్రధానపాత్రలు. ప్రధాన పాత్రలు కథకుపకారములై కథను నడుపునవి. అప్రధాన పాత్రలు ప్రసంగవశమున వచ్చి కథకు పుష్టిని చేకూర్చునవి. కవి కీరెండు విధముల పాత్రలయందును సమదృష్టి యుండవలెను. అప్పుడే కథా సౌందర్య మినుమడించును. విశ్వనాథ యట్లు చేసెను. ఈయన రామాయణ కథానాయకు నెంత యవధానముతో చిత్రించెనో రామ వనవాసగమన ప్రథమకారణ మంథ

నట్లు చిత్రించెను. సీతావియోగ దుఃఖాపాదిని శూర్పణఖ నట్లు చిత్రించెను. కౌసల్య, సుమిత్ర, అహల్య, కైకయి, సీత, అరుంధతి, ఒకరేమి ప్రతిప్రధానాప్రధానపాత్రయు నాయన ప్రతిభాదత్త మహామూర్తిగా విలసిల్లినవి. ఈ పాత్రలన్నియు విశ్వనాథవే. ఇందు మరొక్క కవికి స్వత్వబుద్ధి కలుగుటకు వీలులేదు. తను సృజించిన పాత్రలు తనవే యను బుద్ధి పతితలకు గూడ కల్పించగలుగు కవికి కథా నవ్యత్వ మక్కరలేదు. పాత కథను మలచి సరికొత్త రూపులు దిద్ది రసగ్రహణ పారీణులగు విజ్ఞుల యాదృతిని పొందగలడు. విశ్వనాథ యట్లుచేసెను. ఈయన కల్పవృక్షము క్రొత్త తొడవులు తొడుగుకొను పురాణభూజము. దానికి నిత్యమును నవ్యత్వమే.,

కల్పవృక్షమునందు కైకేయి యపూర్వసృష్టి. దీనికిని వాల్మీకి కైకయికిని పోలికలు లేవు. వాల్మీకి కైకయి రామానురక్తులకు కన్నెఱ్ఱ. సకలగుణాభిరాముని రాముని రాజ్య నిష్కాసితుని చేసిన కుటిల. వానిని పదునాలుగేండ్లడవిలో పలు పిలుగులపాలు చేసి ప్రియా విరహ దోదూయమాన మానసుని చేసిన పాపిని. నిజపుత్రుని రాజ్యప్రాప్తికై భర్తృవియోగమునైన సమ్మతించిన దుష్టరి. ఇది వాల్మీకి కైకయీ స్వరూపము. వాల్మీకికి కైకయియందు సానుభూతి లేదు. రామదేవుని సద్గుణరాశిని ప్రకాశింపజేసిన మూలరూపమను కృతజ్ఞతలేదు. ఐక్ష్వాకువును, సత్యవ్రత దీక్షాతత్పర మతియు నగు దశరథేశ్వరుని ప్రేమాస్పదయన్న స్పృహ లేదు. వాల్మీకమందు కైకయి రామాభిషేక కాలమున ప్రవేశించును. రాముని అడవికి పంపి నిష్క్రమించును. ఆ పని సాగుటకై యా పాత్ర సృజితమైనట్లు అది తీరగనే ఆ పాత్ర నశించినట్లు మనకు తెల్లమగును. కాని వాల్మీకియు, కైకయికి రాముని యందు భరతునకంటె ప్రీతికలదనియే చెప్పెను. ఆప్రీతి సపత్నీ మాత్సర్యము ముందు నిలువలేదు. ఇందుకు మంథర ప్రోద్బలమిచ్చినది. కౌసల్య పట్టమహిషి మునుపే యయి, రామ పట్టాభిషేకానంతరము రాజమాత యగును. ఆమెకు తానూడిగము చేయవలయును. ఈ విషయమే మంథర నొక్కి చెప్పినది. వాల్మీకి కైకయి యా మాటలకు లొంగిపోయినది. లొంగకుండ నిలుచు ధైర్యము కైకయికి లేదు. అంత గాంభీర్యమును లేదు. కేవలము, మనశ్చాంచల్యమునకులోనై సపత్నీమాత్సర్యము కారణముగా, స్వపుత్రాభ్యుదయ పరం పరయే లక్ష్యముగా తామస గుణము ప్రకోపించిన దుష్టస్త్రీవలె రాము నరణ్యమునకు తోలినది.

విశ్వనాథ కైకయి క్రొత్తకైకయి. ఏ కవికైనను నూత్నత్వమును సృజించుటకు హక్కున్నది. విశ్వనాథ ఆహక్కు నుపయోగించుకొనెను—"ఆద్య సత్కథలు వారిధిపుట్టు రత్నములు. కల్పనాకథలు కృత్రిమ రత్నములు. ఈ నాటి యీ సత్యకవి ఆద్యసత్కథ నొక దానినిగొని స్వకపోలకల్పనాగుష్టము చేసెను. ఆదికవి ప్రాచేతసకృతపాత్రకు వింతరూపు కల్పించి రంగులు మార్చెను"— అని ఒక్కరనవచ్చును. వాల్మీకి కైకయి నేల మార్చెను? ఆద్యసత్కథలందు స్వకల్పన లేలచేసెను? వినూత్న కథా కల్పనా తత్పరుడు కారాదా?" యని మరొక్కరనవచ్చును. ఎవ్వరేమన్నను విశ్వనాథ వాల్మీకి కైకయిని పాడుచేయలేదు. బాగుచేసెను. శీల చిత్రణమే లేక వెలాతెలబోవు కైకయీ సామాన్య స్వరూపమును దశరథేశ్వరుని ప్రియభార్యారత్నముగా తీర్చి దిద్దెను. ఆమె రామకృతి సర్వరాక్షస సంహరణ ప్రథమకారణము. రాముడన్న మనఃప్రాణములచే వాత్సల్యము కురిపించు మాతృమూర్తి. అట్టి పుత్రుని వాంఛాపరిపూర్తికై లేని కుట్రలు నెత్తిన వైచుకొని వానిని చివరిదాక రక్షించిన స్వార్థత్యాగిని. ఈ కైకయి మనచే నోహోయని తలయూపించును. మన మనస్సులందున్న భక్తిగౌరవమైన విస్మయము నాచుకొనును.

ఎందరేని అంగనలు కల దశరథునకు మువ్వురే ప్రియాంగనలు. వారు మువ్వురును గుణగణాఢ్యులు. అందు మూడవది కైకయి మధుసామగానమూర్తి. అరువదివేలయేండ్ల వయసుమీరిన రాజుకంటికి దాగు రేవుల తళతళ కాటుక. ఈమె జన్మలో కేవల సాత్త్విక మూర్తియగు కేకయరాజదుహిత. తండ్రి రక్త మామె నాడులలో ప్రవహించుచునేయుండును. ఆమెమనస్సునందు, భావమున కందనిచోట మూలసత్త్వ గంధావలితములై, పరిణతములై, భద్రములయిన యూహలు జనించుచునే యుండును. కాని తల్లి పెరుగని కైకయి సరియగు పెంపకములేని రాచసంతానము. ఆమెకెంత పెగ్గడితనమో, గరువమో, అంత పట్టుదల. ఆ గుణములే

# కల్పవృక్షము : కైకేయి

దశరథుని కౌసల్యాభిముఖుని గానీక తనవైపు త్రిప్పినవి. వనవాసగమనమునకు భంగము వాటిలనీయక రాముని రక్షించినవి.

కైకయీ పాత్ర నత్యుజ్జ్వలముగా తీర్చుటలో కవి పోషకముగా గైకొనిన మరొక పాత్ర మంథర. అది కైకయిని చిన్ననాటినుండి చేతులపెత్తి పెంచి అరణముగా కోసలేశ్వరుని యింటికి వచ్చిన ముదిజంత. వాల్మీకమందు కైకేయికే ప్రాధాన్యము లేదు. ఆమె దాసి మంథరకు నుండదు. భారతమున నొక్కచోట మాత్రము మంథర కారణజన్మగా చెప్పబడెను. అది దుందుభి యను గంధర్వకాంత. దేవకార్యమగు రావణనిధనమును జరిపించుటకై మనుష్యజన్మమెత్తి, కైకయీదాసియై, రామ వనవాస గమనమును ప్రోత్సహించినదని యచటి కథ. విశ్వనాథ మంథరకీ కారణజన్మము లేదు. దాని కాయన చేసిన రూపకల్పనమును, ఇచ్చిన స్థానమును వేరు. రాముని అరణ్యమున కంపుటలో దానికున్న కారణమొక్కటే! అది రాముడు కౌసల్యాసుతుడని. పట్టమహిషీ గర్భమువాడు రాజ్యపదవినందునని తాను పెంచిన భరతున కన్యాయము జరుగునని. రామమూర్తి యన్న దానికి గల ద్వేషమును, రాముని బాల్యమునుండి, రాజ్య నిష్కాసితుడగు వరకు కవి అచ్చటచ్చట చెప్పుచునే యుండును. దీనికి తోడు మంథరకు కైకపై నొక విధమగు నధికారమున్నది. అది తల్లికి కూతురుపై గల యధికారము వంటిది. కన్నతల్లిని చూడని మమకారమెల్ల కైక దీనిపై నొలుకబోయును. ఇది పుట్టినింటి దాసి. రాజు బహుభార్యాప్రియుడు. అందును పట్టమహిషి యన్న కైకకు సపత్నీమాత్సర్యము. ఏకాలము పతి తన కడకు రాకపోయిన కైకకు మంథరతోడనే ప్రొద్దుపోవును. ఈ చనవే మంథరకామెపై నధికారము సంపాదించి పెట్టినది. అడుగడుగున నా యధికారమును ప్రదర్శించి, దానిని స్థిరము చేసికొనుట మంథరకొక మోజు. అయినను కైకయు దాని కెప్పుడును విధేయ కాదు. ఎప్పుడో ఒక్కొక్కసారి ఆమె దాని కెదురుతిరుగును. అప్పుడప్పుడుపేక్షించి యూరకుండును. ఒక్కొక్కసారి దాని మాటల కభిముఖమగును. ఇది ఆమె మనస్స్వభావజ దౌర్బల్యము. తన్ను చేతులపెత్తి పెంచినదే యను కృతజ్ఞతా పరిణామము. ఈ విషయమును విశ్వనాథ స్పష్టము చేయును.

ముప్వురు రాణులును రఘువంశ రత్నదీపములకు నాల్గింటిని వెలిగించిరి. కైకయి భరతుని పోషినట్లును, వాని యాటపాటలలో మురిసినట్లును వాల్మీకి చెప్పలేదు. విశ్వనాథయు చెప్పలేదు. కాని వాల్మీకి చెప్పని కొత్తది మరొక్కటి విశ్వనాథ చెప్పెను. కైక కెంత సేపటికి తన సవతి కొడుకు రామచంద్రునితోడనే సరిపోవును. కౌసల్యయన్న నామెకున్న మత్సరత ఆమె సంతానముపై లేదు. రామ జననానంతర మా కౌసల్యపై గూడ నామెకు మత్సరత లేనట్లుగా కవి సూచించును. పైపెచ్చు కైక కామె యన్న రామచంద్ర గర్భధృత వీచిగా నొక పూజ్యభావము. అట్టి రామునికొరకు నిద్ర మేల్కొన్నది గ కైక యాత్మజాత మూచును. వాడును కాళ్లువచ్చిన దాదిపినతల్లికొరకే పరుగులెత్తును. రాము డామెపై కురుకగా, కైకయి వానిని కౌగిట గ్రుచ్చుకొనును. ఆస్యమున ముద్దులిడును. కడుపుపై మూర్కొంచి కిలకిలార నవ్వించుకొనును. రాముడు కైక వద్దనున్న ఎవ్వరు పిలిచినను పోడు. అట్టి రామ ప్రవృత్తాంతరంగ కైకయికి భరతునిపై దృష్టిలేదు. భరతునకు తల్లి దగ్గర మచ్చిక లేదు. శత్రుఘ్న సహితుడైన వాడు మంథర చేతియందు బడెను. ఆ వృద్ధ దాసి తీర్పుతీర్పులును, పెరపరిచారికల సేవలును వానిని పెంచెను.

శ్రీరామచంద్రుడును పెరిగెను. లక్ష్మణ ద్వితీయుడై లోకాద్భుత శౌర్యప్రదర్శనమును పంద్రెండేండ్లయిన నిండని పసినాట చేసెను. తన శౌర్యమును రాముడు తల్లికి తెలియనీయడు కాని పినతల్లికి కొన్పించుకొనును. ఆ సమయములందు కైక సంతోష కుల్యాతరంగక డోలాగమన. ఆమె నేత్రము లావంద బాష్పకదంబకలితోద్యానములు. ఆమె రాముని మెచ్చి, బహుమురిపెముగా చూచిచూచి, చూచుచునే బాబుకు దిష్టితగులునేమో యని బెగ్గడిల్లును. నేల మన్నద్ది యా చేతితో వీపు చమురును.

కాని కైక యీ హృదయ గతిమైన యింత ప్రేమయు ఆటంకములులేని సరళ ప్రవాహిక కాదు. మంథర ఆ ప్రవాహమున కడ్డు తగిలి చెదరగొట్టు బండరాయి. అది చూచుచుండెనేని రామమూర్తిపై పినతల్లి ఆ ప్రేమను కురిపింపదు. ఊరక కన్నులతో పలుకరించును.

రఘుకుమారుల ఉపనయన సంస్కారమైనది. తనకు మ్రొక్కిన కుమారులకు కౌసల్య హేమభూషణ వితానములును, ఆశీస్సులును ఇచ్చెను. వేదాంతిని సుమిత్రి కేవలాశీస్సులను మాత్రము యిచ్చెను. కైక మిగిలిన వారి కేమి యిచ్చెనోగాని రామునకు మాత్రము మణులు కుట్టిన పట్టు దట్టి యిచ్చెను. పిడిని మరకతమ్ము దొడిగిన చురకత్తి ఇచ్చెను. వజ్రపుంఖితమ్మైన వాలుటమ్ము నిచ్చెను. వానిని చూచుకుని రాముడు మొగమున ఇంతయై మురిసిపోగా కైక కన్నులందిగము మరింతయై యేరులు వారెను. ఆమె అంతరంతర స్థగితమైన రఘూద్వహుని ప్రతిమ లసచ్ఛిసుమూర్తికి జగములు పట్టరాని ఒక సాహస దీక్షితనుత్వ మొప్పెను. ఆ సమయమున కైక ధీరామోదప్రవిచలాంతరామోఘ. ప్రేమోల్బణ మోదవీచీ ధారాప్రగామితదృగ్రేఖ.

ఈ కైకేయి సామాన్య రాజకాంత కాదు. వింటి చిక్కని మర్మము లెరిగిన ధనుర్విద్యానిధానము. సారథికి కూడ చేతగాని కౌశలముచూపి రథమును మెలపుకొని పోవు నేర్పరి. పుత్త్రివాంఛా పరిపూర్తి కావిక్రమ స్ఫురణమును, ఆ మెలపును మూలసాధనములైనవి. అట్టి ప్రజ్ఞానిధి రఘుబాలుని ధనుర్విద్యాభ్యసన వేళ నిత్యమును వచ్చి చూచెడిది. 'ఓయి తండ్రీ ఈ బాణమిట్లు, ఆ బాణమట్లు' అని చిత్రదూరములైన లక్ష్యముల నెట్లు విదారింపవలయునో చెప్పి చేయించెడిది. తన విల్లెగతి పట్టవలయునో అమ్మెట్లు సంధింపవలయునో రామచంద్రునకు కైకయీ శాసనమే శాసనము. తన మాట విని లక్ష్యభేదము చేసి తననుచూచి చిన్నారి సిగ్గు దొంతర నవ్వుల నదజల్లు రాముడు కైకయీ ప్రాణము. వానికిది వేళ యిది పాళ యని లేదు. ఎప్పుడు చూచినను వాడు కౌతుకసహితుడై కైకయీ సౌధమున నుండును. ఆ సౌధములును, తత్సమీప వృక్ష నివహములును వాని లక్ష్యములు. మరుగుజ్జు మంథరకు వాని పొడగిట్టదు. అది వాని ధనుర్విక్రమ కళావైభవమును అటుపోయివచ్చి చూచును. ఇటుపోయివచ్చి చూచును. చూచి చూచి భయభ్రాంతయై సివాలాడును. రాముడు మంథర యెడ పరిహాసశీలి. వాడు దానిని రాచువట్లుగా బాణములను వేయును. అది భయభ్రాంతయై హాహాకరించిన కొలది వాడు గగ్గోలుగా హాసోద్ధృతమూర్తి యగును. అట్లు సర్వరాక్షసకులాటవీ దావానలకల్పుడు రాముడు కైకకడ అస్త్రవిద్యకు నాంది పాడెను. ఆమె రామదేవుని ప్రథమ అస్త్రవిద్యా గురువు.

రామునియందు వలె సీతయందును బద్ధానురాగ కైకయి. తద్దివ్యాంగలావణ్యలహరిలో మున్కలు వైచు సౌందర్యపిపాసిని. రామునకంటె సీత అందగత్తె. సీతకన్న రాముడందగాడు. ఒకరిని చూచినప్పుడు మరొక్కరిపై కైకయికా భావము కలిగెడిది. తన హృదయస్పందియగు నా దంపతుల శోభను చెప్పవలెనని యామె సీతకడకేగి నా తండ్రి రాముడందగాడు. నీవుకావనును. రామునివద్దచేరి సీతయే అందగత్తె నీవుకావనును.

అట్టికైకయి, తానై రాముని వనములకు నోలుటకు మంథరాబోధ మొక్కటి చాలదు. మంథరపై మమకార మెంతయున్నను దానికి లోబడి తన ప్రాణములకు ప్రాణమైన బిడ్డ నడవికి పంపిన కైకకు వ్యక్తిత్వ ముండదు. ఇంతగా చిత్రించి కైకను మంథర చేతియందలి మైనపు బొమ్మగా నిముశ్చుట కవి యుద్దేశ్యము కాదు. కైకను కారణజన్మగా తీర్చవలెనన్న కవి తహ తహ కల్పవృత్తమున ప్రస్ఫుటము. పురాణగాథలయందు కారణ జన్మత్వము మంథరకున్నది గాని కైకయికి లేదు. ఈ పరిస్థితులలో కవి స్వకపోల కల్పనల నాశ్రయింపక తప్పలేదు. ఇట్లు చేయుట కీ విశ్వనాథయే మొదటివాడు కాడు. నాటకకర్త భాసుడును తన ప్రతిమయందు, కైకయీ పాత్ర చిత్రణావసరమున నింత జిజ్ఞాసపడి, ఇంత సానుభూతిలో ఆ పాత్రను కొంత మార్చెను. ఆ మార్పు, కైకయి యన్న స్వార్థము, మాత్సర్యము కలిసిన సామాన్య వనితా స్వరూపమను భావము మనలో కలుగనీయదు గాని, ఆ కైకయిని, మహోత్కృష్ట నిస్స్వార్థ, వీర కాంతనుచేసి మనముందుపెట్టి వెలుగులను చిమ్మింపదు. అందుకు కారణ మా పాత్రచిత్రణమునందు భాసుడు చివరవరకు శ్రద్ధచూపింపకపోవుట. ఈ లోపము విశ్వనాథ యందు లేదు. కావుననే ఈ కైకేయి నిర్దుష్టయై, దివ్యప్రభల చిమ్ము రత్నదీపమైనది.

ఇంతకును విశ్వనాథ దేవకార్యనిర్వహణ భారమును కైకయిపైననే పెట్టెను. మంథరను కేవలము స్వార్థచింతాపరయగు దుష్టస్త్రీని చేసెను. ఇది సాగించుటకాయన మనోహరములగు రెండు కల్పనలను చేసెను. అందొకటి రామకల్యాణానంతరము,

# కల్పవృక్షము : కైకేయి

పట్టాభిషేకాత్పూర్వము శ్రీ రామచంద్రుని ప్రాణమ్మ లందుదయించిన వైరాగ్యరేఖ. రెండవది పట్టాభిషేక శుభదిన పూర్వరాత్రియున వారు పినతల్లితో రాజ్యము చేయనని చెప్పుకొనుట.

ఈ కవి వర్ణనలను కేవలము వర్ణనలకుగా చేయరు. వానివలన కథ కుపకారమును పుష్టియు చేకూరవలెనను ప్రాకులాట యీయనది. శ్రీరామ వివాహానంతరము కవి ఋతు వర్ణనము చేసెను. ఒక ఋతువును వర్ణించి మరొక్కదానిని చెప్పులోపల ఒక్క సంవత్సరకాలము తిరిగినట్లు చెప్పెను. అనగా నారు ఋతువులను వర్ణించులోపల నారు సంవత్సరముల కాలములో శ్రీరామచంద్రుని మనోభావ వికారము లన్నియు చెప్పెను. సీతారామ ప్రణయ పాత్రమైన తొలివసంతము హాయిగాగడచెను. అట్లొకయేడు చనగా నరుదెంచిన గ్రీష్మర్తు వేళ ప్రకృతియంతయు నొక్క వైరాగ్యకేళి నెరపినది. రాముడు వైరాగ్య భావ తాడితమైన చిత్తముతోడ నిర్వేదక్షోభను లను భవించెను. ఆయనకు ప్రాణముకంటె ప్రాణమైన ధరాజాతా ముఖాంభోజమే వికారోగా కనిపించెను. సమస్తావనీ స్వామిత్వాదిక భావన లోపడలో నింకి పోయెను. బ్రహ్మచారి సుతుడు విరాగియైన తండ్రి వానిని గృహస్థుని చేయును. గృహస్థుడగు రాజసుతుడు విరాగియైన తండ్రి వానిని రాజ్యాభిషిక్తుని చేయును. దశరథుడిదియే సంకల్పించెను. రాముడు సుబాహు తాటకా ప్రాణహర్త. రాముడు వసిష్ఠపద సమారాధకుడు. అట్టి రాముడు నృపభావ యోగ్యస్థానమని పరిషజ్జనులు నిర్ణయించిరి. రాముడు తండ్రిపనుపున తల్లులు ముగ్గురికిని నమస్కరించి, వారి యాశీస్సులను గొని, మరునాడు జరుగబోవు నభిషేకోత్సవమున కానాడు నిష్ఠాపరుడై యుపవాసియై మౌనవ్రతధారి యయ్యెను. కాని వానికి సమాధి నిలువలేదు. వాని యూహలే దేవతలయి వచ్చి వానిని ప్రబోధించినవి. రాముడు దైవతలోక కార్యనిరతివ్రతుడు. జనావలి కంటకాపనయనుడు. పంక్తికంధరుని మాట మరచి రాజకార్య నిమగ్నుడగుటకు వానికి వీలులేదు. ఒక్కొక్కడొక్కొక్క పని తలపెట్టెను. ఆ పని తుదవరకు సాగుటకు మరొక్కరి సహాయము కావలసి యుండును. లేకున్న ఎచటి యూహ లచటనే ఆచరణ సాధ్యములు కాక నిలచిపోవును. రాముడు తాను రాజ్యము చేయకూడదనుకొనెను. అందుకు తండ్రి ఒప్పుకొనడు. ఏమియును తోచక రాముడు పినతల్లి మేడలవైపు చనెను.

రేపు ప్రొద్దున అభిషేకము పెట్టుకొని ఇట్లేల వచ్చితివని కైక వానిని మందలించినది. కుబ్జని సద్వ్రత భంగకారిణి నని నన్ను లోకులాడిపోసుకొందురు, ఏదో ముంచుకొనిపోయినట్లే రాక ఏమని ప్రశ్నించినది. దేవతలు నన్ను రాజ్యము చేయవద్దనిరి. నాకును రాజ్య కాంక్ష లేదనగా, నిప్పుడట్లే యుండును. రేపు జానకి అంకస్థయై సింహాసనసీమ నున్నప్పుడు మరొక విధముగా నుండునని మారుపలికినది. ఆ మాటలకు రాముని నేత్రములం దొక తీవ్రకళ తోచెను. "నీవు మున్నువ్వెత్తున నేర్పిన కోదండకళా విచిత్ర గమన శ్రీ యేమగును? ఈ ధనువున నున్న చిక్కని సుతారము లన్నియు నేను రాజ్యపాలనకు పూనుకొన్న నెందులకు?" అని తీక్ష్ణముగా పలికి, "అదికాదమ్మ తల్లీ! నేను రాజ్యము చేయుట వేల్పుల కిష్టము లేదని బ్రతిమాలుకొనెను. ఆ ధోరణిని, వానికన్నుల తెరతెరను చూచి కైక మరొక్క మాటాడక లోనికేగెను. ఇది కల్పవృక్షమున కైకయీ విషయమున విశ్వనాథ చేసిన కల్పన. ఈ కల్పన కైక మంథరకు లొంగుటకు బలము నిచ్చును. మంథరా బోధనలను పటిష్ఠములు చేసి, ఈ అతి సూక్ష్మవిషయమును దానికి పోషకము చేసి కైకను కవి మంథరకు లొంగించును. తెరవెనుక నున్న సూత్రధారుని ప్రముఖత రంగస్థలమందు నటించు పాత్రలలో కాన్పించినట్లు, మంథర మాటలకు క్రమముగ మార్పు చెందుచున్న కైక చిత్తవృత్తిలో నీ కల్పనయొక్క పటిష్ఠత, ప్రాబల్యము కొట్టవచ్చినట్లు కానబడును. కేవలము దీని ప్రాముఖ్యము పైన నే మనసునుంచి కవి మంథర కన్యాయము చేయలేదు. అది చెప్పగలిగినంత చెప్పె, చేయగలిగినంత చేసియే కైక మనస్సు తిప్పెన దనిపించును. మంథరయే అంతిగా కైక చెవులలో నూరిపోయకున్న, చత్తునని బెదిరింపకున్న రాముని మాటలను పసి పలుకులుగా పెడచెవిన బెట్టి రామాభిషేకమును సమ్మోదాంతరంగయై చూచియుండెడిది.

అభిషేకవార్త విని మంథర కైకకడకు వచ్చెను. రామాభిషేకవార్త చెప్పి, "రాముడు రాజైన నీవు కూడుండవు. సవతి, పంతాలపాతర తీయు"నని బెదిరించెను. అభిషేకవార్త విన్న కైకయి ప్రమోదానన.

ఆమెకు గతరాత్రి సంఘటన చెడుకలవలె తోచెను. అభిషేకమున కంగీకారమును చూపిన సమస్త శుభ మూర్తిని రాముని చూచిరావలెనని తత్తరపడెను. ఈ ధోరణి చూచిన మంథర ప్రేటువడ్డ పసరంబుపగిది కుంచుకొనిపోయి తెప్పరిలి "రామునకు మొగంబున నవ్వు, గుండె మూతపెట్టిన త్రాచుపాము కరణి. అట్టి రామునకు రాజైన నీవు పరిచారికాగమ విషాద మహార్ణవ మీదెదవుసుమా" యనెను. కైక దానికి అర్థ తిరస్కృత మందహాసయై "రాజే పాము. వాడు భరతుడు కానీ రాముడు కానీ. రాముడు భ్రాజచ్చాపకళా విలాసనిధి. ఆ రాముడు రాజై అంపవాదర సముద్రాంభిస్సు లింకించును. రాజై నీ భరతుడును, నా భరతుడును స్వర్గములు రాదీయునా?" యని మందలించినది. మంథర భయకోప వివశయై, అయ్యో అయ్యో యనియేడ్చి మొత్తుకొనగా, కైక, ఒక్కింత చలించి, ప్రసన్నయై "ఇదేమి దుఃఖమే? ఆ బిడ్డ శ్రీరాముడు సంవ్యాసు ప్రాంగణ ముగ్ధదీపిక, వాడెల్ల జీవులకును దీక్షాసర్మ పారంపరీ వ్యాసంగుడు. అతడు రాజైన నీకును నాకును ఎగ్గా! నిజమునకు వాడొక యోగి. దితిజోగ్రవారి మార్తాండుడు." అని ప్రశంసించు మాటలు మంథరకు నచ్చినవి. ఈయవకాశమును జారవిడుచుకొనుట కిష్టము లేక చప్పున "అవునమ్మా రాముడు యోగియంటివి. మరి వానికి రాజ్యవాంఛ లేల! అతడు మహోవను శోగ్రాంబుపతంగుడంటివి. దనుజు లయోధ్యావీధి యందుండిరా" యన్నది. భరతుడు నీకు రాముని పాటి చేయక పోవచ్చును. అయినను వాడు నీ కడుపునబుట్టిన బిడ్డ. వాని కన్యాయము చేయకు మన్నది. నిన్ను చేజేతుల పెంచినందుకు నాకు లభించిన ఫల సర్వస్వమును తొత్తుక్రింద బడితొత్తునై 'యొత్తులు ఒత్తుటే'నా యన్నది. ఇన్ని నిష్ఠురము లాడిన మంథరకు కైక ప్రతివాద శూన్య. ఆమె మనస్సునందు రాముని ప్రార్థనా పరిడిన వదనము పరవళ్లు త్రొక్కుచున్నది. అయినను, నవనీతముకంటె మెత్తనై సంధ్యా చంద్రరేఖా సముద్భవ చాంద్రీ సుకుమారమానెద పరిపాకము కల రామునియెడ మంథరయేల మాత్సర్యము వాటించునో అవగతము కాలేదు. అన్ని వాదములు నైపోయినవి. కైకేయిని లొంచుటకా ముదివగ్గున కేదారియు మిగులలేదు. కట్టకడపటి పన్నకముగా నది కైకను తీక్ష్ణముగా చూచి, శోకావేగమున చీరయంచు చించి సన్నని యురిపోసుకొన గడగినది. ఆపనిచేయు నొడుపులో కైక కంతయు యాథార్థ్యమే తోచి దాని నాపి, "ఏమే నిజముగా చత్తువా?" యన్నది. అవి తన యందలి కృతజ్ఞతచే కైక మనస్సు దుర్బలమగుచున్న ఘడియలని గ్రహించిన మంథర మరింత యుద్ధృతముగా, "అవును నిజమే, నీమీద నొట్టు" యన్నది. కొంతసేపు మనస్సు ఒకిపిడి చెందిన తదుపరి కైకయి దానిని పంపుటకో తాను చచ్చుటకో యన్నంత ఉరవడిగా లేచి, "ఈ ఎల్లసర నా కుమారుడేలును. నీవు పొమ్మన్న నామాట శిరః కహ్లార మాలాకృతిగా ధరించి రాముడు వనముల కేగును. కాని ధాత్రీశుడు దీని కంగీకారమేల చూపు"ననగా, మంథర, "నీకిష్టమేని యుపాయమే లేదా" యన్నది. అందుకు కైకమండిపడి, 'నాకిష్టమని ఎవ్వగు చెప్పిరి. నీ యుపాయమేదో చెప్పు' మని గర్జించిన గర్జనయందు ప్రాతికూల్యానుకూల్యములు సగము సగము తోచి మంథర దశరథ దత్తవరములను జ్ఞప్తికి తెచ్చినది. ఆవేశపడుచున్న కైకను శాంతింప జేయుటకుగా, "నీరాముడు వన్యసీమలదిరుగుచు దైత్య సంహనన దీక్షాపూనునులె" యన్నది. ఆ మాటలలో, రాముని పరాక్రమమును అవహేళన చేయుచున్నట్లు గాతోచి, కైక ఉగ్రురాలై, "రామమూర్తి కఠిన రాక్షస కీటకాళిని కాలిక్రిందరాచును ఏమనుకుంటివో"యనగా, మంథర సర్దుకుని, "నేనును అదేనియే, చెప్పుచుంటిని గదమ్మా అంతకోపమెందుకు? కుమారుడు భరతుడు క్షేమముగనుండిన ఆ రాము డెంతయో ఆ దైత్యు లెంతలో నాకెందు"కన్నది. ఇచట కైకయి మనః ప్రవృత్తిని కవి మన కన్నులఎదుట కట్టినట్లు చిత్రించెను. ఒకవ్యక్తి కొకపనిచేయుట ఇష్టముండదు. అట్లు చేసిన ఆప్తులు కష్టములపాలగుదురు. లోకు లాడిపోయుదురు. అయినను ఆపని చేయకతప్పదు. చుట్టుకొన్న పరిస్థితులట్టి ఉచ్చులంతగా బిగిసిపోవును. ఈద్వంద్వముమధ్య చిక్కినప్రాణి ఎంతగా అవటిల్లి పిల్లబాసపడునో విశ్వనాథ కైకయి మనకుచెప్పెను. ఆవిడ కేది చేయుటకును, మానుటకును తోచలేదు. ఎదుట నున్న మంథర తన ప్రాణముల గ్రసించు రాక్షసి వలె తోచగా, ఉవ్వెత్తునదానిపై విరుచుకొనిపడి, "నీవు చెప్పినది చేసెదను. నీవో నేనో చావకముం దిక్కడ నుండి పొమ్మ"ని తిరిమివైచెను. తానా ఏకాంతమున మందుతిన్న పులివలె గుడుసుర్పుపడెను. మనో

# కల్పవృక్షము : కైకేయి

లోభమో, ధాత్రీవచో దానమో, దైవత్యముగ ప్రేరణమో, తెలియరాని యావేశమొకటి ఆమెను నిలువనీయలేదు. దశరథుని తాను వరములిమ్మని యడుగగా నాతడిచ్చుట జరుగవలయును. ఆయనకు ముదిమి పైబడ్డను చేతః కామము చావలేదు. వానిబ్రతుకెల్ల కైకయను ఆకురా కరకువాదర రాచిన రాపు. అట్టిరాజు తనమాటవినక మనలేడు. ఈ స్ఫురణతో కైక నిలువెల్ల శోకమూర్తియై కోపగృహమున కేగెను.

రాజు, పుత్త్రప్రణయాంభోరాశియైన పినతల్లికి అభిషేకవార్త తానై చెప్పుదమని వచ్చెను. కాని ఆమె కోపగృహమందున్నది. ఇది మబ్బులేని వాన. రాజు మహిమలు తొక్కుకొనుచు లోనికేగి కైకయి ముసుగెడలించెను. కోపమూర్తి యనుకొన్న కైకయి శోకాధిదేవత. నీకు కోపమే యనుకొంటిని; ఇంత శోకము వహించితివి వంచెనుగననగా, తానెక్కడ దొరికిపోగునో, తన హృదయమెక్కడ దిగజారి పోవునో యను భయమున, కైకయి, "అహో వంచన ప్రక్రియ. నాకు నిజముగ కోపమేవచ్చినది. ఇది శోకముకాద"ని బూకరించెను, రాజు ఏపాటి కోరికలు కోరుకొందువో కానిమ్మనెను. కైకకు త్రానసుగక తప్పదు. రాజివ్వనన్న అదియొకదారి. రాజిత్తుననెను. సూర్యవంశస్థుడు దశరథుడు డాడి తప్పడు. ఆ ఎటుక ప్రాణాంతకమై కైకకు కోపశోకములు పెల్లై ఉబికినవి. రాజిది యంతయు తాను వరదానము చేయక పోవుట వలననే యనుకొనెను. బిత్తరకత్తె కాదువు ఇవుగో వాంఛింపుము నేనిత్తునని రట్టించెను. కైక ఆక్రోశపడి ఇత్తు నిత్తు నందువు. ఇత్తుననుట చులకన. ఇచ్చుట మాత్రము కాదనెను. దానికి రాజభిమానపడెను. ఆయన కన్నులు కెంపులై, మా కులము నేలెడి చిన్నారి వెల్గు రాముడు; వాని మీదనొట్టు. నీ వరములు నా ప్రాణములకు గండరకత్తెలైన నిత్తుననెను. కైక పూర్తిగా నోడిపోయెను. ఆవిడ కోర్కెలు విని రాజు హృది యందలి నెత్తురు వాకలు వెనుకకు నడిచినవి. అరువదివేల యేండ్లుగా వాని మనస్సున ముద్రితమైన కైకయీ సుస్వరూపమే మారి వికృతమైపోయినది. ఈ కైక వృకి. తినుటకు పట్టుకొన్న కుందేలు పిల్లతో తినబోవునంతలో ఆడినట్లే ఈ తోడేలును రామునితో నాడినది. ఈ కైక ఈర్ష్యానులిప్తదేహ. ప్రతీకార కైతవ రక్షస్సు. ఆ ఈర్ష్య సపత్ని రాజమాత యగునని ఆ ప్రతీకారము తద్గర్భము అరణ్యముల నవయవలెనని!

సర్వాయోగ్యయు కైక రామునడవులకు పంపుటకు కారణ మిదే యనుకొనెను. అది కాదని యామె చెప్పలేదు. ఉత్త నిందలపాలగుచున్న తన బ్రతుకు భారమును తేల్చివేసుకొనలేదు. ఒక ప్రక్క తన అంతరాంతర ప్రాణమగు బిడ్డ మనోవాంఛా పూర్తి మరొకప్రక్క వాని యెడబాటును సహించలేని సర్వాయోగ్యయు. ఈ రెంటి మధ్య నామె నలిగిపోయెను. ఇది చెప్పుటకు ఇది చేయుటకు స్పృహలేక నిశ్చలయై పోయెను. వరదాన మడిగిన క్షణమునుండి రాముడు, అరణ్యమునకేగుచు, తన కాళ్లకు నమస్కరించువరకు ఆమెకు మాటయు పలుకును లేదు. ఆమె మన స్సానకల్లోలితమగు నయోధ్య యందు అతిదుఃఖితుడగు దశరథుని ఎదుట —కైకయీ శరీరముండు లేనే లేదు.

ఇట్టి కైకయిని దశరథుడు చెడదిట్టెను. ఇవి చేతులుకావు కాళ్ళని బ్రతిమాలెను. నీకు గుడి కట్టించి రఘుకులముచే నిన్ను తరతరముల కొలిపింతునని ప్రార్థించెను. అంతేకాని తానావరము నీయలేదనడు. రాముడరణ్యములకు పోనక్కరలేదనడు. ముదిరేడు వాచాలుడై కైకను తిట్టి తన్ను దూరుకొని, తన భాగ్యమును నిందించుకొని మూర్ఛితుడై పోయెను. మాటమాటకిని పతి వచస్సుల కనుగుణముగా పొదలచు కైక ఆత్మనేవో నిలువరించెను. దశరథుడు దుఃఖమున నెంతవాచాలుడయ్యెనో కైక దుఃఖమున నంత నిస్తబ్ధయయ్యెను.

కబురుపోగా రాముడు వచ్చెను. తన్ను చూచి పలుకులేని తండ్రిని కని, "నా తండ్రి నాకు ప్రత్యక్షమురారి. ఆయన చెప్పిన ఏ విషపుద్రాకుస్వన్న గండాంతరాస్థిసైన నిద్రించెద. నన్నేల రమ్మంటివి తల్లీ" యని కైక మొగమువంక చూచెను. కైక మనస్సుడికిపోయినది. ఈ పుత్త్రుడే తన నష్టము పెట్టుకొని తండ్రిచే వరదానము చేయించుకొనెను. తనకు నిందను, ప్రతివారికిని తనపై ప్రాణాంతక మగు కోపమును మిగిల్చెను. ఈ ఊహతో ఆవిడ కన్నులాపాటున నిప్పులు చెరిగినవి. రాముడది గ్రహించి, "నీకును నామీద కోపమా తల్లీ! ఇందు నేనై చేసిన దేమి యున్నద" నెను. అట్లనుటలో

అంతయు దేవతల ప్రబోధమని ధ్వనించెను. కైకకు కోపమంతయు దుఃఖమైనది. ఆదుఃఖము ఆకంఠమ్ముగా వచ్చు దుఃఖము. దాని నామె నేత్ర రేఖాకోణమున అతి ప్రయత్నమున నదిమి చిక్కబట్టినది. మునిపంట ఆమె నొక్కిన క్రింది పెదవి నెత్తురు చిమ్మినది.

చిట్టచివరి మాటగా రాము డొక్కటి చెప్పెను. తనకు సేవ్యమైన కర్మమును చేయ సాయపడిన సాధ్వి పినతల్లి. ఆమెను పట్టుకొని, సాధింపులు, కోపములు లేక బెదరింపులు కొనసాగించిన తన ప్రాణము దుఃఖపడును. వారిరి మాను మనెను. కైకయీ పాదములకు ప్రణమిల్లి పుత్రునివలన కలుగు బాధలను తల్లిగాక మహేశ్వరు సైరింతురు, బాధపడకు మనెను.

అంతవరకు నిశ్చలయై యున్న కైకయికి రాముని కౌగిలివలన స్పృహ కలిగినది. తన కౌగిలియందు జనించిన పులకలు మై క్రొలగా రాము నెత్తి నుచ్చి కౌగిలించుకొన్నది. మూర్ధ మాఘ్రాణించినది. రాముడామె యాశీస్సు లివ్వరిదే వనికి బోవనెను. మూర్తి దాల్చిన సమష్కల్పా పొందియ్యెను. వానికి తన యాశీస్సు లక్కరలేదు. వాని బాహోద్యమ కుమార మార్గములు చేయ నపద్రవమున మహోత్కంఠారములు ఘోషిల్లును. తన యాశీస్సు లన్నియు రాముని వలె నగుటకుగా, తను కన్న భరతుని కన్నది. ఆ మాటల లోతులు తెలియక అందరును ఛీ ఛీ యనిరి. రాముడు మాత్రము తన్ను తల్లి చివరిదాక రక్షించినదని సంతసించెను. కాని తనను ప్రాణముకంటె మిన్నగా ప్రేమించిన సవతి తల్లిని తానెరిపించి సవతి తల్లిగనే లోకమునకు చూపినట్లాయెను.

ఇంతవరకును కవి చిత్రించిన కైకయీ రూప మొక యెత్తు. దశరథ మరణానంతరము కల్పన మరియొక యెత్తు. దశరథుని మృత కళేబరము పైబడి కౌసల్య యేడ్చుచుండెను. వరదానమైన గడియనుండి దశరథునకు కైకయి మొగము చూపలేదు. భర్తృ మరణవార్త విని యామె కౌసల్య యంతఃపురమున కేతెంచి వచ్చినది. ఆ కైక అసంస్కృత శిలాజాతి. నిరాశసదయథార్థ నిరంతర ప్రవాహ్నపు విమూషిత దాగమాలోచన. ప్రాణ సహితయయ్యు ప్రాణరహితవలె కన్పడెడి తన్వి ముఖమునందు కుంకుమబొట్టు మాత్రము కల సాధ్వి. ఇచట కవి యామెను కైకయీదేవి యనును. ఈ ఘట్టము కడ తాను చేయు కైకయీ పరిదీన స్వరూప వర్ణన మింత పరాకాష్ఠనందు నప్పటికి కవికి ఆ పాత్రయందు పాత్రయనెడి బుద్ధిపోయి దేవీ స్వరూపమును పూజ్యభావము పరివ్యాపించినది. అట్టి స్ఫురణ ఆ ఘట్టమును చదువు ప్రతి పాఠకునకును కలుగును. అట్టి కైకయీ దేవి రాజును రాణిని డగ్గరుటకు భయపడుచునే ఆ సమీపమున తారట్లాడుచుండెను. భర్తృ మరణ దుఃఖిత కౌసల్య తలయెత్తి కైకను చూచి యాక్రోశపడినది. ఆమె దుఃఖము కట్టలు తెగివచ్చినది. అది యుక్తాయుక్తముల నెరుంగని దుఃఖము. భర్తృ హీనము సర్వాశాప్రపంచమును నీవే బాపుకొనుము. నాకేమి? నేను పతి చితిపైబడి మ్రగ్గెదను. అటు మిథిలయందును, ఇటు అయోధ్యయందును అందరు నీవు చేసిన దోషలన్నది. అక్కడికిని ఆమె యూవేళ నూగలేదు. కక్కసపడి నిన్ను సవతిగా గొనుటచే నేను దానవవంశ జాతినైతి నన్నది. ఈ కైకయి వెనుకటి గర్వతరంగముకల కైకయి కాదు. ఈవిడ నిరభిమాన, నిర్లజ్జ, సర్వసన్యాసిని. కావుననే సవతి మాటలకు బిగ్గనేడ్చుచుపోయి కౌసల్య పాదములు పట్టుకొన్నది. ఆ యేడ్పుట కౌసల్య తన్నన్ని మాట లన్నదనికాదు. తన యభిమానము దెబ్బ తిన్నదనికాదు. తన ప్రియవల్లభుని మరణించినాడని. ఆ మరణమునకు తానే కారణమని, తన ప్రియపుత్రుడు డవులు పట్టినాడని. ఆ పని నాతికు తనచేతనే చేయించుకొన్నాడని. కైకేయీ దేవి సంతప్తమతివిధాన మట్టిది. అది యొక్క రామప్రభునకే తెలియును.

భరతుడు వచ్చి, బావురు మనుచున్న రాజ ప్రాసాదమును చూచెను. ఎవ్వరును వానికది యట్లేల యుండెనో చెప్పలేరు. తల్లికడకు వచ్చి యామె యడుగ దమ్ములంటి వావిడిచి యేడ్చెను. విశీర్ణ హృదంతర కైక స్పృహ తెచ్చుకొన్నది. భరతుడు గాథకేళి. వానికి రాజ్య మక్కరలేదు. వానికన్న యందు భక్తి యున్నది. వాడన్నియు త్యజించి అన్న వలె అరణ్యముల బట్టునేని నేల యేల్పడి తోలివలె సాగును. రాజ్య మరాజకమగును. అప్పుడు తాను దశరథ మరణమునకు కారణమైనట్లుగానే కోసల రాజ్య విచ్ఛిత్తికిని కారణమగును—కాననే ఆమె తన హృదయమును చిక్క బట్టుకున్నది. భరతుని కొరకుగా తనలో లేని తైక్ష్ణ్యమును తెచ్చిపెట్టుకొన్నది. ఆమె కన్నులయందు కనలును, దేహమున కంపమును, తమకు

తామై వచ్చినవి—జఘన్యుడు, బలయుతుడునైన రాచబిడ్డదే రాజ్యపాలనము. వాడు లోభవిహ్వల మతి కావలయును. వానికిలపై నెవ్వరును లేరు. మెత్తని యెదకల రాచ నిసువులకు ధారుణి సహస్రయోజనముల దూరమున నుండును. రామచంద్రుడు దోర్బలము మహా ప్రతాప శిఖి. శ్రీ ప్రభుడు. హేలాధనుశ్శ్రీ కళాపారావారుడు. అట్టి వానిని కత్తినో గెలువరాదు. వానిని నీవు నీ తల్లి నీతిచే గెలిచితివన్నది. ఈ భర యంతయు నీకై చేసి పెట్టితిని. నీవు చేకొన్న రామచంద్రు డిసుమంతయు పట్టించుకోడు. నీ ధైర్యమంతయు రాజ్యలక్ష్మీ రంహః పరిక్లృప్తి సంలీఢముగా చేయుమన్నది—

ఇది విని, భరతుడు కలవరపడి యింత గాలిమూట నా పేరున నేల కట్టితివనెను. నేనే రాముడైన నన్నడవికి తోలియుందువా యనెను. అందుకు కైక నవ్వి, "తగునురా అన్నా, నీవు కాంతారమేగి యేమి చేయుదువు? రామచంద్రుడు ప్రధ్మాంసు తేజో వినూతన నారాయణమూర్తి. శాసితసమస్తప్రాణి. నీ వేసుట, అతడేసుట, ఒక్కటా?" అన్నది-ఆమాటలు తల్లి తనను విడువలేని ప్రేమాతిశయముననే అనుచున్నదని భరతుడెనుకొనెను. సపత్నీ మాత్సర్యముననే ఆమె ఈ కార్యమిట్లు నెరవేర్చిన దనుకొనెను. తల్లిని తిట్టి, జననివగుట నిన్ను చంపను—లేకున్న నేమిచేసెడివాడనోయనెను. కైక దీనికేమియు ననలేదు. భరతుడు రామప్రభుని తెచ్చెదననగా, ఆమె కన్నుల కాంతి ప్రాలంబసుక్తోచ్ఛ్రితియై పుత్రుని క్రమ్మెను. భరతునకు తాననుకున్నట్లే రాజ్యకాంక్ష లేదు. పదునాలుగేండ్లు గడువుపిదప వాడు రామమూర్తికి మనఃపూర్తిగ రాజ్యమప్పగించును.

కాని యీ పదునాలుగేండ్లును వాడు రాజ్యభార నిర్వహణమునందు విరక్తుడు కారాదు. తాను చేయవలసినదది. "మహీ రాజ్యమందు వైరాగ్యమేచిన నీకు తగలను. రాముడు వన్యసీమలయందు నివాసము కొంగున తానై ముడికట్టుకొని చనెను. నీవు పిలిచిన వచ్చునా చూచెద" నన్నది. ఆ అనుట, ఎట్లువచ్చును వచ్చిన తిప్పి పంపనా యన్నట్లు భరతునకు ధ్వనించినది. అందుకు వాడు మండిపడి యింత నూడుకొనిన రక్కసితనముకంటె చావు మేలు. నన్నందరును కాంతా దుష్టసంకల్ప రేఖా ఘోటస్థునిగా నందురు. నీ

Statement about ownership and other particulars about

**BHARATHI**

**(Telugu Literary Monthly)**

**FORM VI**

(See Rule 8)

**The Registration of Newspapers (Central) Rules, 1956.**

1. Place of Publication :
   6 & 7, Thambu Chetty St., Madras-1.
2. Periodicity of its publication :
   7th of Every Month
3. Printer's Name :
   Sri S. Radhakrishna.
   Nationality : Indian
   Address : 6 & 7, Thambu Chetty Street, Madras-1.
4. Publisher's Name :
   Sri S. Radhakrishna.
   Nationality : Indian
   Address : (As above)
5. Editor's Name :
   Sri S. Sambhu Prasad.
   Nationality : Indian.
   Address : "Deviprabha" 6th Main Road, Raja Annamalaipuram, Adyar, Madras.
6. Names and addresses of individuals who own the newspaper and partners or share-holders holding more than one per cent of the total capital.

| NAME | ADDRESSES |
|---|---|
| 1. **Mrs. K. Ramayamma** | "Deviprabha", 6th Main Road, Raja Annamalai puram, Adyar, Madras. |
| 2. **Mrs. S. Kamakshamma** | Do |
| 3. **Mr. S. Sambhu Prasad** | Do |
| 4. **Mr. S. Radhakrishna** | 6 & 7, Thambu Chetty Street, Madras-1. |

I, S. Radhakrishna, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

S. RADHAKRISHNA,

*28-2-1957.* Signature of Publisher.

మాతృత్వమనకును, నీకును వేయి దండములని యట నుండి విసురుగా వెడలిపోయెను. పుత్త్రకృత ఈ తాదృశావమానమునకు పాత్రయైన నిరపరాధ జనని కైకేయి. కాని ఆమె ఈ ఘటనకు క్షోభ నొందలేదు. ఆమె అహంకార మమకారములు లేని సర్వసన్న్యాసిని. ఒక సత్కార్య నిర్వహణమున సహాయకురాలుగా వట్టి తుట్రలు నెత్తిన వైచుకున్న త్యాగమూర్తిని.

రాముని తెచ్చుటకుగా భరతుడు సర్వసైన్యను తన వెంట కదిలించెను. అందు ముగ్గురు తల్లులునుండిరి. భరతు డేగుగుచునకు రామచంద్ర వనవాస చింతనా దీనబుద్ధి అతివిహ్వలుడు. అన్న తన వెంట పురికి వచ్చునో రాడోయనుకొని, అన్నస్థితి తలచుకొని, తన దశచూచుకొని, భావమందు కష్టపడుచునే వచ్చుచుండెను. గుహునివలన రామకథను విన్న వెనుక వాని మనస్సు మరింత దీనమయ్యెను. నిలువనేరక మూర్ఛ పొందెను. రామ వనగమనానంతరము భరతునే రామునిగ చూచుకొను కౌసల్య గుండెలలో గుండెలు లేవు.

కైకకీ విషయము భరతుని ప్రవర్తన నచ్చలేదు, వాడింత తేలయైన రాముని తేలేడు. రామచంద్రుని బుద్ధి పరమసర్వతిర్కపటువు. అట్టి వాని దెచ్చుట చెక్కడలేని గాంభీర్యము కావలయును. ఈ సంగతి చెప్పుటకు కైక ఒక్క యేకాంతమున పుత్రుని ప్రబోధించెను. "నీవు భావమందింత కష్టపడుచుంటి వన్నను రామునకు లెక్కలేదు. వాద ప్రతివాదముల వానిని ఒప్పింతు ననుకొన్న వాడన్నిటికన్న చెప్పి పంపును. వృథా ఖిన్న మనస్కుడవైన నీవు వాని కేవల వాదము ముందు నిలువలేవు. ఏనాటికైన వానినింటికి దెచ్చుట కొక్కటేమార్గము. నీ బుద్ధిని ప్రయోగింపకుము. దానిని హృదయమందు దాచుకు. అతడే రాజు. నీవు రాజువు కావు నీకు రాజ్యమే అక్కర లేదన్న విధములో నీవుండినచో ధీబంధుడైన వాడు కొంత దిగివచ్చును. రాజ్యము నీదియని నీ రాజ్యము వానికిచ్చుచుంటివని నీవు దలచినచో మొదటికే మోసము. నీకింత దుఃఖమున్న నీవు దిట్టరివి కాలేవు. దానిని దిగద్రొక్కు కొమ్మన్నది. భరతుడీ మాటలు విని విస్తుపడెను. ఉన్న వాడున్నట్లు కన్నువిప్పె తల్లిని చూచెను. ఆమె యింత చెప్పినను ఏదియో దాచియే చెప్పెను. సముద్రమంత యర్థ మామాటలలో దాగి యూహల కందకయే పోయెను. కాని వాని కొక్కటి తెలిసినది. తన తల్లి చాతుర్యమే వాని నడవులకు బంపినది. ఆచాతుర్యమే వాని నయోధ్యకు రప్పింప గలదు. అన్న నెట్లైన పురికి రప్పింపుమని భరతుడు తల్లిని వేడుకొనెను.

అందరును భరద్వాజర్షి యాశ్రమము చేరిరి. ఇచట కైకయీ పాత్ర చిత్రణమును పరాకాష్ఠనందించుటకు కవి మరియొక కల్పన చేసెను. ముగురు రాణులును ఋషి యాశీస్సులు పడయుటకు సన్నిధికివచ్చిరి. భరతుడు వారిని పరిచయము చేయవలసి వచ్చెను. అతడు కౌసల్యను రామచంద్ర గర్భశుక్తి వీచిగా చెప్పెను. సుమిత్రను కోసలాధిపుని యింట కష్టముల నందర నాదుకొను శాంతాత్మగా చెప్పెను. తన తల్లిని గూర్చి యేమి చెప్పవలయునో వానికి పలుకు పాగలేదు. సర్వసైన్య యెదుట తానామె పుత్రుడ ననుట తన కవమతి. కాని అంతకుముందామె చేసిన యుపదేశము లోని సముద్రపు లోతులు హృదయమున తెరలి ఆమెను గూర్చి మరొక విధముగా చెప్పనీయలేదు. ఏమియును చేయలేక భరతుడు కైకయీ ముఖాబ్జమందు చూచి, చూపును మరలించి, మూగవట్లు మాటాడకుండ నూరుకొనెను.

భరద్వాజుడు సర్వవేత్త. అతడొక్క నవ్వు నవ్వి భరతుడు చెప్పకున్నను ఆమె ఎవరో తనకు తెలియు ననెను. ఆమె అమర సాహాయ్యార్థము రక్కసుల నెదుర్చు దశరథభూమిపాలుని సారథి. కూటనీతి సంక్లిష్టమార్గములందు వాని రహస్య మంత్రిణి. శ్రీ రఘురాముని చిత్రధనుఃకళాద్భుతి హేతు నూత్న గాధి ఋషి. మరియు సర్వదైవత ఋషిసంతాన కార్య సంఘాత శ్రీ సంధాన కర్త్రి. తనను పెంచిన ఋణము తీర్పను, తన హృదంతరాంతర ప్రాణమును బిడ్డ నడవి కంపిన త్యాగమూర్తి. అట్టి కైకయి గౌరవార్హురాలని ఋషి భరతునితో చెప్పెను.

ఈ ఘట్టము చదివి స్పందించని హృదయముండదు. ఆర్ద్రములు కాని కన్నులుండవు. కైకయీ పాత్ర ఒక అమర సృష్టియై. కల్పవృక్షము, స్మరణకు వచ్చినపుడెల్ల, మనస్సుల నమృతము చిలుకునంత పటిష్ఠముగా కవి దానిని తీర్చి దిద్దెను. వజ్రాయుధమునకు గల వేయి యంచులవలె, లోకసాక్షికి గల వేయి కిరణములవలె, రాముని యెడలి పుత్రప్రేమయు వాని కోరిక నెరవేర్చుటకై స్వధర్మ నిర్వహణా పటిష్ఠతయు తీక్ష్ణములై, తేజఃకలితములై కైకయీ పాత్రయందు పూర్ణముగా భాసించుచున్నవి, ఇట్టి పాత్రను సృజించి వానియిచ్చిన కవి ధన్యుడు.

# పరాజితులు

శ్రీ వల్లపురెడ్డి

తండ్రి బ్రతికుండగా భానుమూర్తి ఎన్నడూ ఆయనకు పాదాభివందనము సరికదా, చేతులు జోడించి నమస్కారంకూడా చేసి యెరుగడు. దీనికి కారణాలు అట్టే బలమైన వేమీ లేవు. అయినా ఒక్క కారణానికి మాత్రం కొంచెం ప్రాముఖ్యం ఇవ్వొచ్చు.

అతడు ఈనాటికి ముప్పై వసంతాలు కూడా సరిగా చూడ్లేదు. కాని ప్రాపంచిక జ్ఞానంలోనూ, అనుభవాల్లోనూ తన ఈడువారిని మించాడు. ఎదుట నమస్కారం చేసి దాపుకు వెళ్ళటంతోనే దుమ్మెత్తి పోసేవారిని చూశాడు. కొందరు స్వీయ కార్యనిర్వహణార్థం ఎనలేని భక్తిప్రపత్తులు ప్రదర్శించి ఒక్కొక్కప్పుడు అవసరమైనవారి పాదధూళి మస్తకంమీద తాలుస్తారు; ఆ కార్యం కాస్తా ముగిసిపోగానే అతని ఉపకారాన్ని మరచిపోవడమేగాక సమయం వచ్చిందంటే అతనికే తీరని అపచారం చేయడానికి నడుం బిగిస్తారు. ఇల్లాంటి మనస్తత్వం కలవారిని రోజూ చూస్తూనే వుంటాడు. అతనికి పరిచయమున్నవారిలోనే—తనకు కొంచెం సన్నిహితులని ఎవరినైతే ఎంచుకుంటాడో వారిలోనే-కొందరికి ఈ ప్రవర్తన బాగా అలవడింది. ప్రసంగవశాత్తు ఎప్పుడైనా అలాంటి మనస్తత్వముపట్ల తనకున్న న్యూనభావం ప్రకటిస్తే వారంతా, "నువ్వింకా ఉప్పుకూ, పర్కారకూ భేదం తెలియనివాడివి బాబూ!" అని తనను అదోమాదిరి చులకన దృష్టితో చూసి నవ్వేవారు.

పరిచయస్తులంతా తన్ను లౌక్యం అంటే తెలియని అమాయకుడిగా జమకట్టినప్పటికీ భానుమూర్తి తన దృక్పథం మార్చుకోలేదు. అతడు విద్యార్థి దశలో వున్నప్పుడే ఎన్నో నైతికసమస్యలను గూర్చి తదేకంగా ఆలోచించేవాడు. తనతోబాటు చదువుతున్న రామ్మూర్తి సెలవుల్లో ఇంటికి వచ్చినప్పుడు అమ్మానాన్నలతో వీలైనంత తీయగా మాట్లాడి అవసరమైన డబ్బులు లాగేవాడు. తిరిగి బస్తీకి వెళ్లడంతోనే వారిని పూర్తిగా మరచిపోయి తన క్షేమసమాచారాలకు అనుదినమూ ఎదురుచూసే వారికి కనీసం మూడు కానీల పోస్టుకార్డు కూడా వ్రాసేవాడుకాదు. రామ్మూర్తి తల్లిదండ్రులపట్ల ప్రదర్శించే నక్కవినయమూ, ఎక్కువైతే నమస్కారబాణాలూ కేవలం తన బస్తీమోజులను తీర్చగలిగే డబ్బులకొరకు తప్పితే మరిదేనికీ కావని మొదటినుండీ గ్రహిస్తూవచ్చాడు. నీతినిగూర్చి పెద్దపెద్ద రచయితలూ, కవులూ, వ్రాసిన గ్రంథాల్ని చదివాడు. చదువుతూన్నకొద్దీ అతనికి రక్తసంబంధమైన మమకారం వికలింపరాని మహోవ్రతమని బోధపడింది. తలిదండ్రులకూ, వారి సంతానానికీ మధ్య రక్తం అనేది రాగబంధాల్ని సృష్టించే ఒక అపూర్వమైన సంబంధం......భానుమూర్తి తిరగవేసిన పుస్తకాల పుటల్లో తలిదండ్రులకు నమస్కరించాలనీ, వారిని పూజించాలనీ లేకపోలేదు. అయితే అతను వీటిని బాహ్యంగా పాటించలేదు. నమస్కార బాణా

---

* ఉస్మానియా విశ్వవిద్యాలయం ఈ సంవత్సరం జరిపిన కథలపోటీలో యావదాంధ్రంలోని కళాశాలల విద్యార్థులూ పాల్గొన్నారు. రెండు కథలు మొదటి బహుమతికీ, రెండు కథలు రెండో బహుమతికీ, రెండు కథలు మూడవ బహుమతికీ - ఇలా ఆరు కథలు అర్హతను పొందాయి. ప్రథమ బహుమతి పొందిన రెండు కథలలో శ్రీ అరిపిరాల విశ్వంగారి కథను గతమాసం భారతిలో ప్రకటించాం. ఇది ప్రథమ బహుమతి పొందిన రెండవ కథ.

లతో ఇతరుల్ని బాధించే మహాశయుల్ని చూసిన్నాటి నుంచే అతని దృష్టిలో నమస్కారానికున్న విసలయిన విలువ తగ్గిపోయింది. అంచేత అతను తలిదండ్రులకు నమస్కారాలు గానీ, పాదాభివందనాలు గానీ, అంతకంటే మహత్తరమైన, మరేరకమైన గౌరవప్రక్రియలు గానీ మనస్సులోనే కావించాడు. ఆ తీరే పవిత్రమైందిగా భావించాడు.

అయితే, కొన్నాళ్ళుగా అతనికి తన తలిదండ్రుల మీద వున్న భక్తి విశ్వాసాలూ, రాగమూ, వినయమూ సడలిపోయినవి. తలిదండ్రులమీద కపటమైన వినయవిధేయతల్ని ప్రదర్శించే రామ్మూర్తిలాంటి వాళ్ళు లోకంలో వున్నట్లే, తమ సంతానంమీద కృత్రిమ వాత్సల్యాన్ని ప్రకటించే తలిదండ్రులు కూడ వుంటారని అతని మనస్సులో స్థిరపడిపోయింది. దీనికి మూలకారణం అతనికి అత్యంతాత్మీయుడైన అన్నగారి మరణమే.

స్కూలుఫైనలు పరీక్షనుంచి ఇంటికి రావటంతోనే భానుమూర్తి, బావిలోపడి, ఆత్మహత్య చేసుకున్న అన్నగారి శవాన్ని చూడటం తటస్థించింది. ఆ దృశ్యమే అతని హృదయంలో అగ్నిప్రళయాన్ని సృష్టించి అతఃపూర్వం అతనికి జననీజనకులమీద వున్న సదభిప్రాయాలన్నిటినీ భస్మం చేసి వేసింది.

* * *

భానుమూర్తి స్కూలుఫైనలు చదువుకొరకు బస్తీకి వెళ్ళిన మూడో నెలాంతంలో వున్నట్లుండి అన్నగారు బస్తీకి వచ్చేశారొకనాడు. రావటంతోనే మామూలుగా అన్నగారి చేతిసంచిని పరిశీలించాడు. దానిలో వున్న పంచె, రెండు చొక్కాలూ, బనీనూ, షేవింగుమెషీనూ చూసేసరికి ఏదో అనుమానం వేసింది. అన్నయ్య ఎప్పుడేనా తనదగ్గరికి వస్తే కట్టుబట్టలతో వచ్చేవాడు. అలాకాకుండా వేరువిధంగా రావడం అతని హృదయంలో అనిర్వచనీయమయిన ఆవేదనను కలిగించింది. అన్నయ్య ముఖంలోకి ప్రశ్నార్థకంగా చూశాడు. తమ్ముని చూపుకి సమాధానం ఏమీ చెప్పకుండా దాదాపు దుఃఖసంఛన్నమైన వదనాన్ని క్రిందికి దించుకున్నాడు.

“రా అన్నయ్యా! అటు వెడదాం” అన్నాడు భానుమూర్తి.

అన్నయ్య మారు పలక్కుండా లేచి తమ్ముణ్ని అనుసరించాడు. అలా బస్తీ బయట వున్న చెరువుగట్టు మీద సాయంత్రపు చల్లగాలిలో వెళుతున్నారు. ఇరువురూ ఏమీ మాట్లాడకుండా మౌనంగా వెళుతుంటే అన్నయ్య ఒకచోట అకస్మాత్తుగా ఆగాడు. ముందరికి వెళ్ళినవాడల్లా తమ్ముడు వెనక్కు వచ్చి దుఃఖభారంతో కృంగిపోతున్న అన్నయ్యను చూసి “ఏమిటన్నాయ్?” అన్నాడు.

“ఇంటికి వెళ్లు తమ్ముడూ!” అన్నాడు కళ్లల్లో నీళ్లుమలచుకుంటూనే.

“ఎందుకన్నా?”—అడిగాడు భానుమూర్తి.

“నీ సంసారం చూసుకో వెళ్ళు.” ఈసారి కళ్లలోని నీళ్లు కాస్తా జారి జొటజొటామని క్రింద పడినయి. ఏడుస్తున్న ధ్వని బయటికి రాలేక గొంతులోనే ఘూర్ణిల్లటం ప్రారంభించింది.

అన్నదమ్ములు చిన్ననాటినుంచీ నిరుపమానమైన అన్యోన్యతతో జీవించారు. ఓ ఒక్కనాడూ నీవూ నేననే భేదం రానివ్వలేదు. శరీరాలు వేరైనా ఆత్మలు ఒకటిగా మెలిగారు వారి నిర్వ్యాజమైత్రిని చూసి ఊళ్లోవాళ్లంతా అప్పుడే రామలక్ష్మణులనే బిరుదాన్ని ప్రసాదించారు. ఒకో సంసారంలోని అన్నాదమ్ములు, ఒకరి అభిప్రాయంతో ఒకరు ఏకీభవించలేక, విభాగాలవుతుంటే ఒక్కోసారి అన్నయ్య “చూడు తమ్ముడూ! పెద్దవాడివయాక నువ్వూ నా నుండి అలా విడిపోతావేమో!” అనేవాడు. తమ్ముడు అలా ఎన్నటికీ కాదని గుండెధైర్యంతో పలికితే అన్నయ్య మళ్లీ, “ఏమో, ఎవరికి తెలుసు, నీ భార్యవస్తే, ఆమె మాటల్లో పడి నువ్వూ సామాన్యులకు మల్లే నుండి వేరైపోయి గర్భశత్రువుగా మారిపోతావేమో!” అన్నప్పుడల్లా భానుమూర్తి నుండి ఒకటే సమాధానం వెలువడేది, “మనిద్దరికీ మధ్య విభేదం కల్పించే ప్రమాదం భార్యాగమనంవల్ల జరిగేటట్లయితే నాకా పెళ్లే అక్కర్లేదు. ప్రమాణం చెయ్యనా?” అని. పుట్టినప్పటి నుంచీ తమ్ముడి మనో నైశ్చల్యాన్ని పరిశీలిస్తూ వచ్చిన అన్నయ్య తమ్ముడి మాటల్లో అడ్డుపడి “ఆగు తమ్ముడూ అంత పనీ చేశేవ్? ఊరికే అలా అన్నానంతే కాని, నీ మనసు నాకు తెలీదూ? మన మనసులు ఒకటిగా వుండాలి కాని ఆడవాళ్ళేం చేయగలుగుతారు?—ఈ విధంగా నడిచింది వారి నిర్వ్యాజ ప్రేమానుబంధం.

# పరాజితులు

'అన్నయ్య, 'వెళ్ళి నీ సంసారం చూసుకో,' అని అనే సరికి తమ్ముడు త్రుళ్ళిపడ్డాడు. తన నెవరో చెంపమీద ఛెళ్ళుమని కొట్టినట్లుగా బాధపడ్డాడు. మనస్సులోని వేదన దాపుకోలేక? "ఏమిటన్నయ్యా, ఇలా మాట్లాడుతున్నావు?" అనడిగాడు.

"అవును తమ్ముడూ ..." — అన్నయ్య ఇక మాట్లాడలేక పోయాడు. గొంతులో సుళ్ళు తిరుగుతూ వున్న దుఃఖపు తెరలు కొన్ని ధ్వనిచేస్తూ బయటికి వచ్చేసినయి. భానుమూర్తి భరించలేక పోయాడు. "ఏడ్పెందుకొచ్చిందన్నయ్యా? ఏం జరిగిందో కొంచెం చెప్పు. నీవలా ఏమీ చెప్పకుండా ఏడిస్తే నేనిక అట్టే సేపుండలేను. నాగుండె పగిలిపోతుంది".

అన్నయ్య కళ్ళనీళ్ళు తుడుచుకొని పొర్లి వస్తున్న ఏడ్పును బిగబట్టుకొని బహు కష్టంగా అన్నాడు: "ఏం చెప్పను భానూ! వుండుండీ మన సంసార వృక్షానికి కోతి మూలిపిందెలు పుట్టినయి. అమ్మా నాన్నలు ఎవరి చెప్పుడుమాటలకు లొంగి పోయారో తెలీదుకాని, కొన్నాళ్ళనుండీ, మీ వదిన్నూ, నన్నూ ఒక శేపనిగా తిడుతున్నారు. అతిట్లు సర్వసామాన్యమైనవి కాకపోవడంవల్ల నా హృదయాన్ని శూలాల్లా బాధపరుస్తున్నాయి. ఇన్నాళ్ళుగా చూస్తున్నావుకదా, మీ వదిన దొంగతనం చేస్తుందంటే నమ్ముతావూ? ఇంట్లో బియ్యం అమ్ముకుందట. అందుకని మీ వదినను నాన్న అనరానిమాటలు అన్నాడు. ఆఖరుకొస్తే 'దుడుకముండా!' అనటానిక్కూడా సంకోచించలేదు. నా అసమర్థతవల్లే ఇంతదూరం జరిగిందట. నన్నూ నానా మాటలూ అని, ఇష్టమయితే భాగం పంచుకొని వేరుగా ఉండమనీ, లేకపోతే ఇంటిపెత్తనం చలాయించమనీ తాళాలగుత్తిని నామీదకు కోపంకొద్దీ విసిరారు."—

భానుమూర్తి ఏమీ మాట్లాడలేకపోయాడు. తన దృష్టిలో ఆనాటివరకు తలిదండ్రులూ, అన్నా వదినలూ, దైవసమానులు. వారి పవిత్రవాత్సల్యాన్ని సంపాదించడమే తనకు పరమధర్మం. ఎప్పుడైనా వాళ్ళను గురించి అపోహలు కాకతాళీయంగా తనలో తలెత్తితే వెంటనే అది తన అజ్ఞానం తప్ప వేరేమీ కాదని తేల్చుకొని ఇకముందు వారినలా అపార్థం చేసుకోకుండా ఉండటానికి నిర్ణయించుకునేవాడు.— అన్నయ్య చెబుతూన్న మాటలు ఎంతవరకు నిజమో ఒక నిశ్చయానికి రాలేకపోయాడు.

కొంచెం ఆగి తరువాత అన్నయ్యే మళ్ళీ మొదలెట్టాడు, "తమ్ముడూ నువ్వే చెప్పు. నాన్న అనాలోచితంగా ఆ రెండుమార్గాలూ పెట్టాడు. కాని ఆ రెంటిలో ఏ ఒక్కదాన్నైనా నేను అంగీకరించగల్గుతానా? భాగం పంచుకున్నా, ఇంటిపెత్తనం చేతిలోకి తీసుకున్నా లోకం నావైపే వేలెట్టిచూపుతుంది. తండ్రితో వేరుపడిపోయినవాడూ, తండ్రి వుండగానే పెత్తనం చేతిలోకి తీసుకొన్నవాడూ, ఒక కొడుకవుతాడా?"—తమ్ముని ముఖంలోకి చూశాడు.

"అయితే మరేంనిర్ణయించుకున్నావన్నయ్యా?" హృదయవిదారకమైన మాటల్ని వినలేక అడిగాడు.

"ఏం నిర్ణయించుకోమంటావు భానూ, ఆ రెండు మినహాయించి మూడోది-ఎక్కడికైనా వెళ్ళిపోవడం."

"అలాంటప్పుడు నాకుమాత్రం ఇంటితో పనేముంది? నేనూ వస్తాను నీవెంట"—"మన మిద్దరం విడిపోకుండా ఉండాలని చిన్ననాటినుంచీ అనుకున్న మాటలనే జ్ఞప్తికి తెచ్చుకో" అన్నట్లు చూస్తూ నిలబడ్డాడు భానుమూర్తి.

"అలా జరుగరాదు తమ్ముడూ! వాళ్ళకు నీపైని కొండంత ఆశవుంది. నువ్వుకూడా నన్ననుసరిస్తే వాళ్లు దుఃఖంలో మునిగిపోతారు. నువు వెళ్లు, నన్ను మరచిపో."—అన్నయ్య మాటలలోని వింతతీరు భానుమూర్తిని కలవరపరచింది

"నీకు తెలుసు కదన్నయ్యా. నేను నిన్ను వదలి వుండలేను; అలాగే అమ్మా నాన్నలనూ. అందుకేనా సలహా ఒకటి విను."—'ఏమిటి?' అన్నట్లు ప్రశ్నార్థకంగా చూశాడు అన్న. "సంసారాల్లో ఇలాంటికలహాలు సామన్యంగా జరుగుతూనే ఉంటాయి. వీటన్నిటినీ సర్దుకుపోవాలికాని, ప్రతిదానినీ మనసుకు పట్టించుకుని బాధపడడం మనలాంటి వాళ్లకు తగని పని. నేను రేపు ఊరికి వెళ్లి పరిస్థితులు చూసి వస్తాను. అమ్మా నాన్నలు ఏదో ఆవేశంలో నిన్నలా అన్నారే కాని తప్పకుండా బాధపడుతుంటారీపాటికి. నేను వచ్చేదాకా నువ్విక్కడే ఉండు." భానుమూర్తి, 'సరేనా?' అన్నట్లు చూశాడు అన్న ముఖంలోకి.

చీకట్లు ముసురుకున్న ముఖాన్ని క్రిందికి వంచాడు అన్నయ్య. ఆమౌనం అంగీకార సూచకమే ఐంది. అప్పటికి సాయంత్రం కావచ్చింది. బస్తీలో

ఎలక్ట్రిక్ దీపాలు వెలిగినై. అన్నాదమ్ములు గృహోన్ముఖులై నడిచారు.

అన్నయ్య భోజనం సరిగా చెయ్యలేదు. మెతుకులు కొరుకుతూంటే భానుమూర్తి కూడా అన్నం సగంలోనే విడిచి, లేచి చేయి కడుక్కున్నాడు. అన్న ఏదో వేదనలో ఉన్నాడని భానుకు తెలుసు. తొమ్మిదవగానే బలవంతాన సినిమాకి లాక్కెళ్లాడు—తన్మూలంగానైనా కాస్సేపు వికలమైన మనస్సు శాంతిస్తుందేమో నని అతని ఊహ.

అన్నయ్యను బస్తీలోనే ఉంచి భానుమూర్తి తన గ్రామానికి వెళ్ళాడు. బస్సు దిగి ఇంటికి వెళుతుంటే దారిలోనే తనకు వంశసంబంధి అయిన ఒకామె ఎదురైంది. "భానూ, బస్తీకి మీ అన్నయ్య గాని వచ్చాడా?" అని పలకరించింది.

"రాలేదు; ఏం, ఇక్కడలేడా?"—తనకేమీ తెలియనట్లుగా నటించాడు; ఆమె ఏమైనా చెబుతుందేమోనని.

"నిన్నటినుంచీ కన్పడ్డంలేదు."

"ఏం జరిగిందేమిటి?"

"ఏం జరగాలి? మీ అమ్మ నాన్నా, నిన్న, మీ వదిన్నా మీ అన్నయ్యనూ అనరాని మాటలన్నీ అన్నారు. కాటికి కాళ్లుచాచుకున్న ఈ వయస్సులో వారి కదేం తోచిందో కానీ చేతికి వచ్చిన కొడుకుని జారవిడుచుకున్నారు. అబ్బ, అవి అనాల్సిన మాటలేనా? అన్నయ్య మనస్సు విరిగి ఎక్కడికి వెళ్ళాడో ఏమో. ఇంతకూ నీ దగ్గరికి వచ్చి ఉంటాడేమోనని అనుకున్నాం."

"ఉహుం, రాలేదు."

"మీ వదినవారికి గాని వెళ్ళాడేమో!"

"ఏమో, కావచ్చు-" భానుమూర్తి చాలాసేపు మాట్లాడ్డంవల్ల ప్రయోజనం లేదని ఎంచి ముందుకు నడిచిపోయాడు. ఇంట్లో జరిగిన కలహాన్నిగురించి చెప్పిందికాని కారణం చెప్పలేదు. ఏమై ఉంటుందని ఆలోచించుకుంటూ ఇంట్లో అడుగు పెట్టాడు.

"ఇదే రావడమా భానూ? పరామర్శించాడు నాన్నగారు. ఆయన ముఖం ఎప్పటికి మల్లే చిరునవ్వుతో కళకళగా లేదు. ఆ ముఖంలో గాంభీర్యం, కించిత్ కోపం ద్యోతక మవుతున్నాయి. కంఠస్వరం కొంచెం హీనంగావున్నా మార్దవం మాత్రం లోపించలేదు. సామాన్యంగానే, ఉంది.

"అవును నాన్నా" జవాబిచ్చాడు భాను.

"ఇప్పుడేం సెలవులా?"

"కాదు. కొంచం డబ్బు అవసరం ఉం వచ్చాను."

"నువ్వు వారంక్రితం డబ్బుకోసం వ్రాసిన ఉత్తరం చేరింది_ నిన్ననే పోస్టుద్వారా పంపాను. ఇంకా చేరలేదా?"

"లేదు. బహుశః ఇవాళ అందవచ్చు."

ఇంట్లోకి వెళ్ళి పలహారం చెయ్యటానికి కూర్చున్నాడు. అమ్మ ఏమీ మాట్లాడలేదు. ఆమె ముఖంలో కూడా ఇప్పుడో అప్పుడో వర్షించనున్న కారు మేఘాలు వ్యక్తమయ్యాయి.

బస్తీలో అన్న చెప్పినదంతా విన్నాక భానుమూర్తికి తలిదండ్రులమీద ఒళ్ళెరుగని ఆవేశమూ, క్రోధమూ జనించాయి. అతని దృష్టిలో తలిదండ్రులు తననూ, అన్నయ్యనూ వేరుచేసే కటిక వాని కత్తిలా అగుపడ్డారు. ఇంటికి రావడంతోనే ఇరువురినీ ఏదో అడిగి అటో ఇటో తేల్చుకోవాలనుకున్నాడు. కాని ప్రథమదర్శనం తండ్రిగారిది కావడంతోనే అతనిలో విజృంభించిన క్రోధావేశాలు పిక్కబలం చూపినయ్. పుట్టినప్పట్నుంచీ తండ్రిగారు ఎన్నడూ కట్టుచ్చుకు తమకు వినయ విధేయతలూ, భయభక్తులూ నేర్పలేదు; అయినా, ఆయన ముఖంలోని గాంభీర్యమూ, కళ్లలోని తేజమూ సంతానానికి తలిదండ్రులపట్ల కన్పరచాల్సిన వసవసిని లిర్ఫిదు నివ్వడానికి సరిపోయినై. తండ్రిలో ఉన్న ఈ మహత్తర శక్తులే భానుమూర్తిని నోరుమెదప నివ్వలేదు.

అన్నయ్య ప్రక్కనలేకుండా భానుమూర్తి చాలా అరుదుగా భోంచేసేవాడు. అతనికి ఫలహారం సహించలేదు. అయినా మధ్యలో వదలివేస్తే విషయాలు అన్నీ తెలకవగలమైనట్లుగా భావిస్తారనీ, ఆ శంకవారిలో కలగకుండా చేయాలనే ఉద్దేశంతో పూర్తిచేసి బయటకివచ్చాడు.

"దొరగారు రాలేదా బస్తీకి?"—ప్రాంగణంలో కూర్చుని చుట్ట పీలుస్తున్న నాన్నగారు ప్రశ్నించారు.

ప్రశ్నవిని భానుమూర్తి ఉలిక్కిపడ్డాడు. 'వారగారు, అనే సంబోధన అన్నయ్యను గూర్చేనని తెలుసుకున్నాడు. అందరికీ అన్నయ్య తనదగ్గరికే వచ్చి ఉండొచ్చుననే అనుమానం ఎందుకు కలిగిందా అని కొంచెం ఆలోచించాడు.

జవాబివ్వడంలో వెనకముందాడితే వారి అనుమానం దృఢపడిపోతుందని, వెంటనే "లేదు" అన్నాడు.

"రాణీగారి గ్రామానికి వెళ్లాడేమో!" అని తనకు తానే చెప్పుకొని మౌనం వహించాడు. 'రాణీగారనే, సంబోధన వదినకు చెందింది. ఈ పదాలు సామాన్యంగా కోపం వస్తేగాని ఒకరి విషయంలో నాన్నగారి నోటినుండి ఉచ్చరింపబడవు. ఆయన ఇక తనను ఎక్కువేమీ ప్రశ్నించలేదు. కాని "ఇదెంత,? దీని తాహతెంత? నన్ను, వాడు, అన్నదాక నోరత్తిదే! దాని తాలూకువాళ్లు కలవారైతేకానీ; ధనం తక్కువైనంత మాత్రాన అభిమానధనం తక్కువైందనుకున్నదేమో! వెధవది-ఛీ-దానికంటే తెలివిలేక పోయింది అనుకుందాం. కాని దాని కొంగు పట్టుకుని తిరిగే వెధవకి ఉండకూడదూ? దాని మాటల్లోపడి కన్న తలిదండ్రులను తూలనాడి వెళ్ళిపోతాడా? పోనీ, వాడు మాకు పుట్టనేలేదనుకుంటాం..." అని ఏమేమో పెద్ద గొంతుకతో మాట్లాడాడు. భానుమూర్తి ఊరికే వింటూ కూర్చున్నాడు.

మధ్యాహ్నం నాన్నలేని సమయంచూసి అమ్మ మొదలెట్టింది. "మీ అన్నయ్య అక్కడికి రాలేదా నాయనా?" అని.

అందరికీ ఇచ్చిన జవాబునే అమ్మకూ ఇచ్చాడు.

"నీ దగ్గరకి వచ్చి ఉంటాడనుకున్నాం. ఇక మీ వదిన దగ్గిరికి కాకపోతే ఎక్కడికి వెడతాడు? ఆనాడు మీ వదిన మాట్లాడిన మాటలు తలచుకుంటే......" విషయమేమిటో చెప్పకుండానే అమ్మ ఏడ్పు సాగించింది. కళ్లకు కొంగు చాటు పెట్టుకుంది.

నాన్నను చూస్తే పిల్లిగా మారే భానుమూర్తి అమ్మతో కొంచెం ధైర్యంగా మాట్లాడగలడు. "అసలు ఏం జరిగిందో చెప్పకుండానే ఏడిస్తే ఎట్లానే అమ్మా?" అన్నాడు చీకాకు పడుతూ.

"ఏం చెప్పను నాయనా. అది, ఎంతైనా మామ గదా అని, మీ నాన్నను కాస్త గౌరవంగా కూడా మాట్లాడలేదు. ఒకచీర తీసుకు రావడానకు తాహతు లేదు, ఒకరవిక కొనివ్వడానకు తాహతులేదు. వీళ్లు కోడళ్లతో కాపురం చేయించుకుంటారట, కాపురం! కోడలితో సమరసంగా మాట్లాడలేనివాడు, వీడూ ఒక మామట! ఇదీ ఒక అత్తట, ఇట్లా అంది. నన్నంటే ఫరవాలేదు. కాని నలుగురిలో పరువూ ప్రతిష్ఠా కలిగి బ్రతికిన మీ నాన్నను అలా అంటే సహిస్తాడా? చూసేవాళ్లకు నవ్వులాట కాదూ? మీ నాన్న కోడలితో సమరసంగా మాట్లాడాల్సిన అవసరం ఎంత వరకుంటుంది నాయనా? ఎప్పుడూ పల్లెత్తుమాట అని ఎరుగడే! ఇంతకూ అది లేనిపోని అపనిందలన్నీ మోపి పచ్చని సంసారంలో చిచ్చు పెట్టాలని చూసింది. లేకపోతే దానికి చీరలూ, రవికెలూ మీ నాన్న కొనివ్వక పోతే మరెవ్వరు తగలెట్టారు? ఏమో వినేవాళ్లకి దాని కపటం ఏం తెలుసు? చూడటానికేమో అది పిల్లయిపోతుంది. లోకులు ఔనమ్మా, కుట్టిదాన్ని చేసి తిప్పలు పెడుతున్నారు అని అనుకుంటారు. కాని దీని నిష్కారణ నిందలోని నిజం గ్రహిస్తారా? పోనీ దానికంటే తెలివి లేకపోయింది అనుకుంటే మీ అన్నయ్య కూడా అది చెప్పినట్లల్లా ఆడుతూ దాని కొంగట్టుకుని వెళ్లిపోతాడా? పది నెల్లూ మోసి కనిపెంచిన దిందుకేనా? తలిదండ్రుల్ని రద్దీపెట్టడానికేనా? ఇన్ని పాట్లుపడి ఈ సంసారం వెలగబెట్టేది మీకొఅకు కాకుంటే మరెవ్వరికోరకు? వాడలా వెళ్ళిపోతే మాకుమాత్రం ఆ వేదన ఉండదూ?" అమ్మ సుదీర్ఘమైన ఉపన్యాసం సాగించింది.

భానుమూర్తి వింటూ నోరు మెదపలేక పోయాడు. అన్న చెప్పిన విషయాలకూ, ఇక్కడ తను విన్న విషయాలకూ మూడుకూ తొమ్మిదికీ (3-౯) వున్నంత సామ్యంవుంది. తలిదండ్రులమీద కొండంత భక్తీ భయమూ; అన్నపట్ల అంతే అభిమానమూ గౌరవమూ, ఎవరి మాటలనూ తప్పని అనలేక పోయాడు. ఇక మిగిలినది వదిన. ఆమె సంసారానికివచ్చి ఐదో ఏడు. అన్నగారి వివాహానికి తత్పూర్వంనుంచే తను ఊరికి దూరంగావున్న బస్తీలో విద్యాభ్యాసం చేస్తున్నాడు. అంచేత వదిన మనస్తత్వం ఎలాంటిదో అతనికి తెలియదు. తెలుసుకోవాలని ప్రయత్నించనూ లేదు. అయినా 'వదిన' అనే మాటకు రామాయణంలో లక్ష్మ

ణుడు సీతకు ఎంత గౌరవంఇచ్చాడో అంతగౌరవం ఇచ్చాడు. అందుచేత వదినమీద కూడా ఏవిధమైన నేరాన్ని మోపలేకపోయాడు. ఏ ఒక్క నిర్ణయానికీ రాలేక చివరకు యిలా అన్నాడు: "అమ్మా! జరిగిందేదో జరిగిపోయింది. అన్నయ్య ఈ మారు గాని ఇంటికి వస్తే ఆయన్ను ఏమీ అనకండి. నాన్నతో కూడా ఈ మాట చెప్పు."—

"ఎవరంమాత్రం ఎందుకంటాం నాయనా? వాడేం పరాయివాడా? మా హృదయంలోని భాగం కాడా?" అంది తల్లి గద్గదస్వరంతో.

"ఆఁ, నేనూ అదే అంటున్నాను. ఆయన్ను మీరు పల్లెత్తుమాటైనా అన్నారంటే ఇక నన్నుకూడా మాట్లేరు. నేనూ వెళ్ళిపోతాను." అన్నాడు. ఈ మాటల్లో అదోవిధమైన అధికారంతో కూడిన ధ్వని వ్యక్తమైంది. అందుక్కారణం ఇన్నాళ్ళూ అమ్మ నాన్నలకు అన్నపైనికంటే తనమీద వాత్సల్యం మెండు అని భ్రమించడమే. భానుమూర్తి పలికిన ఈ మాటల్లో మరోధ్వనికూడా వుంది. 'ఇంతవరకు మీరే ఏవో మాటలని ఆయన్ను వెళ్ళిపోయేట్లు చేశారు.' అనేది ఆధ్వని. అన్నపైని పాతుకుపోయిన అధికతరమైన విశ్వాసం అమ్మ నాన్నలను ఈ మాత్రం నేరస్థులుగా చేసేందుకు ఒడబరచిందతణ్ణి.

కాని, తల్లి ఇచ్చిన సమాధానం వినగానే అతనికి విద్యుద్ఘాతం తగిలినట్లయింది. "వెళ్ళిపో, ఇప్పుడు పోయినవాణ్ణి ఏంచేయగలిగాం; నీవుపోతే ఏంచేస్తాం? మారాతి ఇంతే వుందనుకుని అఘోరించుకుంటాం."— ఇది తల్లి సమాధానం. నిశ్చలమైన కంఠంతో అంది. దీనివల్ల వాళ్ళమనస్సు ఎంత గాయపడ్డదో అతనికి స్ఫురించింది.

భానుమూర్తి సాయంత్రం బస్సుకే వెళ్ళిపోవడానికి సిద్ధపడ్డాడు. ఎవరూ మరోరోజు వుండమన లేదు. తండ్రి అందాకా వెంటవచ్చాడు. బస్సులో ఎక్కాక ఒకేఒక మాటచెప్పాడు.

"భానూ! ఎవరేం చెప్పినా నువ్వే విషయాలని ఏమీ మనస్సుకు పట్టించుకోకు, జాగ్రత్తగా చదువుకో"— ఈ మాట చెప్పి ఆయన భారంగా అడుగులు వేసుకుంటూ వెళ్ళిపోయాడు ఇంటి మొగమై. తండ్రి మాటల్లో, "ఇలాంటి కలహాలు ఎల్లకాలం వుండేవి కావు, ఎన్నటికైనా ఒకనాడు పరిష్కరింపబడుతాయి అనే అభిప్రాయం ఇమిడివుంది. అది తత్కాలానికి భానుమూర్తికి అవగాహనం కాలేదు.

బస్తీకి వెళ్ళే సరికి అన్నగారక్కడ లేరు. ఇంటి వాళ్ళకు గది తాళం చెవి యిచ్చి వూరికి వెళ్తానని చెప్పి వెళ్ళాడట. భానుమూర్తి మొదట భయపడ్డాడు. కాని వదినగారి ఊరికి వెళ్ళి ఉంటాడని ఊహించి అక్కడికి వెళ్ళాడు. అనుకున్నట్లుగానే అక్కడ అన్నగారు ఉన్నారు. ఇంటిదగ్గర అమ్మ నాన్నలు ఎవరినీ ఏమీ అనే స్థితిలో లేరని చెప్పాడు.

"మళ్ళీ ఇంటికి వెళ్ళడానికి ఏమీ మనస్సొప్పడం లేదు భానూ!" అన్నాడు అన్న.

"అదేం పరాయివాళ్ళ ఇల్లా? నీ యింటికి నువ్వు వెళ్ళడంలో నామోషీ ఏమిటి? వెళ్ళిన్నా. వెళ్ళలేక పోతే నన్నూ నీ వెంట తీసుకొనివెళ్ళు."

తమ్ముడికి తన పట్ల ఉన్న ఆదరాభిమానాలకీ, భక్తివిశ్వాసాలకీ చలించి పోయాడు అన్న. వాడి వేడుకోలుకు ఒక్కమాట కూడా వ్యతిరేకంగా చెప్ప లేదు. "సరే, తమ్ముడూ! వెడతాను. నిన్ను తలచుకుంటూ ఆ ఇంట్లో ఉంటాను. నువ్వెళ్ళి బాగా చదువుకో." అన్నాడు.

*　　　*　　　*

చలికాలపు సెలవుల్లో ఇంటికి వెళ్ళాడు భానుమూర్తి. అన్నయ్య ఇంటి దగ్గర లేడు. 'పెళ్ళాం ఊరికి వెళ్ళిఉంటాడు' అని చెప్పారు అమ్మ నాన్నలు. ఈ మధ్య పొలంపనులు మొత్తం పూర్తిగా మాని వేశాడనీ, వేళకువచ్చి ఇంట్లో భోంచేసి పోతుంటాడనీ వారాని కోసారి ఊరు వదిలి పోతుంటాడనీ తెలిసింది. నాన్న మాత్రం అన్నయ్యనూ, వదిననూ గురించిచాలా నెష్టిగా మాట్లాడాడు. "ఆ దుకుకముండ మాటల్లోపడి వాడు పూర్తిగా మారిపోయాడు. మీ అమ్మని "ఏమే, అన్నదాక నోరు విప్పడే! ఛీ-వాడూ ఒక మనిషేనా? ఇప్పుడు పంటలన్నీ నూర్పులు చేసే సమయం. ఇలాంటప్పుడు ఇంటిపట్టున ఉండక అటూ ఇటూ ఇష్టం వచ్చిన రీతిగా తిరిగితే ఎల్లాగు? ఈ వయస్సులో చేలుతిరిగి కాపలకాసే తాహతు నాకులేదు, జీత గాళ్ళను నమ్ముకుంటే ఇంతవరకే కాలవసినంత నష్టం వచ్చింది. పోనీ, ఎంతనష్టపడినా పరవాలేదు. భానూ! నువ్వు మాత్రం వాడి సాంగత్యంలో పడకు. వాడి

పంక్తిలో భోజనం కూడా చెయ్యరు." అన్నాడు ఆవేశంలోకివచ్చి.

భానుమూర్తి మౌనంగా అన్నీ విన్నాడు. తండ్రి వదినను 'దుముకముండ' అని సంబోధించడమే కాక, "దాన్ని మాదిగ లముగా" అనే వరకు వచ్చాడు. అన్నయ్యతో తనకు పంక్తి భోజనం కూడా నిషేధించిన తండ్రి మీద ఏదో అనిర్వచనీయమైన ఇది, కలిగింది. ఇవన్నీ ఒక తండ్రి మాట్లాడాల్సిన మాటలేనా? అనుకున్నాడు. అన్నా వదినా ఆయన అనేమాటలు వినలేకపోయాడు.

ఇంట్లో ఉంటానికి మనస్సు ఒప్పుకోలేదు. ఒంటినిండా ముళ్ళూ, సూదులూ గుచ్చుకుంటున్నట్లుగా అనుభవించాడు. పరీక్ష చదువు మిషపెట్టి బస్తీకి వెడదామనుకుంటూండగానే అన్నయ్య వచ్చాడు.

తండ్రి ఉక్రోశంలో భానుమూర్తిని పెద్దవాని పంక్తిలో కూర్చోవద్దన్నాడేగాని, వాళ్ళిద్దరూ కలసి భోంచేస్తుంటే మాని కూడా ఏమీ అనలేదు. అన్నా తమ్ముడూ ఖులాసాగా ఆ మాటా ఈ మాటా ఆడుకుంటున్నారు.

"మన శ్రీనివాసులు భార్య ఎందుకు బావిలోపడి చచ్చిపోయిందో తెలుసా భానూ?" అనడిగాడు మాట మీద మాటవచ్చి.

"తెలీదు."—అంటూ తల అడ్డంగా ఊపాడు.

"వాడి తండ్రి దాన్ని గింజులాడాట్ట."— అన్నాడు.

"ఈ మాట నేనూ విన్నాను. కాని దానిమీద-నాకేమీ నమ్మకం కుదర్లేదు. ఎంతైనా తండ్రి."— అన్నాడు మార్దవమైన ధ్వనితో.

"నిజమే ఐఉంటుంది. లేకపోతే ఈ వయస్సులో ఆయన ఉంపుడుకత్తెతో కులకడమేమిటి?"- ఒక నిదర్శనం చూపించాడు.

ఇలాంటి సంగతులు అన్నదమ్ము లెప్పుడూ మాట్లాడుకోలేదు. ఐతే ఈసారి ఒకరు చెబుతూంటే ఒకరు వినకుండా ఉండలేకపోయారు.

ఈ సంభాషణకి ఏదో మూలం ఉంటుందని భానుమూర్తి ఊహించుకున్నాడు. అతని మెదడులో వదినా తండ్రీ మెదిలారు. తండ్రిని శంకించడం వైతరణిలో దూకినట్లుగా ఐంది. 'ఛీ! తప్పు' అనుకుని మనస్సులో పశ్చాత్తాపం పొందాడు.

"ఈ ఇంట్లో ఉండడం రోజు రోజు దుర్భరంగా ఉంది భానూ!"—విషయం మార్చాడు అన్న. భానుమూర్తి శూన్యంగా అన్నని చూశాడు. అతనే చెబుతూపోయాడు. "అత్తమ్మవాళ్ళు (భార్య పుట్టింటివాళ్లు) మూడు నాల్గువేలరొక్కం ఇవ్వడమే కాక వాళ్ళ వ్యాపారంలో వాటా ఇస్తారట. రోజూ అమ్మా నాన్నలు ఇంటికి వచ్చిన వాళ్లితోటల్లా మీ వదిన్నా నన్నూ అనే మాటలు విన్లేకండా ఉన్నాను. వీళ్ళ మనస్సులకు కొంచెం అనుతాపం కలిగేదాకా వాళ్ళ వ్యాపారం చూస్తుండటం మంచిదని తోస్తూంది."

భానుమూర్తికి ఇదంతా వింటూంటే అమ్మా నాన్నలు అన్నావదినలపై ఏదో సాధిస్తున్నట్లుగానే తోచింది. 'ఛీ, కనుకున్న సంతానంపై సాధింపులేమిటి? పుట్టిన్నాడే పీక నులిమివుంటే ఎంత బావుండేది' అనుకున్నాడు. 'ఇక్కడే తలిదండ్రుల వాత్సల్యం పట్ల శంకకు అంకురారోపణ జరిగింది. ఐనా, కొంచెం సంఘగౌరవ దృష్టిలో అన్నకు నచ్చజెప్పాడు. "ఈ ఊహ బాగానేఉంది. కాని స్వంతఇల్లు విడిచిపెట్టి ఎక్కడో ఉండడం మనకూ గౌరవప్రదంకాదు; అమ్మ నాన్నలకూ, ఇంకా కొన్నాళ్ళు జరిగితే నీళ్ళూ పాలూ తేలిపోతాయి, మనం త్వరపడకూడదు. ఆనాడే ఏదైనా ఒకటి చేద్దాం."

తమ్ముని సలహాకు కష్టంగా అంగీకారం సూచించాడు అన్న.

మర్రోజు బస్తీకి వెళ్ళిపోయాడు భానుమూర్తి.

* * * *

పరీక్షలింకా నెలరోజులున్నాయి. బస్తీలో భానుమూర్తి సంసారసంబంధమైన కలవరాన్ని ఒకవైపున అణచిపెట్టుకుంటూ చదవడానికి ప్రయత్నిస్తున్నాడు. అన్నయ్య ఒకనాడు బస్తీకివచ్చాడు. "వంద చెప్పినా నేనింక ఆ ఇంట్లో ఉండలేను తమ్ముడూ" అన్నాడు.

"మళ్ళీ ఏంజరిగింది?"

"ఏంజరగాలి? వాళ్లు పెద్దపట్టుపట్టారు, మీ వదిన ముఖం ఈ జన్మలో చూడరట. ఏమాట మాట్లాడినా ఇంటి పెత్తనం నువ్వు తీసుకో అని తాళంచెవుల

గుత్తిని నీటికి విసురుతారు. ఎందుకు బాబూ! ఈ నీలాపనిందలు. నేను ఒక్కణ్ణి, దాన్నెటూ తరిమారు కదా., పోతే అందరికీ బావుంటుంది."

భానుమూర్తికి ఏమీ తోచలేదు. క్షణం ఆలోచించి "అన్నా! అలా అనుకోకు. సమర్థత ఉన్నప్పుడు పెత్తనం తండ్రీ కొడుకుల్లో ఎవరు నడిపితే నేం? వాళ్ళకీ వృద్ధాప్యం. కావలసిందింత 'తింటానికి తిండీ, కట్టడానికి గుడ్డా. ఈమాత్రం పడేస్తే హాయిగా 'కృష్ణా! రామా! అనుకుంటూ కూచుంటారు. పెత్తనం మనం నడుపడం శ్రేయస్కరం" అన్నాడు గత్యంతరం లేక.

"లోకు లేమనుకుంటారు? తండ్రి ఉండగా కొడుకులు—" అర్ధోక్తిలో ఆగాడు.

"లోకుల్తో మనకు నిమిత్తం లేదు. మనం సంసారాన్ని అల్లరిపెట్టకపోతేసరి."

"ఈ విధానం నాకు బాగనిపించడం లేదు."

"నాకు మరో ఆలోచన తడ్తోంది. వదిన పుట్టింటివాళ్ళు, వాళ్ళ వ్యాపారంలో వాటాయిచ్చి ఏమేమో చేస్తామని ఒకనాడు అన్నారుకదా, ప్రస్తుతానికి అక్కడుండడం బావుంటుంది. కొన్నాళ్ళకైనా నాన్నగారి మనస్సు మారిపోవచ్చు. అప్పుడు వాళ్ళ ఆస్తి వాళ్ళకిచ్చేసి మన ఇంటికి మనం రావచ్చు. అలా కాకపోతే నా పరీక్షలు ముగియడంతోనే ఇంటి పెత్తనం మనమే తీసుకొని నడిపిద్దాం."

అన్నయ్య ఈ సూచనను ఆధారంగా తీసుకొని భార్య పుట్టింటికి వెళ్ళివచ్చాడు. వాళ్లు, ప్రస్తుతం చేతిలో డబ్బేమీ లేదన్నట్లూ, వ్యాపారంలో వాటాలన్నీ విక్రయించినట్లూ చెప్పారట. ప్రయత్నించేసి ఇంతలో కొంత డబ్బు సర్దుతామనీ, స్వంత వ్యాపారం, చిన్నదొకటి, చెయ్యమనీ సలహా యిచ్చారట. వాళ్లు చెప్పినమాటల్ని బట్టి ఆత్మీయులుగా కన్పడే వాళ్లను ఎంతవరకు నమ్మవచ్చునో అర్థమైంది భానుమూర్తికి.

* * * *

పరీక్షాకేంద్రం జిల్లాకేంద్రంలో నియమించబడటం మూలాన్ని భానుమూర్తి అక్కడికి వెళ్ళాడు. పరీక్షలయి తిరిగిరాగానే అన్నగారు బావిలోపడి ఆత్మహత్య చేసుకున్నాడని విన్నాడు. శవాన్ని దహనం చేయకుండా తనకోసమే ఆపారని తెలిసింది. ఈ దుర్ఘటన అతని జీవితాన్ని తల్లక్రిందులు చేసింది.

ఈ వార్త వినడంతోనే భానుమూర్తి పిచ్చివాడైపోయాడు. అంతటి దుఃఖం తన జన్మలో ఎప్పుడూ పొందిఉండడు. శవం దగ్గరికి పరుగెత్తి తలబాదుకొని ఏడ్చాడు. తల్లి శోకమూర్తి అయిపోయింది. వదిన మూర్తిని పట్టుకొని రాగాలు తీసింది. తండ్రి వాడిపోయిన ముఖంతో ఒకచోట కూర్చున్నాడు. ఏడుస్తున్న కొడుకును దగ్గరికి తీసుకొని ఓదార్చడానికి ప్రయత్నించాడు. "ఛూ, పిరికిచావు చచ్చాడు." అన్నాడు గంభీరంగా. ఆయన ముఖంలో ఏభావం ద్యోతకమైందో కొడుకు గ్రహించలేదు.

భానుమూర్తి హృదయంలో ఈమాట వింటూనే రుషావిషార్చులు ప్రజ్వరిల్లినవి. చనిపోయిం తర్వాత కూడా నిందించటం మానలేదే అనుకున్నాడు. పలువురు పలువిధాల అనుకున్నారు, చావును గురించి. చాలామంది నోళ్లలో తలిదండ్రులే కారకులనే మాట వచ్చింది. ఎన్ని నేరాలవసరమో అన్ని నేరాలు మోపారు. భార్య పుట్టింటివాళ్లి దగ్గర్నుంచి కొంత విత్తం వ్యాపారంనిమిత్తం తీసుకున్నాడని, చేసిన వ్యాపారంలో నష్టం రావడంవల్ల సమయానికి దాన్ని చెల్లించలేకపోయాడని తత్కారణంగా వాళ్లు ఆడిన దుర్భాషలే అతణ్ని ఆత్మహత్యకు ప్రేరేపించినాయని అన్నారు ఒకరిద్దరు. భార్య ప్రవర్తనను శంకించి అలా చేసాడని ఎక్కడో విన్పడింది ఒక గుసగుస. భానుమూర్తి అల్ప సంఖ్యాకుల ద్వారా వెలువడిన అభిప్రాయాన్ని అట్టే మనస్సుకు తీసుకోలేదు. తలిదండ్రులపై, వారి వాత్సల్యముపై ఒకనాడు అతనిమనస్సున అంకురించిన హేయభావపు మొలక ఈనాడు మహావృక్షమై అతనిలో అణువణువున ప్రాకిపోయింది. తనకు ప్రియతముడైన అనుజన్ముని మృత్యువుకు కారకులైన వాళ్లిమీద, ముఖ్యంగా తండ్రిమీద, ఏదో సాధించాలని ఒక క్రోధం బలపడింది మనస్సులో.

మృతజీవికి కర్మకాండ జరిపేరోజున పెద్దలంతా గూడి విగత భర్తృకకు ఆస్తిలోని కొంతభాగం కేటాయించారు. చేరిన పెద్దమనుషులు ఆమెను సంబోధించి, "ఏమమ్మా! నీ మరదితో కలిసి వుంటావా, లేక కొంత భాగం రాయాలా?" అని అడిగితే ఆమె అంతటి శోకంలో కూడా "ఎవరిపై మాత్రం ఏం నమ్మకం", అంది. తనకు పూర్వంనుంచీ వదినపై ఏర్పడిన అభిమానాన్ని బట్టి చూస్తే ఆమాట మరోకరిలో అయితే

ప్రళయం తెచ్చివుండును. కాని భానుమూర్తి చాలా తేలిగ్గా పోనిచ్చాడు. "అవును నన్ను నమ్మవలసిన అవసర మేమిటి?" అనుకున్నాడు. చట్ట ప్రకారం ఆమె పేర అర్ధభాగాన్ని వ్రాశారు కాని ఆస్తి యావత్తూ ఆమె కిచ్చి వుండినా అభ్యంతరం తెలిపివుండేవాడు కాడు.

వదిన పుట్టింటికి వెళ్ళిపోయింది. భానుమూర్తి భ్రాతృవియోగ విషాద సాగరంలో మునిగి మూగనోము ప్రారంభించాడు. ఇంట్లో అమ్మా నాన్నలతో కూడా మాట్లాడడం మానివేశాడు. ఇది చూసి లోకులంతా అతనికీ అన్నకూ వున్న అకలంకమైన, అవ్యాజమైన ప్రేమని కీర్తించారు. దాంతోపాటు అతని మరణానికి తలి దండ్రులు కారకులనే తను వాళ్లతో మాట్లాడడం లేదని చెప్పుకున్నారు. తన ప్రవర్తన విషయమై లోకుల గుసగుసలు విన్న తలిదండ్రులు దిక్కు తెలియక దుఃఖిస్తుంటే, 'హుఁ అంతా నటన' అనుకున్నాడు. వాళ్లు ఎంత బాధపడితే, ఎంత నిందితులైతే అంత తృప్తిని పొందాడు.

ఉన్న కొడుకును ఒక్కణ్ణి కళ్ల ఎదుటి నుంచి దూరంగా వుంచలేమని ఘోషిస్తున్నా, శిక్షించి, పరీక్షా ఫలితాలు వెలువడడంతోనే పై చదువుకని నగరము ప్రయాణమై వెళ్ళాడు. తను లేకపోవడంవల్ల వాళ్లెలాంటి బాధ పొందుతారో చూడాలని భానుమూర్తి ఉద్దేశ్యం. కన్నకొడుకు మరణానికి కారకులైన వాళ్ళకు హీనమైన బ్రతుకు సంప్రాప్తిస్తుందని అతనిలో ఒక నమ్మకం పాదుకుపోయింది. ఆ హైన్యం, ఎటువంటిదో స్వంతకళ్ళతో చూస్తే కాని అతనిలో వున్న ప్రతీకార వాంఛ తీరదు. అప్పుడే అతని హృదయానికి శాంతి.

నగరంనుంచి ఎప్పుడైనా వుత్తరం వ్రాస్తే దానిలో డబ్బు పంపమని తప్పితే మరొకటి వుండేదికాదు. తండ్రికి వుత్తరాలు రాయడం తెలియదు. కాని వున్న ఒకడూ దూరాన వుండడంవల్ల ఎట్లో అలవరచుకున్నాడు. భానుమూర్తి వుత్తరాలకు రోజూ ఎదురు చూసేవాడు. కాని చాలా అరుదుగా వుత్తరం వచ్చేది.

అప్పుడప్పుడు నగరం వచ్చిన ఊరివాళ్లు భానుమూర్తితో, తండ్రి చాలా కష్టపడుతున్నాడనీ, ఆ ముసలివాళ్ల బ్రతుకు జాలికరంగా ఉందనీ చెప్పారు. మూర్తి కించిత్తయినా సానుభూతి చూపలేదు. ఎందరు ఎన్ని విధాల, తండ్రిపడే అవస్థను, తెలిపినా తండ్రి నుంచి వచ్చే వుత్తరాల్లో మాత్రం ఎప్పుడూ అలాంటి బాధను చూడలేక పోయాడు. అందులో మొదటినుంచీ చివరిదాకా 'మేం క్షేమంగా వున్నాం' అనే మాటే ధ్వనిస్తూ వుండేది.

ఒకమారు భానుమూర్తి సెలవుల్లో ఇంటకివచ్చినప్పుడు తండ్రికి ఎదలో నొప్పి ప్రారంభమైంది. ఆయన స్థితి చూస్తున్నా భానుమూర్తి చలించలేదు. కొడుకు ఎదుటికి రావడంతోనే తండ్రి, తనకున్న బాధను ఆవంతైనా వ్యక్తం చేసేవాడు కాదు. మామూలుగానే మాట్లాడేవాడు. ఆయన ప్రవర్తనను అర్థం చేసికోలేక భానుమూర్తి వుక్కిరి బిక్కిరి అయ్యేవాడు. ఒకనాడు ఆయన గుండెనొప్పి గరిష్ఠ స్థితికి వచ్చింది. అందరూ బస్తీ హాస్పిటలుకు తీసికెళ్లమని సలహా ఇచ్చే సరికి తప్పలేదు. తండ్రి ఒప్పుకోలేదు. అయినా బలవంతాన తీసికెళ్ళాడు. అక్కడ తండ్రికి అప్రయత్నంగా శుశ్రూష చేశాడు. అశ్రద్ధా మిళితమైన పరిచర్యలు చేయడంలో అతని వుద్దేశ్యం వేరు. ఆయన పడిన బాధలకు తన హృదయం ఇంకా పూర్తిగా తృప్తిపడలేదు. ఇంకా కొన్నాళ్లు కష్టపడేట్టు చూడాలి. ఇప్పుడే చనిపోతే బావుండదు—ఇదీ అతని ఉద్దేశ్యం...తండ్రికి నెమ్మదించింది.

భానుమూర్తి ఇంటరు పరీక్షలనుంచి ఇంటికి వచ్చేసరికి తండ్రి చనిపోయాడని తెలిసింది. ఇదివరకటి గుండె నొప్పే మళ్ళీ ప్రారంభమై పదిరోజులదాకా బాధించిందని చెప్పేరు. అయితే తన కెవరూ తెలియపరచక పోవడంలో అర్థమేమిటో అవగాహన కాలేదతనికి. రక్తసంబంధమైన దుఃఖం అతనిలో ఏమూలన్నా ఏకొంచెం కలిగిందో లేదో కాని, తండ్రి ఎలా అవస్థపడ్డాడో చూడ్లేకపోయానని మాత్రం శోకించాడు ఏకధారగా. మిత్రులూ, అమ్మా, వూరివాళ్ళూ అందరూ సంజాయిషీ చెప్పుకున్నారు. "తనిక బ్రతికడనీ, తనసంగతి నీకు తెలియపరచడం మూలాన్ని నీవు పరీక్షలు వదిలిరావడం తప్పితే జరగబోయే మేలేమీ లేదనీ, మీ నాన్నగారు తెలుపనిచ్చారు కాదు" అన్నారు.

గొప్ప ఆశాభంగం కలిగింది మూర్తికి. తను పగతుర చేతుల్లోపడి ముక్కలు ముక్కలుగా ఖండింపబడినా ఇంతటి బాధ, అవమానం పొందివుండేవాడు

కాదు. తండ్రి మరణం తను ఎదుట లేనప్పుడు సంభవించిందికదా అనే దుఃఖం, ప్రతీకారవాంఛ తీర్చుకోలేక పోయిన విచారం అతనిలో పరవళ్లు త్రొక్కింది.

ఒక రెండుసంవత్సరాలు గడిచాయి. ఆలోగా వదిన రావడమూ, కొన్నాళ్లువుండి మళ్ళీ పుట్టింటికి వెళ్ళడమూ జరిగినై. ఉన్న రెండువూడు మాసాలైనా ఆమె ఇంట్లో అపరిచితలాగే వుంది. భానుమూర్తితో తప్పితే తన కితరులతో సంబంధం లేనట్లుగా నే చరించింది. అతనితోవున్న, ఏర్పడిన చనువును పురస్కరించుకొని తల్లికీ అతనికీమధ్య భిన్నాభిప్రాయాలు కల్పించడానికి ప్రయత్నించింది. ఇది మొదట మొదట భానుమూర్తికి అర్థము కాకపోయినా కాలక్రమేణా అవగాహనైంది. ఆమె ఉన్నట్టుండి ఒకనాడు పుట్టింటికి వెళ్ళిపోయింది. తిరిగి రాలేదు. ఈమధ్యకాలంలో భానుమూర్తి హృదయం కావలసినంతగా పరివర్తనం చెందింది. తను ఎంతటి అపచారం చేశాడో తలచుకుంటే గుండె చిద్రుపలైపోయేది...

*　　*　　*



వేసవి, పైరు ఏమీ లేకపోయినా భానుమూర్తి ఎటూతోచక పొలంలోకి వెళ్ళాడు. పొలం మధ్యన ఒక ఎత్తయిన శిలవుంది. దానిమీద నిలుచుంటే పొలం నాలుగువైపులా కలియ చూడవచ్చు. తండ్రి బ్రతికి ఉండగా ఆయన ఎల్లప్పుడూ ఆ శిలమీద కూచుని అప్పుడప్పుడు లేచి చేనువైపు చూస్తుండేవాడు. భానుమూర్తి నేరుగా వెళ్ళి దానిమీద కూర్చున్నాడు. అక్కడ కూర్చుంటే అతనిలో తండ్రికి సంబంధించిన గతస్మృతులన్నీ ఒక్కొక్కటే కదలి కరిగిపోసాగినై. కనుకొలకుల్లో నీళ్లు సుళ్లుతిరిగి చెంపలమీదుగా చారలు కట్టినై. అతనలా ఎంతసేపు కూర్చున్నాడో తెలియదు. కొంత తడవగాక తన వెనుకవైపునుంచి వీస్తున్న గాలి రొదలో ఏదో గానం అవ్యక్తంగా వినరాసాగింది. అది రానురాను కొంచెం పెద్దదైంది.

"పత్తే పత్తేమే పర్వర్ద్ గార్ హైం, హైం, హైం
పత్తే పత్తేమే పర్వర్ద్ గార్ హైం, హైం, హైం"--

పాట తనకు చిరపరిచితమైందే. కంఠస్వరం కూడా...ఆ పాటను, ఆ గొంతుకను పోల్చుకుందామని ప్రయత్నిస్తుండగానే గాలి కొంచెం తగ్గింది. పాట కూడా ఆగిపోయింది. ఆ స్థితిలో పోల్చుకోవడం అతనికి సాధ్యపడలేదు. వెనక్కి తిరిగి చూశాడు. ఎవరూ కన్పడలేదు. వేడి నిట్టూర్పు విడుస్తూ అక్కడే కూర్చున్నాడు.

గాలి ప్రవాహం ఎప్పటికిమల్లే మారింది. ఈమారు అదే గాలిరొదలో మరోపాట అల్లాగా

"రామా! విడువను నిన్ను—ఓ
రామయ్యా! విడువను నిన్ను"—

అనేగీ కొట్టుకు రాసాగింది.

ఈ పాట విన్పడడంతోనే చప్పున జ్ఞాపకం వచ్చింది, అంతకుముందు పాటకూడా ఎవరు పాడేవారో. రెండూ తన తండ్రి కంఠంలో ఎప్పుడూ మ్రోగుతూ వుండేవి. రెంటిలో ఏదీ ఆయనకు సరిగా వచ్చేదికాదు. అయినా ఆ వచ్చినమటుకే అతి సంతోషంగా కూనిరాగంతో పాడుకునేవాడు. ఒక పాట ముగియగానే మరోపాట మొదలెట్టేవాడు. తండ్రికి భగవంతునిపట్ల భక్తి విశ్వాసాలు అధికం. అనంతమైన ఆ భక్తి విశ్వాసాల అండచూసుకునే ఒక్కొసారి దయారాశియైన, ఇక్ష్వాకువంశ పాథోరాశిరాకా చంద్రుడైన శ్రీరాముణ్ణి—

"కుడిపాద మొకచేత- నీ ఎడమపాద మొకచేత
విడువక నిను నే వినుతిజేసెదను
తడయక నను నీ దయతో నేలిన నేలుము"—

అని వినయంగా ప్రార్థించేవాడు.

మరొక్కప్పుడు—

"ఒట్టు బెట్టెదను మాకు- నిను వదలగ నివ్వను నేను
పామరుడను బహు పాపకర్ముడను
తామసమున నిను నే తిన్నిన దన్నెద—"

అని జడిపించేవాడు. కోప్పడేవాడు. ఈ విధమైన దివ్యగుణాలు ఆయనలో లీనమై వున్నవి.

భానుమూర్తి పాటవినవచ్చిన వైపుకు దృష్టిని సారించాడు లేచి. అశ్రుపూరితాలైన చక్షువులకి దూరంగా ఏదో పొగమబ్బులాంటి ఆకారం కనపడింది. అది కదిలి క్రమంగా తనదగ్గరికి వచ్చేసింది. భానుమూర్తి ఆశ్చర్యపడ్డాడు: తలపాగా, చేతిలో లాఠీ, నోటిలో చుట్టా అంతా నాన్నగారి ఆకారమే.

"నాన్నా!" అని ఒక గావుకేక వేసి పడిపోయాడు ఏడుస్తూ, సగంస్పృహ, సగంనిస్పృహలో వున్న మూర్తి చెవులకు మృదువైన. గంభీరమైన, బాధామిళితమైన కంఠంలో చెబుతున్న మాటలు వినిపించినై.

"భానూ, ఎందుకు వూరికే దుఃఖిస్తావు? వున్న ఒక్కడివైనా సుఖంగా వుండకపోతే మా హృదయాలు ఎంతక్షోభిస్తాయో గ్రహించలేవా? నవు చదువుకున్నవాడివి. మమ్మల్ని అర్థంచేసికోవాలనే నిన్ను చదివించాం. కాని నీవు చీకటన్నైపు మొగ్గిపోయావు. మేం కన్పడలేదు... ఏ తలిదండ్రులు తమకొడుకు మరణం వాంఛిస్తారో నాకు తెలియదు. లోకులు మమ్మల్ని ఏ ఆధారంమీద నిందించారో నాకీనాటికీ అర్థం కావటంలేదు. ఒకరి సంసారం చల్లగా సాగుతుంటే చూడలేనిదీలోకం. ఆ రోజుల్లో మీ వదిన కాపురానికి కొత్తగావచ్చింది. అందరూ దానిమీద అర్థరహితమైన సానుభూతి కన్పరిచి నామీద అకారణద్వేషాన్ని సాధించారు. స్వంతకొడుకువు నువ్వే మాపట్ల విరోధభావం వహిస్తే ఇంక నేనెవరితో చెప్పుకోవాలి?... నీలో నాలుకలు సాచిన ప్రతీకారజ్వాల నాకగుపడింది. దాన్ని ఆర్పడానికి నేను మొదట్లో కొంచెం ప్రయత్నించాను, కాని నా ప్రయత్నం వృథా అని తెలుసుకోగానే నా వుద్దేశ్యం మార్చుకున్నాను. నేను అలమటిస్తుంటే నీవు చూడాలనుకున్నావు. కాని నేనందుకు తావివ్వలేదు. ఎంతబాధపడినా లోలోనే పడ్డాను. నా బాధనుచూచి నీవు తృప్తిపడటం నాకూ, నా ఆత్మాభిమానానికీ ఓటమిలా అగుపడింది. కన్నకొడుకుకోరకు ఆత్మాభిమానాన్ని త్యాగంచేయలేకపోయాను. నా ఉద్దేశ్యంలో నేను విజయుణ్ణి అయినానని నాకిప్పుడు సంతోషమేమీ లేదు. నీవు పరాభవింపబడినట్లు బాధపడుతూంటే నా హృదయం చూసి సహించలేకుండా వుంది. మీ అన్న ఆత్మహత్యకి కారణం ఏమైవుంటుందో ఈనాడు నీకవగతమై వుంటుంది. నేను ఆ విషయం ఎక్కువేమీ చెప్పలేను... అయితే ఒకటి చివరిమాట మున్ముందు నీ జీవితంలో ఆత్మాభిమానం చచ్చిపోతుందనే అహంతో నీ సంతానంపట్ల ఎన్నడూ నాలా ప్రవర్తించకు. వాళ్ళకు కష్టం కలిగించకు. నిన్ను సంతృప్తి పరచలేని బాధ నన్ను కలకాలం దహిస్తోంది."—

భానుమూర్తి భూమిమీదినుంచి లేచి చూసేసరికి మొదటి ఆకారంలేదు. పశ్చాత్తప్తమైన హృదయంతో తాను పడివున్న స్థలాన్ని చూశాడు. కన్నీళ్లతో ఆ చోటుమాత్రం కొంచెం తడిసివుంది.

# తంత్రవార్తికము - భీష్ముఁడు

శ్రీ వేలూరి శివరామశాస్త్రి

కుమారిలభట్టు 'శిష్టాకోపే విరుద్ధమితిచేత్, నశాస్త్ర పరిమాణత్వాత్' అనునీ రెండు సూత్రములు బాహ్య సౌగతాదుల ఆచారముల ప్రామాణ్యమును నిరాకరించు ననియు 'అపివా కారణాగ్రహణే ప్రయుక్తాని ప్రతీయేరన్' (1 మీ. ద. 1-3-7) అను నీ సూత్రము 'సదాచారములు ప్రమాణము' అని చెప్పుననియు చెప్పి కొన్ని సదాచారముల నుదాహరించి వానిలో ధర్మసంశయము చూపి త్రివర్గము సిద్ధించుటకు ధర్మావిరోధము నిరూపించెను. ఇతఁడు ఏడవశతాబ్దివాఁడు.

## ధర్మ సంశయము

శిష్టులనబడువారిలో ధర్మవ్యతిక్రమమును,1 సాహసమును2 కానిపించుచున్నవి: ప్రజాపతి తన కొమార్తె ఉష నభిగమించెను. ఇది అగమ్యాగమన రూపమగు అధర్మాచరణము. ఇంద్రుఁడును ఇంద్రపదవిలో నున్న నహుషుఁడును పరదారాభియోగము నొనరించిరి. పుత్రశోకముచే ఆర్తుఁడగు వసిష్ఠుఁడు నీట మునిగి ఆత్మహత్య చేసికొన సాహసించెను, విశ్వామిత్రుఁడు చాండాల యాజన మొనరించెను. వసిష్ఠుని వలెనే పురూరవుఁడు ఆత్మహత్యకు తెగించెను. నైష్ఠిక బ్రహ్మచర్యము గొన్న కృష్ణద్వైపాయనుఁడు విచిత్రవీర్యుని భార్యలందు సంతానోత్పత్తికి సాహసపడెను.

## భీష్ముఁడు

సర్వాశ్రమధర్మములకును వ్యతిరేకముగా ఉండుటయేకాక శ్రీ రామునివలె క్రతువు లొనరించెను3
[తం. వా]

'భీష్ముఁడు బ్రహ్మచర్యాశ్రమమున నున్నట్లు భారతము చెప్పుచున్నదే' అని యనినచో భార్యలేనిదే క్రతువు లొనరించుటకు వీలులేదు. ఇతఁడు రాముని వలెనే క్రతువు లొనరించెనని భారతమే చెప్పుటచే4 నితనికి భార్యకలదని తెలియుచున్నది. అట్లగుచో భార్య యుండియు నితఁడు బ్రహ్మచర్యము చేయుచుండె నని యనవలయును. కావున నితఁడు సర్వాశ్రమ ధర్మములను పాటింపక ప్రవర్తించె నని చెప్పవలసి వచ్చుచున్నది.

పోనిండు, నాతిగల బ్రహ్మచర్యము పనికి రాదా?

రాదు. సన్నిధిలో ఋతుస్నాత యగు భార్య యున్నచో ఉపగమింప కుండుట విహితాతిక్రమము.5 కాఁగా భార్య యుండియు బ్రహ్మచర్య మొనరించుట ధర్మవ్యతిక్రమము. భార్య లేదనిన యెడల భార్యలేకుండ క్రతువు లొనరించుటయు 6 ధర్మవ్యతిక్రమము. కావున భీష్ముఁడును రాముఁడును ధర్మవ్యతిక్రమ మొనరించిరా?

'పితృభక్తికతన భీష్మునకును స్నేహము కతమున రామునకును ధర్మవిరోధము లేదు.' (తం. వా.)

---

1. లోభాదులలో చిక్కుకొని సన్నిహితములగు అనర్థములను జూడక అధర్మ మొనరించుట.

2. అధర్మము కనబడుచున్నను బలదర్పముచే లెక్కగొనక అధర్మ మాచరించుట అని 'భట్ట సోమేశ్వరుని న్యాయసుధ అను తంత్రవార్తిక వ్యాఖ్య.'

3. మిగిలిన సదాచార సంశయములను తన్నివృత్తిని చూడగోరువారు తంత్రవార్తికమును చూచునది.

4. యఏష రోషాత్ ప్రతపన్ బలస్థో
యో నస్సేనాం సింహ ఇవారరక్ష
స ఏష భీష్మః కురువంశకేతు
ర్యే నాహృతా స్త్రిశతం వాజిమేధాః

5. ఋతుస్నాతాంతు యోభార్యాం సన్నిధౌ నోపగచ్ఛతి తస్యా రజసి తం మాంసం పితర స్తస్య శేరతే.

6. న్యాయసుధ. చూ.

# తంత్రవార్త్తికము - భీష్ముడు

'భీష్ముఁడు దాశరాజుకడ కరిగి తన తండ్రికి సత్యవతి నిమ్మని కోరెను. మహాబలుఁడవగు నీవు రాజ్య మభిలషించి యుండఁగా సత్యవతీ సంతానమునకు రాజ్యము లభింపదు కావున 'ఈయను' అని దాశ రాజనెను.

'నాకు రాజ్యము వలదు. నేను పుడమి నేలను' అని భీష్ముఁడు ప్రతిన యొనరించెను.

'నీవు రాజ్య మభిలషింపకున్నను నీ సంతతిని చూచి సత్యవతీ సంతతి భయపడును గావున సత్యవతీ సంతతికి రాజ్యము దుర్లభము' అని దాశరాజనెను.

'సంతతి కనకుండుటకుఁ గూడ నిశ్చయించితిని ఓ దాశరాజా! ఇది మొదలు నాకు బ్రహ్మచర్యము 7 కాఁగలదు' అని భీష్ముఁడు పితృభక్తిచే బ్రహ్మచర్య మవ లంబించెను. 8

'భీష్మునకును రామునకును ధర్మమాత్రమునకు దారలు కలరు'. (తం. వా.)

వీరిరువురకును భార్య లున్నారని యే పురాణ మును జెప్పలేదే? ఉన్నారని నీ వటులు చెప్పఁగలవు?

భీష్ముఁడు పెక్కులు అశ్వమేధము లొనరించి నటులు భారతమును, రాముఁడు పలుజన్నము లొనరించినటులు రామాయణమును 9 చెప్పుచున్నవి కావున వీరిరువురకును, 'కేవల యజ్ఞార్థ పత్నీ సంబంధము కలదు'ని ఏ పురాణమేని చెప్పకున్నను, అర్థాపత్తి ప్రమాణముచే గమ్యమాన మగుచున్నది. 'ఎప్పుడు ఇది తండ్రి చేయి యని తెలిసినను శాస్త్రార్థాతిక్రమమునకు జంకి ఆ చేతిలో పిండము నుంపక దర్భలమీదనే యుంచెనో అట్టి భీష్ముడు 10 భార్య లేని యేకాకి యజించునా? (తం. వా.)

'సరియ భార్య యుండియే భీష్ముఁడు యజించె నందము. మఱి ఋతుకాలాగమన ప్రత్యవాయము రాదా? అనినచో నితఁడు పూనిన బ్రహ్మచర్య వ్రతము నైమిత్తికము. దీనిచే నిత్యమగు ఋతుకాల గమనమునకు బాధ. దాన ధర్మమాత్రార్థమే నేను పెండ్లాడగలనని చెప్పి పెండ్లాడిన భార్య నుపగమింప కున్నను దోసఁగులేదు.

'శ్రీరాములవారును సీతమీఁది స్నేహముచే రెండొక భార్య నుపగమింపనని వ్రతము గొని ధర్మ మాత్రార్థ మొక భార్యనట్లే పెట్టుకొనిరి. దాన రామునకు యాగసిద్ధి.'

ఇటులనుచో—

'యజ్ఞే యజ్ఞే ప్రకురుతే సీతాం పత్నీం హిరణ్మయీమ్' అని చేసిన ప్రతియజ్ఞమునందును బంగారు సీతనేల చేయించిపెట్టుకొనెనని యందురా, లోకాపవాద భీతిచే విడిచిన సీతయెడల నిష్ఠురత్వము లేదని తెలుపుటకే. సీతమీది స్నేహముకతన భార్యాంతరా గమన వ్రతముగొనుటచేత రామునకును ధర్మ వ్యతిక్రమము లేదు.' 11

భీష్మునకు సంతానము లేదుకదా! ఇతనికి పితృఋణాపాకరణ మెట్లు? 'భీష్మునకు' వ్యవహితాపత్యకృతమైన పిత్రానృణ్యము కలదు. 'సోదరులలో ఒకఁడు పుత్రవంతుఁ డగునేని ఆ పుత్రునిచేతనే మిగిలినవారందఱును పుత్రవంతులు'ని మనువు చెప్పెగాన 12 విచిత్రవీర్యక్షేత్రజాలగు పుత్రులచేతనే పుత్రవంతుడై భీష్ముడు పితృఋణమునుండి విముక్తి బడయగలడు. (పితృభక్తిచే పితృఋణవిముక్తి యని నాగేశుడు) రాముడో కుశలవులచే సాక్షాత్ పుత్ర

7. అపత్యహేతో రపిచ కరోమ్యేత ద్వినిశ్చయమ్ అద్యప్రభృతి మే దాశ బ్రహ్మచర్యం భవిష్యతి.

8. చూ. న్యాయసుధ-

9. యజ్ఞే యజ్ఞే ప్రకురుతే సీతాంపత్నీం హిరణ్మయీమ్.

10. సీ. అనఘ మాతండ్రి శంతనుఁడు లోకాంతరం
బున కేఁగినను నేను వినయ మొప్ప
నౌర్ధ్వదైహికమునయందుఁ బ్రశస్తమై
నెసఁగు పిండముదగనిడఁ దొడంగఁ
గంకణకేయూరకమనీయమును నరు
ణాంగుళీదళయును నైనహస్త
ముర్వి భేదించి సముత్థితం బగుటయుఁ
గని యన్న రేంద్రుని కరముగాఁగ
నిశ్చయించి యధిక నిపుణంబుగా విచా
రించి శాస్త్రనియమ రీతి యొకటి
యాదరించి భువిఁ గుశాస్తరణంబు సే
సితిని శాస్త్రవిధిఁ బ్రసిద్ధ బుద్ధి.
హరి-పూ-౨-అ.

11. చూ. న్యాయసుధ—

వంతుడు కావున తద్విషయమున ఏమియు చెప్పనే పనిలేదు.' [తం. వా.]

తంత్రవార్తికము చెప్పిన 'రామునకును భీష్మునకును ధర్మమాత్రార్థదారలు కలర'ను నభిప్రాయమును వ్యాఖ్యాత భట్టసోమేశ్వరుడు భీష్మవిషయమున భారతమునందలి— 'అపత్యహోత్రః—' (సంతతి బడయకుండుటకు గూడ నిశ్చయించితిని)— 'అద్య ప్రభృతి—' (ఇది మొదలు నాకు బ్రహ్మచర్యము కాగలదు) అను విశేషణముల సామర్థ్యముచే 13 బలపఱచెను.

పద్మపురాణము భీష్ముడాజన్మబ్రహ్మచారి యనియు అబాల్యబ్రహ్మచారి యనియు చెప్పుటయు అందఱును భీష్మునకు తర్పణము విడుచుటయు అర్ఘ్యము నెత్తుటయు కుమారిలు డెఱుగడా?

ఈ ప్రశ్న ఇంకొక ఎదురు ప్రశ్న నాకాంక్షించును! అది యిది: భారతవాక్యములకు రెండింటికి [అపత్యహోత్రః, అద్య ప్రభృతి] వ్యాఖ్యాత చెప్పిన అర్థము కుమారిలునకు సమ్మతమా అసమ్మతమా? సమ్మతమగుచో దాసనిముందు ప్రతిజ్ఞచేయుటకు మునుక ధర్మమాత్రార్థపత్ని అక్కఱలేదు! కావున ప్రతిజ్ఞ చేసిన నాటికి ముందె భీష్ముడు గృహస్థు అని అనవలెను! అపుడు పద్మపురాణము బాధకము కదు! అటుచో అది ప్రక్షిప్తమని అందురా? అసమ్మతమగుచో యోగసిద్ధికి ప్రతిజ్ఞ తర్వాత నెప్పుడో జరిగిన ధర్మమాత్రార్థ వివాహముచే ఆజన్మ బ్రహ్మచర్యమున కిసుమంతియు హాని లేదుగాన పద్మపురాణము బాధకము కాదు. కావున కుమారిలుడు పద్మపురాణమునందలి భీష్ముని ఆజన్మ బ్రహ్మచర్యము నెఱుగుననవచ్చును. కాని '—అద్య ప్రభృతి—' (ఇది మొదలు బ్రహ్మచర్యము కాగలదు) అనునది వ్యాఖ్యాత భట్టసోమేశ్వరునిపై పడగయెత్తును. ఏలనగా సోమేశ్వరుడీ 'అద్య ప్రభృతి' లోనుండి భీష్ముని భార్యను జూచుచున్నాడు. అట్టి వానికి పద్మపురాణము బాధకము. ప్రతిజ్ఞకు పూర్వమే గార్హస్థ్యములో నున్న భీష్ముడాజన్మబ్రహ్మచారి యెటులు కాగలుగును? హా! పద్మపురాణమునందలి శ్లోకములు రెండును ప్రక్షిప్తములా!

భీష్మాష్టమి భీష్మపంచకవ్రతము మొదలగువానిని చెప్పిన శాస్త్రము ధర్మసింధువు మొదలగు గ్రంథములనుబట్టి వీనిని ప్రక్షిప్తములని త్రోసిపుచ్చుట దుష్కరము. మఱియు భరతఖండమునకే పితామహుడును ఏకైక ప్రతినిధియు మహాయోగేశ్వరుడు నగు నీ భీష్మునకు భరతఖండము భరతఖండమె యెన్ని శతాబ్దులుగా తర్పణ మర్పించుచున్నదో యెవ రెఱుగనిది? అది యటుండె.

భీష్మునకు యోగసిద్ధికై పత్నికలదను నభిప్రాయము విద్యారణ్యుల శిష్యుడు కాదని లోగడ 'మంజూష—భీష్ముడు' అను వ్యాసమున చూచియుంటిమి. వారి మతమున భీష్ముడవివాహితుడు. శ్రీ రాముడు సన్నిహిత పత్నీకుడు.

నైమిత్తికముచే నిత్యమునకు బాధ చెప్పిన తంత్రవార్తిక వ్యాఖ్యాత భట్టసోమేశ్వరుని భట్ట నాగేశుడు శోధించెనని అర్థపత్తిచే అనుక్తమును గూడమున నూహింపవచ్చును.

'అద్య ప్రభృతి' అనుదానికి ఇతడు చెప్పిన అర్థమును గూడ నాగేశభట్టు కాదనెననియు నూహింపవచ్చును.

ఇక పత్ని లేకుండ యోగసిద్ధికి నాగేశుడు 'అపత్నికోఽగ్నిహోత్రమాహరేత్ న్నాహరేత్? ఆహరేదిత్యాహుః' అను బహ్వృచ బ్రాహ్మణమును జూపెను. ఈ బ్రాహ్మణము కుమారిలునకు తెలియదా? తెలిసియుండుట పాడిగాదు. ఈ శ్రుతికి సంకుచితార్థమీతనికి అభిమతము కావలయును. కాని దాని నితరం ముట్టక యోగసిద్ధికి అర్థాపత్తి ప్రమాణము నాతిగా గొని—'అపి వా కారణాగ్రహణే ప్రయుక్తాని ప్రతీయేరన్' అను సూత్రమును సదాచారాత్మతుష్టి యెడ ప్రామాణ్యపరముగా యోజించి రామభీష్ములను గూడ ఈ పద్దులో జేర్చెను. రామభీష్ముల ప్రక్క

---

12. భ్రాతృణామేకజాతానామేకశ్చేత్ పుత్రవాన్ భవేత్ సర్వే తేనైవ పుత్రేణ పుత్రిణో మనురబ్రవీత్.'

13. 'కేవల యజ్ఞార్థపత్నీ సంబంధ ఆసీ దిత్యర్థాపత్త్యానుక్తమపి గమ్యతే' [తం. వా.] 'ననుతయో ర్ధర్మమాత్రార్థ దారసద్భావః క్వచి దపి పురాణేతిహాసయో రనుక్తః కేన ప్రమాణేనావగమ్యేత్యత ఆహ—కేవలేతి— అపిశబ్దే నాపత్యహేతో రద్య ప్రభృతీతిచ విశేషణసామర్థ్యా దస్యైవ మవగమ్యత ఇతి సూచితమ్'— న్యాయసుధ.

# తంత్రవార్తికము - భీష్ముడు

పెద్దలేని ఆ యిల్లాండ్రకు 'తగుదుమమ్మా' యని కూర్చుండుట కెన్నిగుండె లుండెనోకదా[14]. విద్యా కణ్వుల కిది అనిష్టమని 'మంజూష-భీష్ముడు' అను వ్యాసమున కనియుంటిమి. కుమారిలుని మతమున కణ్వ విభాండకాదులకును ఒకొక యిల్లాలి నంటగట్టవలెను. నాగేశుడు కణ్వునకు భార్య నంటగట్టుచో శాకుంతలము శాస్త్రవిరుద్ధత్వదోషదుష్ట మగుననెనుగాని యీమె ఉశక్కి యిల్లాలుగదా! ఆ ఉశక్కి యిల్లాలి కూతు, కాదుగదా శకుంతల! ఈ ధర్మమాత్ర దారచే అతని శాశ్వత బ్రహ్మచర్యస్థితికి ఢోకా లేదే!

ఇక నొకటి—'అపత్నీకో ఒప్యగ్ని మాహరేత్' అనునది సామాన్యశ్రుతియే యగునెడల అపత్నీకునకును యజ్ఞము విధి విహితమే యగుచున్నది. కావున ఇదానీంతనులు చేయరాదని వివేచనమేల?

అట్టి యాచారము పోయినది. ఊర్ధ్వరేతస్కత మొదలగు గుణములు కలవారే దాని కధికారులు.' అని నాగేశుడు.

'తల్లివంక తమ్ముడగు విచిత్రవీర్యుని పుత్రవంతు నొనరించిన కృష్ణద్వైపాయనునకు ధర్మవిరోధము[15] తొల్లి చేసిన తపోబలము కలిమిని, ఎల్లి, చేయబోవు తపముకతమునను సమకూరల దనియు, మఱియు అట్టి తపోబలము కలవాడెవడేని ఇట్టి పనిని చేయనే చేయు ననియు కుమారిలు డనెను. కాని పత్ని లేక యాగసిద్ధికి భీష్మునిలో తపోబలమేని అతనికి కనబడలేదు. కనబడకున్నమానె, వాసుదేవాదులకు గూడ విస్మయము కలిగించునది భీష్మదేవుని యోగబలము—'

'ధారయామాస చాత్మానం
ధారణాసు యథాక్రమమ్,
తస్యోర్ధ్వమగమన్ ప్రాణా
స్సన్నిరుద్ధా మహాత్మనః.

* * *

యద్యన్ముంచతి గాత్రం హి స శంతనుసుత స్తదా
తత్తద్విశల్యం భవతి యోగయుక్తస్య తస్య వై
క్షణేన ప్రేక్షతాం తేషాం విశల్యస్సోఽభవ త్తదా[16].
[భీష్మస్వర్గారోహణపర్వ]

అని భారతము.

'ఇప్పటివారి కది అశక్యము' అని నాగేశభట్టు. శక్యమగుచో చేయవచ్చునా?

జగద్గురువగు శ్రీ రామకృష్ణపరమహంస, కృష్ణద్వైపాయనుడును భీష్ముడును చేసిన పనులవంటి పనుల చేయకున్నను శ్రీ శారదామాతతో వసించెను. వారిది భక్తియోగమని కొందఱు సమర్థింతురుగాని శ్రీ తోతాపురియే దీనికి తగిన సమాధానము[17] చెప్పెను. 'అట్టి తపోబలము కలవాడెవడేని... చేయనే చేయు'నని కుమారిలు డనెను. మరి నాగేశభట్టు జంకి—'ఊర్ధ్వరేతస్కత మొదలగు గుణములుకల తొల్లిటివారికే అట్టి అధికారము' (అపత్నీకునకు యజ్ఞమునందు) 'అని అనెను.

---

14. 'సతాం హి సందేహపదేషు ...' అను కాళిదాసు నుదహరించిన కుమారిలుకు రఘువంశము నందలి—'సీతాం హిత్వా దశముఖరిపుర్నోపయేమే యదన్యాం తస్యా ఏవ ప్రతికృతి సఖో యత్క్రతూనాజహార...' (౧౪-౮౭) అను శ్లోకమును మఱచి 'స్వర్ణసీతను ప్రక్కను పెట్టుకొని యాగము చేయుట ఆనృశంస్యమును ప్రకటించుటకే' యని చెప్పెను.

15. నియోగము వాగ్దత్తావిషయము, అంబికాంబాలికలు విచిత్రవీర్యునిచే పరిణీతలు, దాసి భ్రాతృజాయ కాదు, బ్రహ్మచారికి సంప్రయోగము నిషిద్ధము. (న్యాయసుధ-చూ.)

16. 'ధారణానుక్రమంబున సమాహితాత్ముండయి వాయువుల సన్నిరుద్ధంబు చేసినవి యూర్ధ్వగతిం గైకొనియె నమ్మహాత్ముం డవయవంబులం బ్రాణంబులు వాసికొనుచు వచ్చునయ్యై చోట్లు శల్యరహితంబులగుచుండె నట్లగుటం గాంచి కృష్ణాదులగు నఖిలజనంబులు నాశ్చర్యభరితాంతఃకరణులగుచు గీర్తించిరి'
అను—౫-౪౬౭.

17. స్వామి శారదానందుల శ్రీరామకృష్ణలీలాప్రసంగ—౨- సం. జన్మభూమి సందర్శన. ౩౪౭ పుట, చూ.

# దైవోపహతులు

## శ్రీ కొండముది శ్రీరామచంద్రమూర్తి

జారిపోతున్న సాంధ్యకిరణాల్లో, ఆరుబయట మండువాలో కూచుని వామనగాయలాడుకుంటున్న వాళ్ళుముగ్గురూ—అల్లంతదూరంలో వీధి చివరగా, వెండిపొన్ను చేతికర్ర విలాసంగా త్రిప్పుకుంటూ, గాలికి మందమందంగా కదులుతున్న పట్టు కండువాను హుందాగా సవరించుకుంటూ, వస్తున్న శ్రీరాములుగారిని చూడగానే, ఒక్కసారిగా కళవళపడి, గాభరాగా చింతపిక్కలను కొంగుల్లో దాచేసుకుని, హడావుడిగా లేచినుంచుని, జరీపరికిణీలను కొంచెంగా మోకాళ్ళమీదకు ఎత్తిపట్టుకుని, ప్రక్కలకు పారిపోయారు బెదురుకళ్ళ లేడిపిల్లల్లాగా.

వినిపిస్తూ వినిపిస్తూవున్న నవ్వులు హఠాత్తుగా ఆగిపోవడంతో, వసారాలో వోమూలగా కూచుని 'రామకోటి' రాసుకుంటూనే గతాన్ని తల్చుకుంటూ కునికిపాట్లు పడుతున్న జానికమ్మ ఒక్కసారి తల యెత్తి మండువాలోకి చూచి, అక్కడ ఆడుకుంటున్న ఆముగ్గురు ఆడపిల్లలూ కనిపించక పోవడంతో దిగ్భ్రమ పడి, శ్రీరామపుస్తకాన్ని కళ్ళకద్దుకుని భద్రంగా అవతలపెట్టి, కళ్ళజోడు తీయకుండానే, బయటికి వచ్చి చుట్టుప్రక్కల వెరిపారజూచింది.

ఆయింటికి కొద్దిదూరంలోవున్న శివాలయానికి కొంచెం ఆవలగా. నీరువుండీ-లేకా ఎండిపోబోతున్న కోనేట్లోకి పడిపోవడానికి సిద్ధంగావున్నాడు ఎఱ్ఱగావున్న సూర్యుడు. పాటిదిబ్బమీదనుంచి, ఎద్దుల నదిలిస్తూ, గడ్డిమోపులను ఓ భుజం మీదినుంచి ఇంకో భుజంమీదకు మార్చుకుంటూ, మధ్యమధ్యలో ప్రక్కనున్న సహభాగినులతో ముసిముసిగా నవ్వుకుంటూ సరదాగా నడుస్తూ వస్తున్నారు ఓ యిద్దరు పాలేళ్ళు.

ఆ ప్రక్కగా నంబివారి ఆడబడుచు ఒకామె, మోయలేక మోయలేక నీటిబిందె నొకదాన్ని చంక నెత్తుకుని, భారంగా అడుగులు వేస్తూ ఇంటివేపు నడిచి వెళ్ళిపోతున్నది.

ఇంటిని సమీపిస్తూ సమీపిస్తూవున్న శ్రీరాములు గారు ఆపడుచును అలానిల్చునే, ఒక్కక్షణంసేపు చూచి గోముగా తలపంకించి ఇంటిని సమీపించారు.

తమ్ముడిరాకను చూచిన జానికమ్మ ఆలాగే కొద్దిసేపు అక్కడ నిల్చుని, హృదయంలోని బాధను కళ్లలో కనిపించకుండా చేయాలని వ్యర్థప్రయత్నం చేసి, ఓడిపోయి, తన్మూత్రలంగా తల ప్రక్కకు తిప్పుకుని ఒక్కనిట్టూర్పు విడిచి, మౌనంగా ఇంట్లోకి వెళ్ళిపోయింది. ఎదురుగ్గా వచ్చిన పిల్లి పిల్లను ఆప్యాయంగా దగ్గరకు తీసుకుని లోపలకు వచ్చిన శ్రీరాములు—వసారాదాటి వంటింట్లోకి వెళుతున్న అక్కగారిని చూసి, పలుకరించబోయి, కాని - పలుకరించలేక, యాంత్రికంగా, హాల్లోవున్న మంచ మొకదాన్ని లాక్కుని కూచుని, స్థిమితంగా విశ్రాంతిపుచ్చుకుంటూ చుట్టముట్టించారు.

ఉంగరాలుంగరాలుగా సుళ్లు తిరుగుతున్న పొగ, మసక చీకటిలో కరిగిపోతూ వింతవింత అందాలు సమకూర్చుకుంటున్నది. ఆ మేఘశకలాల మధ్యగా గోడకు వ్రేలాడుతున్న మేనకా, విశ్వామిత్రుడూ చూచాయగా కనిపిస్తున్నారు.

నిజమే! ఆమెను మెల్లిగా సందిట పొదువుకుని, విశ్వనాథవారి అరుంధతిలా, తెలియని తన్మయత్వంతో మూర్ధాన్నాఘ్రాణించి, బాహ్యన్నవలోకింప చేయ

---

* ఆంధ్ర విశ్వకళాపరిషత్ ఆంధ్రభాషాసమితి నిర్వహించిన కథానికల పోటీలో(1956-57) ప్రథమ బహుమతినందిన కథ.

గలిగే సరికి ఎదురుగా ఈ మేనకా, ఈ విశ్వామిత్రుడే, ఇదేగదిలో, ఆనాడూ కన్పించారు.

కానీ అప్పటికీ, ఇప్పటికీ ఎంత భేదం!

బాల్యాన్ని వదిలి అప్పుడప్పుడే యౌవనాన్ని తొడుక్కుంటున్న వయసు...కనుపించీ, కనుపించకుండా వున్న వక్షస్థలం...అగరువత్తుల ధూపాలు! ...మల్లెపూల మాలలు!

కిటికీకి దగ్గరగా, తెల్లగా నవ్వుతున్న చంద్రుణ్ని చూస్తూ, వెన్నెట్లో కరిగిపోతున్నట్లుగా నిల్చున్నది లక్ష్మి. వెనగ్గా వచ్చి ఆమెచేతులను తనకు దగ్గరగా, తన హృదయానికి దగ్గరగా తీసుకున్నాడు. కానీ— బలంగా దగ్గరకు తీసుకోవడంలో పగిలిన ఆ రెండు గాజులూ...అపశకునమని బెదిరి లక్ష్మి దూరంగా తొలగి నిల్చున్నప్పుడు, తను నవ్వి, మళ్ళా ఆమెను గాఢంగా దగ్గరకు తీసుకున్నాడు. కానీ ఇప్పుడు తెలుస్తున్నది!

తను పిలిచాడు...కట్టుకున్న చీరలాగా వదలని సిగ్గు ఆమెను బాధించింది. ఆమె వంటినిండా పన్నీరు. ఆమె తలలో విరజాజులు.

తన లక్ష్మికి ఆ దృశ్యం—పులకు చూపులతో, వేదిక ప్రక్కకు లేచిపోతూ, మునిశ్రేష్ఠుణ్ణి నివారిస్తున్న మేనకను—చూపించాడు. 'ఇస్సీ' అనుకుంటూ అలవోకగా కన్నులరమూతలుగా వాల్చింది.

దూరంగా వున్న చంద్రుడెక్కడికో, మబ్బుల ప్రక్కకు, ఎందుకో, తొందర తొందరగా తప్పుకుంటున్నాడు, గదిబయట అంతవరకూ వినిపించిన గాజుల గలగలలూ, కోమలాల కింకిణీ స్వనాలూ వినిపించడం ఆగిపోయాయి. గది బయటగా, మెడా మెడా పెనవేసుకుంటూ, అన్యోన్యం పొగుడుకుంటూ గున్న మామిడిచెట్టుమీద కూర్చున్న పావురాల జత వొకటి లీలగా కన్పిస్తున్నది.

ఆ పావురాల జతి కువకువలలో, ఆ వలపుల వెల్లువలో, ఆ మల్లెపూల వాసనలో, ఆ ప్రకృతి సౌందర్యంలో, అప్పుడు తనూ లక్ష్మి వొకరిలో వొకరు ఐక్యమైనారు—తాత్కాలికమని తెలీక.

అక్కడ: అప్పుడు:

పైశాచిక శక్తులూ, పారమార్థిక చింతనలూ, కలగాపులగంగా కలిసిపోయినవి. కృత్రిమ సభ్యత దూరంగా తొలగిపోయింది. ఈ దేహానికి సంబంధించిన నరాలు ఆమెను తనదగ్గరకు రప్పించి తనను ఆమెకు బానిసను చేసి, పీల్చి పిప్పి చేసినవి.

అంతరాత్మ మరణించింది. దేహం నియంతలా నాట్యం చేసింది. ఈ కంఠంలోని ఆనందాన్ని ఆమె కంఠంలో నింపుకున్నది.

చివరకు—

ఏ కలతా లేని మనసుతో ప్రశాంతంగా, హాయిగా నిద్రపోయింది.

*   *   *   *

ఇది జరిగి సరిగ్గా ఇప్పటికి ఎనిమిది సంవత్సరాలు. జీవితంలో ఎల్లకాలం వసంతమే తొంగి చూస్తుందని భావించుకుంటూనే. తనకు తెలియకుండానే, శిశిరాన్ని కూడా ఆహ్వానించాడు. ఆ తరువాత, ఎన్ని ఆటంకాలు, ఎన్ని వికృత పరిణామాలు జరిగిపోయినవి?

ఆలోచనలకు అంతరాయం కల్గించి, ఆరిపోయిన చుటను చివరిసారిగా పీల్చి అవతల పారేస్తూ లేచి కూచుని, కండువాను బుజంమీదకు వేసుకున్న శ్రీరాములు, వంటింట్లోనుంచి, జానికమ్మ దీపం పట్టుకురావడం చూచి, అప్రయత్నంగానే, గోడ మీదకు, మేనకా—విశ్వామిత్రుల పటం మీదకు దృష్టి నిగుడించాడు.

ఇంకా మేనక విశ్వామిత్రుణ్ణి తిరస్కరిస్తూనే వున్నది.

విశ్వామిత్రుడు ప్రాధేయపడుతూనేవున్నాడు.
కానీ తనసంగతి?

అంతా వ్యతిరేకం!

తనలక్ష్మి తనను అనేకసార్లు రహస్యంగా ప్రాధేయపడింది. కన్నీరు కార్చింది. చివరకు తనను ఎల్లా చక్కదిద్దాలో తెలీక, తోచక, లాలించింది. ప్రేమలో పొరలాడించింది. కానీ తన అనుమానం సంగతి ఎవరికి చెప్పగలడు? నలుగురికీ చెప్పదగిన విషయములు కావు!

హాలులో వ్రేలాడుతూవున్న ఇనుపతీగకు లాంతరుతగిలించి, ఆ వెలుగునీడల్లో, కళాకాంతులు లేని తమ్ముడి వదనాన్ని చూచి జాలిపడి పలుకరించబోయి, మళ్ళా ఏంమాట్లాడాలో విషయంతెలీక, గృహకార్యం నిమిత్తం వంటయింట్లోకి వెళ్ళిపోయింది జానికమ్మ.

గాలికి కొద్దిగా కదులుతున్న లాంతరు, నీడలను కని పెంచి పెద్దవాటినిచేస్తూ వాటిమానాన వాటిని వదిలివేస్తున్నది. శ్రీరాములుగారి కాళ్లమీద లాంతరు వెలుగులు పడి, కట్టుకున్న బెంగాలీ గ్లాస్కో పంచె మరింత తెల్లగా కన్పిస్తున్నది. కానీ—మొహంమీద వున్న చీకటి తెఱలలాగానే అతని హృదయంకూడా నల్లని మచ్చలమూలంగా కలుషితమై, కలగుండుపడి పోతున్నది. దారి తెలియడంలేదు...ఎక్కడికి తన బ్రతుకు తనను ఈడ్చుకుపోతున్నదో తనకే తెలీడంలేదు. జీవితానికి అర్థం ఇంతేనేమో!

లేచినుంచుని మళ్ళీ యథాలాపంగా గోడమీదకు చూశాడు. ఈసారి విశ్వామిత్రుడి పటం నీడల్లో మునిగిపోయి, ఆ ప్రక్కనేవున్న సీతాదేవి, నవ్వుతూ మంటల్లోనుండి బయటకు వస్తున్నది. భర్తచేత అనుమానింపబడిన స్త్రీకి ఇదేనేమో పరీక్ష!

తను, తనలక్ష్మికిగూడా ఇదపరీక్ష పెడితే? దైహికంగా కలుషితమైపోయిన ఆమె కనీసం మానసికంగానైనా పరిశుద్ధురాలవుతుందేమో!

దొడ్లోవున్న కొబ్బరిచెట్ల మధ్యగావున్న చంద్రుడు, ఆనాటి తారను జ్ఞప్తికి తెచ్చుకుంటున్నాడు గామోసు! ఎర్రగా, కంది, వున్నాడు.

అవతలివారింట్లోనుండి ఎవరో, తనబిడ్డకు జోలపాట పాడడం లీలగా వినిపిస్తున్నది.

ఆకంఠం ఎంతమార్దవంగా వుంది! ఎన్ని ప్రేమభావాలు ఆకంఠంలో జీరాడుతున్నాయో!

ఆ తల్లిపాట ఎంతో హాయిగా, ఉంది. అంతకన్నా ఎంతో హాయిగా, సంతృప్తిగా, కోటిసౌఖ్యాలనిచ్చేదిగా వున్నది, ఆ పిల్లవాడి ఏడుపు. జీవితం ఆతల్లీ బిడ్డల ప్రేమలోనే ఇమిడివుందేమో!

కళ్లుమూసుకుని, ఆత్మావలోకనం చేసుకొనడానికి యత్నిస్తూ, సప్తమస్థాయీ పంచమస్థాయీ కలిసివున్న ఆ స్వరాలను రెండింటినీ తన హృదయవీణలో పలికించుకోవాలని బాధపడుతూ, కిటికీవద్దకు వచ్చి బయటకుచూస్తూ నిల్చుండిపొయ్యాడు శ్రీరాములు.

ఆనాడూ—

సరిగా తాను ఇలాగేనుంచుని చూశాడు. ఇప్పటికీ తనకు బాగా జ్ఞాపకంవుంది.

ఎక్కడినుండో తీతువుపిట్ట వికృతంగా అరుస్తూ వుండంచూచి, తనకు హఠాత్తుగా మెలుకువవచ్చి, కలలబరువు నిండివున్న ఆ కళ్ళతోనే ప్రక్కకు, లక్ష్మి పడుకున్న ప్రక్కవైపుచూశాడు. కానీ, అక్కడ లక్ష్మిలేదు!

ఇంతరాత్రిపూట, ప్రక్కమీదనున్న రెండు నెలల పసికందునైనా గమనించకుండా ఎక్కడికి వెళ్ళిందో? తనలో ఏదో పాడుభావం—

రాక్షసంగా వెయ్యిగొంతుకలలో అరుస్తున్న ఓ పాడుభావం, మెదలుతున్నది.

'అది' నిజంకాదనీ, తన భ్రమమాత్రమేననీ; సమాధానం చెప్పుకోవడానికి ప్రయత్నంచేసి విసిగి వేసారి—ఇదే కిటికీవద్దకువచ్చి నుంచుని, దొడ్లో ఓమూలగావున్న ఆ మల్లెపొదవైపు అనుకోకుండా చూశాడు.

చూడకుండా వున్నట్లైతే, హాలాహలం కడుపులో వున్న సంగతి తెలీకుండానే, అందరితో నవ్వుతూ మాట్లాడి వుండేవాడేనేమో! కానీ, విధిచేతిలో కీలుబొమ్మలం.

ఏవో నీడలురెండు, ఒకదానిలోఒకటి ఆత్రుతగా కలిసిపోతూ, మల్లెపూలవాసనలను తమలో నింపుకుంటున్నాయి.

ఆసమయంలో తన కెంత కోపంవచ్చింది? కళ్ళు రక్తపూరితాలయినాయేమో ననపించింది.

అంగాంగం వణకిపోయింది. ఏదో తెలియని చైతన్యం, ఆవేశం, కోపం, భూతాల్లాతనను ఆవరించాయి. ఆ పిచ్చిలోనే వెళ్ళి వారిద్దరి గొంతూ పిసికి చంపేదామనుకున్నాడు.

కానీ - యథార్థాన్ని పరికించినమీదట తన కుటుంబం అల్లరికావడం తప్ప ఏముంది? దాని మూలంగా తను సాధించగలిగేది? అప్పటి తనశాంతం ఇప్పటికీ తన కాశ్చర్యం కల్గిస్తున్నది! అట్లా తను ఆలోచిస్తూ పరధ్యానంలో నిల్చుని వుండగానే, వెనకపాటుగా లక్ష్మి రానే వచ్చింది. తను వెనుకకు తిరిగి చూశాడు.

చీర కుచ్చెళ్ళు ఎడమచేత్తో పట్టుకుని, కుడిచేత్తో ముంగురులను సవరించుకుంటూ "ఏమిటండీ-ఆలోచిస్తు

న్నారు" అన్నది ఎంతో సుతిమెత్తనగా. ఇంకొక సమయంలో అయితే తను ఎంతో ఆనందం పడిపోయే వాడు. ఆమె నునుకపోలాల మీద చిన్న చురితాన్నొక దాన్నంటించేవాడు. కానీ, అప్పుడు మాత్రం గంభీరంగా 'ఏమిటే?' అన్నట్లుగా ఆమె వేపు తిరిగి, ఆమె కళ్లల్లో ఏవో అన్వేషిస్తున్నట్లుగా, ఆమె మొహంలో మొహంపెట్టి "ఊఁ!" అంటూ భ్రూయుగ్మాన్ని కుంచించాడు.

దానికే లక్ష్మి ఎంతగానో భయపడ్డది! గభాలున, ఒక అడుగు వెనకకు వేసింది. 'ఏమిటండీ'? అంటూ సన్నగా మూలిగి, రెండు నెలల అపసినుద్దువైపు మాస్తూ దీనంగా నిల్చుండిపోయింది. నిడుదలై, సోగలైన ఆ కాటుక కండ్లు తన నప్పుడు ఆకర్షించలేదు.

మహర్షులు తమ తపస్సును ధారపోసినా మాడ లేని ఆ తనూలావణ్యం తన నప్పుడు ముగ్ధుణ్ని చేయలేదు.

మల్లెపూలకన్న మిన్నయైన ఆమె సౌందర్యం తననప్పుడు కరిగించలేదు.

అంతే! ఒక మాపు, ఒక నిద్ర, ఒక భోజనంగా వున్నవారు రెండుగా విడిపోయారు. రెండు నెలల పసిగుడ్డుతో సహా లక్ష్మికి, వేరుకాపరం ఏర్పాటు చేయించాడు. ఇందులో తన తప్పేముంది? లోకం తన నెందుకు ఆడిపోసుకోవాలి?

ఎందుకు ఆడిపోసుకుంటున్నదో అర్థంగాక, ఆలోచనలతో తనను తనే హింసించుకోలేక, అక్కగారితో వెళ్తున్నాననైనా చెప్పకుండా. విసురుగా బయటికి వచ్చి, విసవిసా నంబివారి ఆడుబడుచు ఇంటి వేపు నడక సాగించాడు శ్రీరాములు.

* * *

బియ్యం కడిగి గిన్నెలో పోసుకుని, ఆపూటకు తమ్ముడిని అక్కడే భోజనం చెయ్యమని చెప్పటానికని హాల్లోకి వచ్చిన జానికమ్మ; శ్రీరాములు అక్కడ లేక పోవడం చూచి. ఆశ్చర్యపడి, వాకిట్లోకి వచ్చింది, అక్కడేమైనా, వున్నాడేమో నని.

"పిండారబోసినట్లున్న ఆ వెన్నెట్లో శివాలయం దాటి, ప్రక్క వీధిలోకి వెళుతున్న ఓవ్యక్తిని చూచి, తమ్ముడేనని నిర్ధారణచేసుకుని, అతని జీవితాన్ని సరిదిద్ద లేని తన పెద్దరికానికి తనకు తానుతిట్టుకుంటూ, గుమ్మానికి చేరగిలబడి, శూన్యంగా పరిసరాలను పరికించింది జానికమ్మ. తన బ్రతుకు సరేసరి! తమ్ముడి బ్రతుకు మాత్రం? నిక్షేపంగా కళకళలాడుతూవున్న భార్యతో కాపురం చేయవలసిన వాడు. బంగారపు బొమ్మలాంటి వాడు. ఏవేవో అనుమానాలు మనసులో పెట్టుకున్నాడు. అవి బయటకు చెప్పడు, ఏమిటో, ఎండిపోతున్న చెట్టులాగా నానాటికీ కృశిస్తున్నాడే కాని, జీవితాన్ని సరిదిద్దుకోవాలన్న ఆలోచనే లేదు.

తమ్ముడిని గూర్చి తలపోస్తున్న సమయంలో ఆమె కళ్ళు అర్ద్రాలయినవి. జన్మాంతర సంస్కారం మూలంగా హృదయంలో ఏర్పడిన సున్నితమైన సంబంధం, ఎక్కడో అకస్మాత్తుగా తేలిపోయినట్లైంది.

నిజమే! పది సంవత్సరాల క్రితంవరకూ తనకూ ఓసంసారం అంటూవున్నది. తనూ పిల్లా-జెల్లా కలిగి ఆనందం అనుభవిస్తాననుకొన్నది. వారిమూలంగా తన జన్మ తరిస్తుందనుకున్నది. కానీ ఆరాత్రి తర్వాత—

ఆ రాత్రి వెల్లా మగ్గిపోవడం?

గులాబీపూలు తలలో ముడుచుకొంటూండగానే సుశీ పన్నీరుజల్లినందువలన రవికఅంతా తడిసిపోయింది. వచ్చేసువాసన విపరీతంగావుంది. ఏమీ తోచక, తలుపు దగ్గరగా తను నిలబడి తలదించుకునే వారి వేపు చూసీ చూడకుండా చూసింది. ఆయన మాట్లాడేభాష మనసులో మెదుల్తున్నది కానీ మాటల్లోరాదు. ఆయన పిలిచారు. తనేమని సమాధానం చెప్పిందో! ఎదురుగా వచ్చి, తనచేతులను వారిచేతుల్లోకి తీసుకుని...ఏమిటో ఆ ఆనందం! కలలు తొలగిపోయినవి. ఆ ఆనందం నిజమైనదని తెలుసు. తనకళ్ళు అరమూతలుగా వాలివున్నవి. వారి నల్లనిజుట్టులో మూసుకుపోతున్న తన కళ్ళను పూర్తిగా తెరిచి, వారి స్వరూపాన్ని తనలో చిత్రించుకోవాలని తన ప్రయత్నం. అనుభూతి, తనకోర్కెలకు సమాధానమైంది. ఆ దివ్యక్షణాలు శాశ్వతంకావాలనుకున్నది. ఆ రాత్రి తెల్లవారకూడదనుకున్నది. ఆ సుఖం దూరమవకూడదనుకున్నది: కలలకు ఇంతటి పరిపూర్ణమైన సహజత్వం చవిచూచాక, అది స్థిరమైపోవాలని ఆశించింది.

కానీ, తనకంత అదృష్టమా?

తను కట్టినచీర ఇంకా మాసిపోనేలేదు. మూడు రోజుల మధుపర్కాలభారం ఇంకా తీర నేలేదు.

పట్టణానికి ప్రయాణంకావడం, ఆప్రయాణంలోనే వారు విషజ్వరంవాతపడి, కన్నుమూయడం, అన్నీ అయిపోయాయి. జీవితం అంటే ఇంతేనేమో!

తనకిక మిగిలింది ఈ తమ్ముడు మాత్రమే. తన నొసటివ్రాత బాగులేక తను బాధపడుతుంటే అమర్చిన సౌఖ్యాన్ని ఆనందించలేక వాడూ బాధపడుతున్నాడు. పిచ్చివాడు.

ఆలోచనల పరధ్యానంలో ప్రకృతాన్ని మఱచి గతాన్ని తలపోస్తున్న జానకమ్మ, ప్రక్కయింటివారి పసిపాప తనవద్దకు పరుగెత్తుకురావడం గమనించనే లేదు.

ఆయాసాన్ని మూటగట్టుకువచ్చిన ఆ పసిపాప, జానకమ్మకు దగ్గరసాగి, ఆమెచేయి పట్టుకులాగి, ఆమెను తనవేపుకు తిప్పుకుని "లక్ష్మిపిన్ని నిన్ను అవసరంగా రమ్మన్నదత్తా" అనిచెప్పి, జవాబుకోసం నిరీక్షించకుండా మళ్లీ దూసుకుపోయింది.

పోతున్న జలజను చూసి, చెప్పినమాటను జ్ఞాపకానికి తెచ్చుకోటానికి ప్రయత్నించి 'అవసరం' అన్న మాటను స్ఫురణకు తెచ్చుకుని, చెంబేలుపడి, తలుపు దగ్గరకు వేయడం మర్చిపోయి, ముందుకు రెండడుగులు వేసి, మళ్ళీ వెనుకకువచ్చి, అన్నితలుపులూ భద్రంగా వేసి, తడబడుతున్న అడుగులతో లక్ష్మిఇంటివేపుగా నడిచింది జానకమ్మ.

దారిలో, ఇంటికి అంతరాత్రిపూట, నీళ్ళకావళ్ళు మోసుకువస్తున్న ఇద్దరుముగ్గురు పల్లెపిల్లలు ఆమెనుచూసి, తమలోతాము నవ్వుకుని, దూరంగా వెళ్ళిపోయ్యారు. కానీ ఆమె వారిని గమనించక తలవొంచుకు నడుస్తూనేవుంది.

దారిలో పడుకున్న ఓనల్లకుక్క, నిలువెత్తురూపమొకటి తనమీద అడుగువేయబోవడం చూచి, భయపడి, దూరంగా తొలగి, మొరగడం ప్రారంభించింది.

అయినా ఈశబ్దాలేమీ జానకమ్మకు విన్పించినట్లు లేదు.

* * *

గుమ్మంలోకి వచ్చిన ఆడబిడ్డనుచూసి, అసహాయత, ఆదరణా కలిసిన స్వరంలో ఎల్లాగో స్వాగతం చెప్పి, నుడ్లనీరు నుడ్లకుక్కుకుంటూనే, ఆమెను తీసుకుని లోపలికి నడిచింది లక్ష్మి. బ్రతకలేక బ్రతుకుతున్న ఆయింటివారిలాగానే నుడ్డిదీపమొకటి ఎగశ్వాస పీల్చుకుంటూ అక్కడ వెలుగుతున్నది. ఆ వెలుగునీడల మధ్య ఓ పసిపిల్లవాడి స్వరం 'నాన్నా' అంటూ కలవరిస్తూ మాట స్ఫుటంగారాక అణగారిపోతున్నది.

ఆపసివాడి వదనంలో కళాకాంతులు లేవు! వాడిన తోటకూరకాడ నయం అతనికన్నా! రాలిపోతున్న నక్షత్రాలకాంతిలాగా అతనికళ్లల్లో మిణుకు మిణుకు మంటున్న తేజస్సు...ఎముకలు బయటికి వచ్చిన ఆ చెక్కిళ్లు...తైలసంస్కారం లేని ఆ జుట్టు...చాలీచాలనందువల్ల చిరిగిపోయిన లాగు. మండుతున్న చితిలాగా వున్న ఆ మాతృహృదయంలోని క్షోభను జానకమ్మ అర్థం చేసుకున్నది. శిలగా వున్న జానకమ్మ హృదయంలోని ఆప్యాయత, కరుణా లక్ష్మికి తెలుసు. జానకమ్మ ఆ పిల్లవాడిదగ్గరకు వెళ్ళింది. అతడి ప్రక్కన కూర్చున్నది. అతని చేతులను తన చేతుల్లోకి తీసుకున్నది. "బాబూ!" అంటూ ప్రేమగా, జాలిగా, అతని కన్నీరును తన కొంగుతో తుడిచింది.

కానీ, ఆపిల్లవాడు జానికమ్మను చూసి గుర్తించ సైనా గుర్తించలేదు. అయోమయంగా పిచ్చిచూపులు చూస్తూ "నాన్నా!" అంటూ అదేపనిగా కలవరిస్తూ, ఈ ప్రపంచపు మనుగడనుండి విముక్తి పొందడానికి ప్రయత్నిస్తున్నాడు.

ఆ పసిపిల్లవాడి హృదయం ఇంతిగా ఎందుకు గాయపడిందో జానికమ్మకు తెలీలేదు. ఆమె నిస్సహాయంగా లక్ష్మి దగ్గరకు వచ్చి "జరిగిందేమిటి తల్లీ?" అని ఆమెను జాలిగాచూస్తూ ప్రశ్నించింది.

లక్ష్మిమాత్రం ఏమని చెప్పగలదు?

ఆ క్రిందటిరాత్రి 'నాన్నా' అంటూ దగ్గరకు చేరిన ఆ పసివాణ్ని, పురుగును విదిలించినట్లుగా విదిలించి, గొడ్డును బాదినట్లుగా బాదిన ఆ తండ్రి మాఢ్యాన్ని ఏమని చెప్పగలదు? తల యెత్తకుండానే, "బెంగపడ్డాడు!" అని మాత్రం జవాబుచెప్పి, తన చేల తనం బయట పడుతుందేమోనని చీరచెంగులో మొహం దాచుకుంది.

జానికమ్మకు తెలుసు లక్ష్మి హృదయం యెంత సున్నితమో!

తగ్గిపోతున్న దీపాన్ని పెద్దది చేయటానికని దగ్గరకు వెళ్ళిన జానికమ్మ, ఆ వెలుగులో పిల్లవాడికి శోష రావటంచూచి, ఆదుర్దాతో "పంచదారసమయినా పిల్లవాడికిచ్చావా?" అంటూ లక్ష్మి దగ్గరకు వచ్చింది.

లక్ష్మి జవాబు చెప్పలేదు. తలయెత్తి మాత్రము చూచింది.

ఆమె కండ్లలో రెండు కన్నీటిబిందువులు.

జానికమ్మ హడావుడిగా వంట యింట్లోకి వెళ్ళింది. ఆమెనుచూసి పొయ్యిలో పడుకుని విశ్రాంతి తీసుకుంటున్న తెల్లపిల్లి ఒకటి దూరంగా తొలగిపోయింది.

జానికమ్మ మౌనంగా మళ్లీ లక్ష్మిదగ్గరకు తిరిగి వచ్చింది. ఏదోచెప్పబోయింది. కానీ స్వప్నకంఠంతో లక్ష్మి మాటాడుతుండడం చూచి అప్రతిహతియై అలాగే నిల్చుండిపోయింది.

"వారం రోజులనుండి ఇంట్లో అన్నీ నిండుకున్నాయి. అయినా ఎలాగో గడిచిపోయింది. ఈరోజు ప్రొద్దున బాబు ద్రాక్షపళ్లు కావాలని ఒకటే గొడవ. ఎక్కడనుంచి తెచ్చిపెట్టను? జీవచ్ఛవాల్లాగా కాలం గడుపుతున్నాం. ఇదీ మా జీవితం."

జానికమ్మకు సమాధానం ఏమనిచెప్పాలో తోచలేదు. ఏదో ఓరడింపుగా మాట్లాడాలని ప్రయత్నిస్తున్న తరుణంలో, మళ్లీ లక్ష్మి అందుకున్నది.

"మీ యింటినుండి తెచ్చుకో లేదేమని నువ్వడగవచ్చు. ఎంతకాలమని ఈలా ఇతరులను ఆశ్రయించి కాలం గడపడం? కట్టుకున్నవారికే బరువైన మా యిద్దరి జీవితం, ఉన్నా—" అర్ధోక్తిలోనే అందుకుంటూ "పిచ్చిదానా! నేను నీకు పరాయిదాన్నా?" అని మాత్రం పలికి "ఉండు ఇప్పుడే వస్తాను" అంటూ బయటకు వెళ్ళబోయింది జానికమ్మ.

బయలుదేరబోతున్న జానికమ్మను చూసి — ప్రాధేయపూర్వకంగా "ఒక్కక్షణం ఇక్కడవుండు జానకీ, నేను వెళ్లి వారిని పిల్చుకువస్తాను" అంటూ లక్ష్మి బయలుదేర బోయింది.

"నువ్వా? నువ్వు!" జానికమ్మ ఆశ్చర్యానికి అంతులేదు.

"అవును. వారెక్కడ వుంటారో, ఉన్నారో నాకు తెలుసు. పసివాడికోసం వారి కాళ్ళమీద పడతాను. నా హృదయంలో చిచ్చు పెట్టవద్దని బ్రతిమలాడుకుంటాను," అంటూ లక్ష్మి, జానికమ్మ నుండి జవాబుకోసమైనా నిరీక్షించకుండా, వెన్నెలపోయి చీకటి క్రమ్ముకుంటున్న ఆ సమయంలో బయటకు అడుగుపెట్టింది.

జానికమ్మకు ఇదంతా అగమ్యంగా వుంది. "ఎందుకని లక్ష్మి ఇంత సాహసం చేస్తున్నది?" ఈ ప్రశ్నకు ఆమెలో సమాధానం లేదు.

అగమ్యంగా, పిచ్చిదానిలాగా ఆమె ఆపిల్లవాడివేపు చూసింది. ఆ పసివాడు మనశ్శోకంలేకుండా పడివున్నాడు.

దీపాన్ని పెద్దది చెయబోయింది. అది మరింతగా మరణాన్ని సమీపిస్తున్నది. ఏం చేయటానికి తోచక, ఆమె గుమ్మంలోకి వచ్చి, బయటకు తొంగిచూచింది. నిర్మానుష్యంగా వున్న వీధిలో, చూరుక్రింద నీడల్లో, కొందరు పిచ్చివాళ్లు, దైవోపహతులు, బైరాగి తత్వములు పాడుకుంటూ వికిలిగా నవ్వుకుంటున్నారు.

# ఛందశ్శాస్త్రము

శ్రీ తటవర్తి సూర్యనారాయణమూర్తి

ఛందస్సు వైదికము లౌకిక మని ద్వివిధములు ఇవియును వర్ణభేదముచేత మఱల ద్వివిధములు మ, య, ర, స, త, జ, భ, నగణములును గురువు, లఘువు—ఇవి ఛందస్సిద్ధికి గారణములు. మూడక్షరముల సముదాయమును గణ మందురు మూడక్షరములును గురువులైయున్న మగణము, ద్వితీయ, తృతీయాక్షరములు గురువులై యున్న యగణము, ఆద్యంతాక్షరములు గురువులై యున్న రగణము ఇట్లే అంతిమాక్షరము గురువై యున్న సగణము, అంతిమాక్షరము లఘువై యున్న తగణము ఆద్యంతాక్షరములు లఘువులైయున్న జగణము, ఆద్యక్షరము గురువై యున్న భగణము, మూడును లఘువులైయున్నచో నగణము.

పరిగణిత మాత్రలలో బూర్తియగు ఛందములను మాత్రికములందురు యథా—ఆర్యా ఛ్ఛందమునకు ప్రథమ తృతీయ పాదములందు ద్వాదశ మాత్రలును ద్వితీయపాదమందు పదునెన్మిది మాత్రలును చతుర్థపాదమందు బదునైదు మాత్రలును గలిగి యుండును. ఈ ఛందమునకు బూర్వార్ధ సదృశమై యుత్తరార్ధముండి యున్నచో నది 'గీతి' ఉత్తరార్ధ సదృశమై పూర్వార్ధముండియున్నచో నది "ఉపగీతి" యనబడును.

ఆర్యాచ్ఛందమున కుదాహరణము—

బృందావనే సలీలం
వల్గుద్రుమకాండ నిహిత తను యష్టిః,
స్మేరముఖార్పిత వేణుః
కృష్ణో యది మనసి కః స్వర్గః.

(ఆ) పరిగణితాక్షర సిద్ధములగు ఛందములను వర్ణికములందురు. యథా—

జయంతి గోవింద ముఖారవిందే
మరంద సాంద్రాసర మందహాసాః,
చిత్తే చిదానంద మయాం తమోఘ్న
మమంద మింద్రద్రవ ముద్గిరంతః.

ఆర్యాది ఛందములలో నాల్గు మాత్రలుగల అయిదు గణము లుండును. సర్వగురు, అంత్యగురు, మధ్యగురు, ఆదిగురు, చతుర్లఘువులు ఈ భేదములకు వరుసగా కర్ణ, కరతల, పయోధర, వసుచరణ, విప్రము లని నామములు.

లఘువులకు బరమున సంయోగము, అనుస్వారములున్నచో నాలఘువు గురువని తలంపబడును రామం, రామః రామస్య. ఈ మూడు శబ్దములలోని 'మ' అక్షరములు గురువులు పాదాంతమున గల లఘువు కూడ వికల్పముచే గురువని తలపబడును. ఛందశ్శాస్త్రములో 'గ' అనగా గురువనియు 'ల' యన లఘువనియు నర్థము పద్యము లేక శ్లోకము యొక్క నాల్గవ భాగమును బాదమందురు విచ్ఛేదము, విరామము యతికి పేర్లు. వృత్తము త్రివిధములు సమ-అర్ధ-విషమములని నాలుగు చరణములందును సమాన లక్షణములుగలది సమవృత్తము ప్రథమ తృతీయములు, ద్వితీయ చతుర్థములు సమానములై యున్నచో నది అర్ధసమ వృత్తము నాల్గు చరణములును బరస్పర భిన్న లక్షణములై యున్నచో నది విషమ వృత్తము. సమవృత్తమున కుదాహరణ.

ముఖే తే తాంబూలం నయనయుగళే కజ్జలకళా
లలాటే కాశ్మీరం విలసతి గళే మౌక్తికలతా
స్ఫురత్కాంచీ శాటీ పృథు కటితటే హాటకమయీ
భజామి త్వాం గౌరీం నగపతి కిశోరీ మవిరతం॥

(ఇది శిఖరిణి యను ఛందము దీని ప్రతిపాదమందును సమానములైన హ్రస్వ దీర్ఘములైన పదునేడేసి యక్షరములు గలవు.)

అర్ధ సమవృత్తమున కుదాహరణ.

త్రిభువన కమనం తమాలవర్ణం
రవికర గౌరవరాంబరం దధానే
విపులకుళావృతానవాబ్జం
విజయసఖే రతిరస్తు మేనవద్యా॥

ఇది పుష్పితాగ్రా యనుఛందము, దీని ప్రథమ తృతీయ చరణములు సమాన లక్షణములతో పంగ్రడించేసి యక్షరములు—రెండు నగణములు 1 రగణము 1యగణముతోనున్నది ద్వితీయ చతుర్ధ చరణములలో ఒకే లక్షణము తోడి పదము చేసి యక్షరములు - 1 నగణము 2 జగణములు 1 రగణము 1 గురువు గలిగియున్నది. అర్ధ సమవృత్తములలో 'పుష్పితాగ్ర' ఇంకను హరిణప్లుతం వైతాళీయ, (వియోగిని) మున్నగు పెక్కు ఛందము లున్నవి వైతాళీయము లేక వియోగినికి ప్రథమ,తృతీయ చరణములలో 2 సగణములు 1 జగణము 1 గురువు నుండును. ద్వితీయ, చతుర్ధ చరణములలో 1 సగణము 1 భగణము 1 రగణము 1 లఘువు 1 గురువునుండును పాదాంతమున విరామము.

ఉదా :—

జగదంబ విచిత్ర మత్రకిం.
పరిపూర్ణా కరుణాస్తి చేన్మయి
అపరాధ పరంపరాపరం
నహి మాతా సముపేక్షతే సుతం॥

'హరిణప్లుత' లో విషమ పాదములలో 3 సగణములు 1 లఘువు 1 గురువును సమపాదములలో 1 నగణము 2 భగణములు 1 రగణము నుండును దీని ద్వితీయ చతుర్ధ చరణములు ద్రుతవిలంబితకు సమానములు.

ఉదా :—

స్ఫుటఫేనచయా హరిణప్లుతా
బలిమనోజ్ఞతటా తరణేః సుతా
కలహంస కులారవ శాలినీ
విహరతో హరతి స్మ హరేర్మనః॥

విషమవృత్తమున కుదాహరణ.

వశినేక్షణం శశిముఖంచ
రుచిరదశనం ఘనచ్ఛవిం
చారుచరణకమలం కమలాంచిత
మావ్రజవ్రజ మహేంద్రనందనం॥

'ఉద్గత'అను నీ ఛందమున నాలుగు చరణములును భిన్న భిన్న లక్షణములుగలవి. ప్రథమపాదమున స జ స ల ములు, ద్వితీయపాదమున న, స, జ, గ ములు తృతీయమున భ న జ ల గ ములు చతుర్థపాదమున స జ స జ గ ములు నుండును.

ఒక్కొక్కక్షరముగల పాదములో ప్రారంభించి యొక్కొక్కక్కక్షరమును పెంచుచు నిఱువదియాఱక్షరముల పాదము పూర్తియగునప్పటికి వేఱు వేఱు ఛందము లగుచున్నవి. ఒకటిమొదలు ఇఱువదియాఱక్షరములు వఱకుగల ఛందముల నామములు. ఉక్త, అత్యుక్త, మధ్య, ప్రతిష్ఠ, సుప్రతిష్ఠ, గాయత్రి, ఉష్ణిక్కు. అనుష్టుపు, బృహతి, పంక్తి, త్రిష్టుపను. జగతి, అతిజగతి. శక్వరి, అతిశక్వరి, అష్టి, అత్యష్టి, ధృతి, విధృతి (అతిధృతి) కృతి, ప్రకృతి, ఆకృతి, వికృతి, సంకృతి, అతికృతి (అభికృతి) ఉత్కృతి. ఇఱువదియాఱక్షరములకంటె పెక్కుడైనచో నవి చండవృష్టి ప్రపాతాది దండకము లగుచున్నవి. మూడు లేదా ఆఱుపాదములుగలది గాథ యగును.

ఇఱువదేడక్షరముల దండకమునకు చండవృష్టి ప్రపాతమని పేరు. ఇందు రెండు నగణములు నేడు రగణములు నుండును. పాదాంతమున విరామము ఉదా:-

ఇహ హి భవతి దండకారణ్యదేశేస్థితిః పుణ్య
భాజాం మునీనాంమనోహారిణే,
త్రిదశ విజయవీర్య దృష్యద్దశగ్రీవ
లక్ష్మీవిరామేణ రామేణ సంసేవితే,
జనకయజనభూమి సంభూతసీమంతినీ సీమ
సీతాపదస్పర్శ పూతాశ్రమే,
భువన నమితపాదపద్మాభిధానాం
బికా తీర్ధయాత్రాగతా నేక సిద్ధాకులే॥

పింగళాచార్యుని మతములో పింగళ సూత్రములలో నుల్లిఖితముగాని ఛందములకు 'గాథ' యని సంజ్ఞ.

ఇక ఉక్తాదులగు నిఱువదియాఱు ఛందము లుదాహరణలతో దెలియజేయ బడుచున్నవి.

(1) ప్రతిపాదమందు నొక్కొక్కక్షరముగల ఛందముపేరుక్త. దీనికి రెండు భేదములుగలవు. మొదటిది గుర్వక్షరములతో నగునది రెండవది లఘ్వక్షరములతో నగునది. గుర్వక్షరములతో నగు ఛందమునకు 'శ్రీ' అనిపేరు.

ఉదా :—విష్ణుం వందే. .

హరి రిహ. ఇది లఘ్వక్షరముల ఛందమున కుదాహరణ.

(2) ప్రతి చరణమందును రెండేసి యక్షరములు గల ఛందముపే 'రత్యుక్త' ప్రస్తారముచే దీనికి నాల్గు భేదములు. ప్రథమభేదము 'స్త్రీ'; రెండు గురువులుగల నాల్గుపాదముల ఛందము 'స్త్రీ'

ఉదా:-అన్య స్త్రీభిః సంగ స్త్యాజ్యః.

(3) మూడక్షరముల ఛందము 'మధ్య' ప్రస్తారముచే దీని కెనిమిది భేదములు గలవు. మూడక్షరములును గురువులుగానున్న మొదటి భేదముపేరు 'నారి'

ఉదా:—సర్వాసాం నారీణాం భర్తాస్యా
దారాధ్యః.

(2) ప్రాణతః ప్రేయసీ రాధికా శ్రీపతేః॥

(2) ఇది మధ్యయొక్క తృతీయభేదము. దీని పేరు 'మృగీ.' ప్రతిపాదమున నొక్కొక్క రగణ ముండును.

(4) నాల్గక్షరములుగల ఛందముపేరు ప్రతిష్ఠ. ప్రస్తారమున దీనికి 16 భేదములు గలవు. ప్రథమభేదము పేరు "కన్య"

ఉదా:—భాస్వత్కన్యా సైకా ధన్యా.
యస్యాః కూలే కృష్ణో ఽ ఖేలత్.॥

(5) 'సుప్రతిష్ఠ' ప్రస్తారమున దీనికి 32 భేదములు గలవు దీని తొమ్మిదవ భేదముపేరు 'పంక్తి' 1 భగణము. 2 గురువులు.

ఉదా:—కృష్ణ సనాథా తర్ణక పంక్తిః
యామున కచ్ఛే చారు చచార"

6. 'గాయత్రి' ప్రస్తారమున దీనికి 64 భేదములు గలవు. దీని మొదటి భేదముపేరు 'విద్యుల్లేఖ' పదమూడవ భేదము 'తనుమధ్య' పదునాఱవది 'శశివదన' ఇరువది తొమ్మిదవ భేదముపేరు 'వసుమతి'

'విద్యుల్లేఖ'—2 మగణములు.

గోగోపీ గోపానాం ప్రేయాంసం ప్రాణేశం
విద్యుల్లేఖావస్త్రం వందేఽహం గోవిందం॥

'తనుమధ్య'—తగణము, యగణము.

ప్రీత్యా ప్రతివేశం నానావిధి ఖేలం
సేవే గత తంద్రం బృందావన చంద్రం॥

'శశివదన'—నగణము, యగణము

పరమ ముదారం విపిన విహారం
భజ ప్రతిపాలం వ్రజపతిబాలం॥

'వసుమతి'—తగణము, సగణము

భక్తార్తికదనం సంసిద్ధి సదనం
నామీందువదనం గోవింద మధునా॥

(7) 'ఉష్ణిక్కు'-ప్రస్తారమున దీనికి 128 భేదములు గలవు. దీని ఇరువదియైదవ భేదముపేరు 'మదలేఖ' ముప్పదవ భేదముపేరు 'కుమారలలిత' మగణ సగణములు నొక గురువుతో 'మదలేఖ'యును జగణ సగణములు నొక గురువుతో 'కుమారలలిత' యును నగును. ప్రథమమున కుదాహరణ

రంగే బాహు విగ్నాన్ దంతీంద్రాన్మదలేఖా
లగ్నాభూన్మదశత్రౌ కస్తూరీ రసచర్చా॥

(8) 'అనుష్టుప్పు'—ప్రస్తారమున దీనికి 256 భేదములుగలవు. దీనిని విద్యున్మాల మాణవకాక్రీడ, చిత్రపద, హంసరుత, ప్రమాణిక, (నగస్వరూపిణి) సమానిక, శ్లోక, వితానాద్యనేక భేద ప్రభేదములు గలవు. శ్లోక ఛ్ఛందమున ప్రతి చరణమందును ఆఱవ యక్షరము గురువు నైదవ యక్షరములఘువునై యుండును. ప్రథమ, తృతీయ చరణములందు సప్తమాక్షరము దీర్ఘముగను ద్వితీయ, చతుర్థ చరణము లందు హ్రస్వముగ నుండును. శేషాక్షరములకు విశేష నియమము లేనందున ఈ ఛందమునకు గూడ చాల అవాంతర భేదములుండును. పై ఛందములలో ప్రథమభేదము. విద్యున్మాల, ఏలనన దానిలోని యన్నియక్షరములును గురువులై యుండును. నాల్గేసి యక్షరముల మీద యతి. ప్రమాణిక (నగస్వరూపిణి) 86వ భేదము. దీనిలో జగణరగణములు నొకలఘువు నొక గురువు నుండును. ప్రమాణిక, సమానికలు గాక మిగిలిన అనుష్టుప్ఛ్ఛేదము లన్నియును వితానమున కంతర్గతములని తలంచ బడుచున్నవి.

విద్యున్మాల—

విద్యున్మాలాలోలాన్ భోగాన్
ముక్త్వా ముక్తౌ యత్నం కుర్యాత్
ధ్యానోత్పన్నం నిస్సామాన్యం
సౌఖ్యం భోక్తుం యద్యాకాంక్షేత్॥

నగస్వరూపిణి—

శివతాండవస్తోత్ర మీ ఛందమునసే వ్రాయబడినది. దాని యొక్కొక్క పాదమున రెండు రెండు

నగస్వరూపిణి ఛందములు వచ్చి యున్నవి. కొందఱా సంయుక్తచ్ఛందమును పంచచామరాది నామములజెప్పుచున్నారు. ఇందు జ, ర, జ, ర, జ గణములుండును.

ఉదా:—జటాకటాహ సంభ్రమ భ్రమన్నిలింప నిర్ఝరీ
విలోల వీచి వల్లరీ విరాజమాన మూర్ధని
ధగద్ధగద్ధగజ్జ్వలల్లలాటపట్ట పావకే
కిశోర చంద్రశేఖరే రతిః ప్రతిక్షణం మమ॥

శ్లోకము—
యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతం
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః॥

8. మాణవకాక్రీడ—
ఆదిగతం తుర్యగతం పంచమకం చాంత్యగతం
స్యాద్గురుచే త్తత్కథితం మాణవకాక్రీడ మిదం॥

(9) 'బృహతి'—ప్రస్తారమున దీనికి 512 భేదములు గలవు. 251 వ భేదము 'హలముఖి' 64 వ భేదము "భుజంగ శిశుభృతము".

హలముఖి—ర, న, సగణములు.
హస్తయోర్మధుర మురళీం ధారయన్నధరశయనే
సన్నివేశే రద మమృతం సంస్పృజ ఞ్జయతి స హరిః॥

భుజంగ శిశుభృతము—2 నగణములు 1 మగణము
ప్రణమత నయనారామం వికచకువలయశ్యామం
అఘహర యమునానీరే భుజగశిరసి నృత్యంతం॥

(10) 'పంక్తి'—ప్రస్తారమున దీనికి 1024 భేదములు గలవు. దీనిలో శుద్ధవిరాట్, పణవ, రుక్మవతి, మయూర సారిణి, మత్తా, మనోరమా, హంసీ, ఉపస్థితా, చంపకమాలాద్యనేకము లవాంతర భేదములు కలవు. శుద్ధ విరాట్టు పంక్తియొక్క 345 వ భేదము. మగణ, సగణ, జగణములు 1 గురువు—

ఉదా:-విశ్వం తిష్ఠతి కుక్షికోటరే
వక్త్రేయస్య సరస్వతీ సదా
సర్వేషాం ప్రపితామహో గురు
ర్బ్రహ్మా శుద్ధ విరాట్ పునాతునః॥

చంపకమాల—భ, మ, సగణములు 1 గురువు. అయిదేసి యక్షరములమీద విరామము.

సౌమ్య గురుస్సాన్య దాద్యచతుర్థం పంచమషష్ఠం
చాంత్య ముపాత్యం
ఇంద్రియబాణై ర్యత్రవిరామః సాకథనీయం
చంపక మాలా॥

దీని యంతిమాక్షరమును తగ్గించినచో 'మణిబంధ' మగును.

(11) 'త్రిష్టుప్'—ప్రస్తారమున దీనికి 2048 భేదములు గలవు. దీనికి అనేకావాంతర భేదములు— ఇంద్రవజ్ర, ఉపేంద్రవజ్ర, ఉపజాతి, దోధక, శాలిని రథోద్ధత; స్వాగతాది నామములతో ప్రసిద్ధమైనవి. ఇవి త్రిష్టుప్పుయొక్క ఏ సంఖ్యా భేదములనునది మూలోక్త పద్ధతిచేతనే యెఱుంగనగును.

(1) 'ఇంద్రవజ్ర'—2 తగణములు 1 జగణము 2 గురువులు.

నిర్మాన మోహా జితసంగదోషా
అధ్యాత్మనిత్యా వినివృత్త కామాః
ద్వంద్వైర్విముక్తా స్సుఖదుఃఖ సంజ్ఞై
ర్గచ్ఛంత్యమూఢాః పద మవ్యయం తత్॥

(2) 'ఉపేంద్ర వజ్ర'—1 జగణము 1 తగణము 1 జగణము 2 గురువులు.

త్వమేవ మాతా చ పితా త్వమేవ
త్వమేవ బంధుశ్చ సఖా త్వమేవ
త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ
త్వమేవ సర్వం మమ దేవదేవ॥

(3) ఇంద్రవజ్ర, ఉపేంద్రవజ్ర ఈ రెండింటి కలయికవలన నేర్పడునది 'ఉపజాతి', ఉపజాతిలో నొకపాద మింద్రవజ్ర యొకపాద ముపేంద్రవజ్ర లక్షణములు గలిగియుండును. ప్రస్తారమున దీనికి 14 భేదములు. ఆ భేదముల నామములు- కీర్తి, వాణి, మాల, శాల, హంసి, మాయ, జాయ, బాల, ఆర్ద్రా భద్ర ప్రేమ, రామ, బుద్ధి, బుద్ధి ఈ క్రింది చక్రమువలన దీని స్వరూప మెఱుంగనగును.

| | | | |
|---|---|---|---|
| 1 | ఇ ఇ ఇ ఇ | శుద్ధ | ఇంద్ర వజ్ర |
| 2 | ఉ ఇ ఇ ఇ | 1 ఉపజాతి | కీర్తి |
| 3 | ఇ ఉ ఇ ఇ | 2 | వాణి |
| 4 | ఉ ఉ ఇ ఇ | 3 | మాల |
| 5 | ఇ ఇ ఉ ఇ | 4 | శాల |
| 6 | ఉ ఇ ఉ ఇ | 5 | హంసి |
| 7 | ఇ ఉ ఉ ఇ | 6 | మాయ |

| | | | |
|---|---|---|---|
| 8 | ఉ ఉ ఉ ఇ | 7 | జాయ |
| 9 | ఇ ఇ ఇ ఉ | 8 | బాల |
| 10 | ఉ ఇ ఇ ఉ | 9 | ఆర్ద్రి |
| 11 | ఇ ఉ ఇ ఉ | 10 | భద్ర |
| 12 | ఉ ఉ ఇ ఉ | 11 | ప్రేమ |
| 13 | ఇ ఇ ఉ ఉ | 12 | రామ |
| 14 | ఉ ఇ ఉ ఉ | 13 | ఋద్ధి |
| 15 | ఇ ఉ ఉ ఉ | 14 | బుద్ధి |
| 16 | ఉ ఉ ఉ ఉ | శుద్ధ | ఉపేంద్రవజ్ర |

ఉదా:—

తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం
ప్రసాదయే త్వా మహమీశమీడ్యం
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియా యార్హసి దేవసోఢుం॥

పూర్వోక్త చక్రమునుబట్టి ఇదిఉపజాతియొక్క బుద్ధి నామక భేదము. దీనినే విపరీతపూర్వ—ఆఖ్యానకి యని కూడ జెప్పుదురు. దీనిలో మొదటి చరణ మింద్ర వజ్ర శేషించిన మూడు నుపేంద్ర వజ్రలు. మొదటి మూడు చరణము లింద్రవజ్ర—నాల్గవది ఉపేంద్ర వజ్ర చరణ మగుచో నది 'బాల' యను నుపజాతి యగును.

ఉదా:—

వంద్య స్సపుంసాం త్రిదశాభి వంద్యః
కారుణ్య పుణ్యోపచయ క్రియాభిః
సంసారసారత్వ ముపైతి యస్య
పరోపకారా భరణం శరీరం॥

(4) దోధక వృత్తము-3 భగణములు 2 గురువులు

దోధక మర్థ విరోధక ముగ్రం
స్త్రీ చపలం యుధి కాతర చిత్తం
స్వార్థపరం మతిహీన మమాత్యం
ముంచతి యో నృపతిస్స సుఖీస్యాత్॥

(5) 'శాలిని'—మ, త, తగణములు 2 గురువులు.

రూపం యత్తత్ ప్రాహు రవ్యక్త మాద్యం
బ్రహ్మజ్యోతి ర్నిర్గుణం నిర్వికారం
సత్తామాత్రం నిర్విశేషం నిరీహం
సత్యం సాక్షా ద్విష్ణు రధ్యాత్మదీపః॥

(6) రథోద్ధత—ర, న, రగణములు। లఘువు। గురువు.

రాఘనామ జపతాం కుతోభయం
సర్వతాపశమనైక భేషజం
పశ్యతాత మమ గాత్రసన్నిధౌ
పావకోఽపి సలిలాయతేఽధునా॥

(7) 'స్వాగత'—ర, న, భగణములు 2 గురువులు

కుందదామ కృత కౌతుక వేషో
గోపగోధనవృతో యమునాయాం
నంద సూను రనఘే తవ వత్సో
నర్మదః ప్రణయినాం విజహార॥

ఇవియేగాక సుముఖి, వాతోర్మి, శ్రీ భ్రమర విలసిత, వృంత, భద్రిక, శ్యేనిక, మౌక్తికమాల, ఉపస్థితాదు లింకను ననేక నామములు గలవు.

(12) 'జగతి'—ప్రస్తారమున దీనికి 4096 భేదములు గలవు. అందులో వంశస్థ, ఇంద్ర వంశ, ద్రుత విలంబిత, తోటక, భుజంగ ప్రయాత, స్రగ్విణి, ప్రమితాక్షర, వైశ్వదేవి మున్నగు ఛందముల ఉదాహరణ లిచ్చుట జూపబడుచున్నవి.

వంశస్థము—జ, త, జ, ర గణములు పాదాంతమున యతి.

సశంఖ చక్రం సకిరీట కుండలం
సపీత వస్త్రం సరసీరుహేక్షణం
సహార వక్షః స్థల కౌస్తుభ శ్రియం
నమామి విష్ణుం శిరసా చతుర్భుజం॥

ఇంద్రవంశము—త, త, జ, రగణములు పాదాంతమున విరామము

యత్కీర్తనం యత్స్మరణం యదీక్షణం
యద్వందనం యచ్ఛ్రవణం య దర్హణం
లోకస్య సద్యో విధునోతి కల్మషం
తస్మై సుభద్రశ్రవసే నమోనమః॥

వంశస్థ—ఇంద్ర వంశముల కలయిక చేత బదునాల్గు భేదముల ఉపజాతియగును పూర్వోక్త చక్రములోని 'ఉ' స్థానమున 'వం' వ్రాసినచో ప్రస్తార చక్రమగును ఈ పదునాలు గుపజాతుల నామములు—వైరాసికి, రతాఖ్యానకి ఇందుమ, పుష్టిద, ఉపమేయ, శేక రామణీయక, సౌరభేయి, శీలాతుర, వాసంతిక, మందహాస, శిశిర, వైధాత్రి, శంఖచూడ, రమణ, కుమారి. వీటి యుదాహరణలు గ్రంథాంతరముల లభింపగలవు. ప్రస్తుత మిట మొదటి యుపజాతి

యొక్క యుదాహరణ మాత్రమే చూపబడుచున్నది. దీని ప్రథమ చరణము వంశస్థము శేషించిన మూడు చరణములును ఇంద్రవంశ లక్షణములు గలవి.

కిరాత హూణాంధ్ర పుళింద పుల్కసా
ఆభీరకంకా యవనాః శకాదయః
యేఽన్యేచ పాపా యదుపాశ్రయాశ్రయాః
శుద్ధ్యంతి తస్మై ప్రభవిష్ణవే నమః

ద్రుతవిలంబితము:— న, భ, భ, రగణములు పాదాంతమునయతి.

విపది ధైర్య మథాభ్యుదయే క్షమా
సదసి వాక్పటుతా యుధి విక్రమః
యశసి చాభిరుచి ర్వ్యసనం శ్రుతౌ
ప్రకృతిసిద్ధ మిదంహి మహాత్మనాం॥

తోటకము:— 4 సగణములు పాదాంతమున యతి.

అధరం మధురం వదనం మధురం
నయనం మధురం హసితం మధురం
హృదయం మధురం గమనం మధురం
మధురాధిపతే రఖిలం మధురం॥

భుజంగప్రయాతము:— 4 యగణములు పాదాంతమున యతి.

అయం త్వత్కథామృష్ట పీయూషనద్యాం
మనోవారణః క్లేశ దావాగ్ని దగ్ధః
తృషార్తోఽవగాఢో న సస్మార దావం
న నిష్క్రామతి బ్రహ్మ సంపన్నవన్నః॥

స్రగ్విణి:— 4 రగణములు

స్వాగతం తే ప్రసీదేశ తుభ్యం నమః
శ్రీనివాస శ్రియా కాంతయా త్రాహినః
త్వామృతే ఽధీశ నాన్యై ర్వృతః శోభతే
శీర్షహీనః కబంధో యథా పూరుషః॥

ప్రమితాక్షర:— స, జ, స, జగణములు పాదాంతమున విరామము.

పరిశుద్ధ వాక్యరచనాతి శయం
పరిషించతీ శ్రవణయోరమృతం
ప్రమితాక్షరాపి విపులార్థవతీ
కవి భారతీ హరతి మే హృదయం॥

వైశ్వదేవి:— 2 మగణములు 2 యగణములును 5-7 వ అక్షరములపై యతి.

అర్చా మన్యేషాం త్వం విహాయామరాణా
మద్వైతే నైకం విష్ణు మభ్యర్చ్య భక్త్యా
తత్రాశేషాత్మ న్యర్చితే భావినీతే
ప్రాప్తాః సంపన్నా ఽఽ రాధనా వైశ్వదేవీ"

పై భేదములేగాక ఇంకను పుట, జలోద్ధతగతి, నత, కుసుమ, విచిత్ర, చంచలాక్షిక, కాంతోత్పీడ, వాహిని, నవమాలిని, చంద్రవర్త్మ, ప్రముదితవదన, ప్రియంవద, మణిమాల, లలిత, మోహితోజ్జ్వల జలధర మాల, ప్రభ, మాలతి అభినవతామరసాది భేదములు తల్లక్షణములును గ్రంథాంతరములయందు లభించు చున్నవి.

(13) 'అతి జగతి, ప్రస్తారమున దీనికి 8192 భేదములు గలవు 'ప్రహర్షిణి' దీని భేదములలో నొకటి.

ప్రహర్షిణి:— మ, న, జ, రగణములు 1 గురువు. 8-10 అక్షరములపై యతి.

జాగర్తి ప్రసభవిపాక సంవిధాత్రీ
శ్రీ విష్ణోర్లలిత కపోల జానదీచేత్
సంకీర్ణంయది భవితా స్తి కో విషాదః
సంవాదః సకల జగత్పితా మహేన॥

ఇంకను క్షమ, అతిరుచిర, మత్తమయూర, గౌరి, మంజుభాషిణి చంద్రికాది భేదములు గ్రంథాంతరముల యందు లభ్యమగుచున్నవి.

(14) 'శక్వరి'—ప్రస్తారమున దీనికి 16 384 భేదములు గలవు. ఇందులోని యొక భేదము—

వసంతతిలక:— త, భ గణములు 2 జగణములు 2 గురువులు పాదాంతమున విరామము. దీని నే కొందరు సింహోన్నత, ఉద్ధర్షిణి యనికూడ జెప్పుదురు.

యా దోహ నేఽవహనే మథనోపలేప
ప్రేంఖేంఖ నార్భరుదితోక్షణ మార్జనాదౌ
గాయంతిచైన మనురక్తధి యోఽశ్రుకంఠ్యో
ధన్యా వ్రజస్త్రియ ఉరుక్రమ చిత్తయానాః॥

ఇంకను అసంబాధ, అపరాజిత, ప్రహరణ కలిత మున్నగు భేదములు గలవు.

ప్రహరణ కలిత:— 2 నగణములు 1 భ, 1 న 1 ల 1 గురువు యేడవ యక్షరములు మీదయతి.

సురముని మనుజై రుపచితచరణాం
రిపుభయచకిత త్రిభువన శరణాం

ప్రణమత మహిషాసురవధ కుపితాం
ప్రహరణ కలితాం పశుపతి దయితాం॥

(15) 'అతిశక్వరి'—ప్రస్తారమున దీనికి 32768 భేదములు గలవు. చంద్రావర్త, మాలినియను భేదము లిట జూపబడుచున్నవి.

చంద్రావర్త—4 న, 1 సగణము 7-8 అక్షరములపై విరామము.

పటుజవన పవనచలిత జలలహరి
తరళిత విహగ నిచయరవ ముఖరం
వికసిత కమల సురభి శుచిసలిలం
ప్రవిశతి హరిరిహ శరది శుభసరః॥

మాలిని:—2 న, 1 మ, 2 యగణములు 7-8 అక్షరములపై యతి

అసితగిరి సమంస్యాత్ కజ్జలం సింధుపాత్రే
సురతరువరశాఖా లేఖనీ పత్రముర్వీ
లిఖతియది గృహీత్వా శారదా సర్వకాలం
తదపి తవగుణానా మీశ పారం నయాతి॥

చంద్రావర్తకం 7-8 అక్షరములపైన విరామము; 6-9 అక్షరములపై విరామమగుచో నది మాలాభంద మగుచున్నది. ఇట్లే 8-7 అక్షరములపై విరామమైనచో నది "మణినికరము."

(16) 'అష్టి'—ప్రస్తారమున దీనికి 65536 భేదములు గలవు. ఇందులో —

వృషభగజ విలసితము:—భ, ర, 3 న, 1 గురువు 7-9 అక్షరములపై యతి.

యో హరి రుచ్ఛ్రితాన ఖరతరనఖశిఖరై
ర్దర్జయ దైత్యసింహ సువికట హృదయతటం
కిం న్విహ చిత్ర మేష యదఖిల మపహృతవాన్
కంసనిదేశ దృప్యదృషభగజ విలసితం॥

వాణిని:—న, జ, భ, జ, ర, గణములు 1 గురువు.

స్ఫురతు మమాననేఽద్య నను వాణి నీతిరమ్యం
తవచరణ ప్రసాద పరిపాకతః కవిత్వం
భవజలరాశి పారకరణ క్షమం ముకుందం
సతత మహాలసన్నై స్స్వరచితై స్తనవాని నిత్యం॥

(17) 'అత్యష్టి'—ప్రస్తారమున దీనికి 131072 భేదములుగలవు. ఇట హరిణి, పృథ్వి, వంశపత్రపతితము, మందాక్రాంత, శిఖరిణి వృత్తము లుదహరించ బడుచున్నవి.

హరిణి:—న, స, మ, ర, సగణములు 1 ల 1 గు 6-4-7 అక్షరములపై యతి.

న సమరస నాః కాలేభ్యో గాచ్ఛలం ఘనయౌవనం
కురుత సుకృతం యావన్నాయం తనుః ప్రవిశీర్యతే
కిమపి కలనా కాలస్యేయం ప్రధావతి సత్వరా
తరుణహరిణీ సంత్రస్తేవ ప్లవ ప్రవిసారిణీ॥

పృథ్వి:—జ, స, జ, స, య, ల, గములు 8.9 అక్షరములపై విరామము.

హతాస్సమితి శత్రవ స్త్రిభువనే ప్రకీర్ణం యశః
కృతశ్చగుణినాం గృహే నిరవధిర్మహోత్సవః
త్వయాకృత పరిగ్రహో రఘుపతేఽద్య సింహాసనే
నితాంత నిరవగ్రహా ఫలవతీవ పృథ్వీకృతా॥

వంశపత్ర పతితము:—భ, ర, న, భ, న, ల, గములు 10.7 అక్షరములపై యతి.

అద్య కురుష్వ కర్మ సుకృతం యదపరదివసే
మిత్ర విధేయ మస్తి భవతః కిము చిరయసి తత్
జీవిత మల్పకాలకలనా లఘుతర తరళం
నశ్యతి వంశపత్ర పతితం హిమసలిలమిదం॥

మందాక్రాంత:—మ, భ, న, త, త, గ, గములు 4-6—7 అక్షరములపై యతి. దీని ప్రతిచరణ మందలి అంతిమ, సప్తాక్షరములను దీసివేసినచో 'హంసీ' చ్ఛందము.

బర్హాపీడం నటవరవపుః కర్ణయోః కర్ణికారం
బిభ్రద్వాసః కనక కపిశం వైజయంతీంచ మాలాం
రంధ్రాన్ వేణోరధరసుధయా పూరయన్ గోప
బృందైః
బృందారణ్యం స్వపదరమణం ప్రావిశద్గీతకీర్తిః॥

శిఖరిణి:—య, మ, న, స, భ, ల, గ ములు 6-11 అక్షరములపై యతి.

మహిమ్నః పారం తే పరమవిదుషో యద్య సదృశీ
స్తుతి ర్బ్రహ్మాదీనా మపి తదవసన్నా స్త్వయి గిరః
అథావాచ్యః సర్వ స్స్వమతి పరిణామావధి గృణన్
మమాప్యేష స్తోత్రే హరినిరపవాదః పరికరః

(18) 'ధృతి' ప్రస్తారమున దీనికి 262144 భేదములు గలవు. అందలి ఒక భేదము-కుసుమితలతా వేల్లితము-నిట జూపబడుచున్నది.

కుసుమితలతా వేల్లితము:— మ, త, న, 3 య. గణములు 5-6—7 అక్షరములపై యతి.

ధన్యాశా మేతాః కుసుమిత లతా వేల్లితో త్ఫుల్ల
వృక్షాః
సోత్కంఠం కూజత్పరభృత కలాలాప కోలా
హలిన్యః
మధ్వాదా మాద్యన్మధుకర కలోద్గీత ఝుంకార
రమ్యా
గ్రామాంత స్సోన్తిః పరిసర భువః ప్రీతి ముద్పాద
యంతి॥

(19) 'విధృతి' లేక 'అతిధృతి'—ప్రస్తారమున దీనికి 524288 భేదములు గలవు. ఇందలి భేదమే శార్దూల విక్రీడితము.

శార్దూల విక్రీడితము:—మ, స, జ, స, త, త, గములు 12-7 అక్షరములపై యతి.

యం బ్రహ్మ వరుణేంద్ర రుద్ర మరుత స్తున్వంతి
దివ్యైస్తవై
ర్వేదై స్సాంగ పదక్రమో పనిషదై ర్గాయంతియం
సామగాః
ధ్యానావస్థిత తద్గతేన మనసా పశ్యంతి యం యోగినో
యస్యాంతం న విదు స్సురాసురగణా దేవాయతస్మై
నమః॥

(20) ప్రతి చరణమందును 20, 20 అక్షరములు గల ఛందస్సముదాయము పేరు కృతి: ప్రస్తారమున దీనికి 1048576 భేదములు గలవు. రెండుదాహరణలిట జూప బడుచున్నవి.

సువదన:—మ, ర, భ, న, య, భ, లగములు, 7-7.6 అక్షరములపై యతి.

యాపీనోద్గాఢ తుంగస్తన జఘన ఘనా భోగాల
సగతి
ర్యస్యాః కర్ణావతంసోత్పలరుచి జయినీ దీర్ఘే
చనయనే
శ్యామా సీమంతినీనాం తిలకమివ ముఖే యాచ
త్రిభువనే
ప్రత్యక్షం పార్వతీ మే భవతు భగవతీ స్నేహాత్సు
వదనా॥

వృత్తము:—1ల 1గురువు యీ క్రమముగా 20 అక్షరములుండును పాదాంతమున యతి.

జంతుమాత్ర దుఃఖకారి కర్మనిర్మితం భవత్యవర్ధ
హేతు
తేనసర్వ మాత్మతుల్య మీక్షమాణ ఉత్తమం సుఖం
లభస్వ
విద్ధి బుద్ధిపూర్వకం మహోపదేశవాక్య మేతదాదరేణ
వృత్తమేత దుత్తమం మహోపల ప్రసూత జన్మనాం
హితాయ

(21) 'ప్రకృతి'—ప్రస్తారమున దీనికి 2097152 భేదములుగలవు. ఇందలియొక్క భేదము పేరు—

స్రగ్ధర—మ, ర, భ, న, య, య, య, గణములు ఏడేసియక్షరములపైయతి.

బ్రహ్మాండం ఖండయంతీ హరశిరసిజటా
వల్లి ముల్లా సయంతీ
స్వర్లోకా దాపతంతీ కనకగిరి
గుహాగండ శైలాత్ స్థలంతీ
క్షోణీపృష్ఠే లుఠంతీ దురితచయ
చమూర్నిర్భరంభర్త్సయంతీ
పాథోధిం పూరయంతీ సురనగర
సరిత్పావనీ నః పునాతు॥

(22) 'ఆకృతి'—ప్రస్తారమున దీనికి 4194304 భేదములుగలవు. ఇందలియొక భేదము.

భద్రకము—భ, ర, న, ర, న, ర, న, గములు 10-12-అక్షరములపైయతి.

భద్రకగీతిభి స్సకృదపి స్తువంతి భవయేభవంత మభవం
భక్తిభరావనమ్ర శిరసః ప్రణమ్య తవ
పాదయో స్సుకృతినః
తే పరమేశ్వరస్య పదవీ మవాప్య
సుఖమాప్నువంతి విపులం
మర్త్యభువం స్పృశంతి న పున ర్మనో
హర సురావళీ పరివృతాః॥

(23) 'వికృతి'—ప్రస్తారమున దీనికి 8388608 భేదములు గలవు. ఇందలి రెండుభేదములు 1 అశ్వలలిత 2 మత్తాక్రీడ ననునవి యిట నుదాహరించబడుచున్నవి.

అశ్వలలిత—న, జ, భ, జ, భ, జ, భ, లగములు

పవనవిధూత వీచిచపలం విలోకయతి
జీవితం తనుభృతాం
వపురపి హీయమాన మనిశం జరా
వనితయా వశీకృత మిదం
సపది నిపీడన వ్యతికరం యమాదివ
నరాధిపా న్నరపశుః
పరవనితా మవేక్ష్యకురుతే తథాపి
హతబుద్ధి రశ్వలలితం॥

మత్తాక్రీడ—మ, మ, త, న, న, న, న, ల, గములు. 8-15 అక్షరములపై విరామము.

వందే దేవం శ్రీ గోవిందం ప్రణయ
　　　　　　　　పరవశ మతి కరుణాహృదయం
మాత్రాబద్ధం దామ్నా సామ్నా స్తుత
　　　　　　　　మపి సుతి మివ నిజమిహ సభయం
హంతుం యాఽఽగా త్తస్యై మాతు ర్వ్ర
　　　　　　　　తరదతుల నిజ గతిమతివిమలాం
గోగోపీర్గోపాన్ యోఽగోపాయ దిహ
　　　　　　　　విసృతగిరి రుపచిత ఘనతిః॥

(24) 'సంకృతి' ప్రస్తారమున దీనికి 16777216 భేదములుగలవు. ఇందలియొక భేదము పేరు.

తన్వి—భ, త, న, స, భ, భ, న, యగణములు. 5-7-12 అక్షరములపై విరామము.

నాథ తవాహం తవ పదకమలం సేవితు
　　　　　　　　మేవ మనసి మమ కామో
నామసుధా సోదర మతిమధురం
　　　　　　　　మే రసనా రసయతు నితరాంవై
ప్రేమిజనా యే ప్రభుగుణ రసికా స్తేషు
　　　　　　　　సదైవ భవతు మమ వాసో
దేవ దయాం దర్శయ వస హృదయే
　　　　　　　　త్వాం న వినేహ జగతి మమబంధుః॥

(25) 'అతికృతి' (లేక) అభికృతి,—ప్రస్తారమున దీనికి 33554432 భేదములుగలవు. ఇందలియొక భేదము పేరు.

క్రౌంచపదము—భ, మ, స, భ, న, న, న, న, గములు 5 5-8-7 అక్షరములపై విరామము.

మాధవభక్తిం దేహ్యవిభక్తిం తవచరణ
　　　　　　　　యుగళే శరణముపగతః
సంహర పాపం దర్శితతాపం
　　　　　　　　నిజగుణగణరతి ముపనయ నితరాం
మోహనరూపం రమ్యమనూపం ప్రకటయ
　　　　　　　　శిశుయ విషయ విషమనిశం
వాదయవంశం మానసదంశం తిమినిభ
　　　　　　　　హృదయవిహిత వరవశికాం॥

(26) ప్రతిపాదమందును 26 అక్షరములుగల ఛందస్సముదాయము పేరు.

ఉత్కృతి ప్రస్తారమున దీనికి 67108864 భేదములుగలవు. అందు రెండుభేదములుమాత్ర మిట నుదహరించబడుచున్నవి.

భుజంగ విజృంభితము—2 మ, 1 త, 3 నగణములు 1 ర, 1 స, 1 ల, 1 గు 8-11. 7 అక్షరములపై విరామము.

హేలోదంచ ద్వంచత్పాద ప్రకట వికట
　　　　　　　　నటన భరోరణత్కార తాళక
స్ఫారు ప్రేంఖ ద్బర్హాప్రస్ఫురితి తరళ
　　　　　　　　నవ కిసలయ స్తరంగిత హారసృత్
త్రస్యన్నాగ స్త్రీభి ర్భక్త్యాముకుళిత
　　　　　　　　కరకమలయుగం కృతస్తుతి రచ్యుతః
పాయా ద్వశ్ఛిందన్ కాళిందీ హ్రదకృత
　　　　　　　　నిజవసతి బృహత్ భుజంగ విజృంభితం॥

అపవాహము—1 మ, 6 న, 1 స, 2 గురువులు 9-6-6-5 అక్షరములపై విరామము.

శ్రీకంఠం త్రిపురదహన మమృతకిరణశకల
　　　　　　　　లలితశిరసం రుద్రం
భూతేశం హతమునిముఖ మఖిలభువన
　　　　　　　　నమితచరణయుగ మీశానం
సర్వజ్ఞం వృషభగమన మహిపతికృత
　　　　　　　　వలయరుచికర మారాధ్యం
తం వందే భవభయభిద మభిమతఫల
　　　　　　　　వితరణగురు ముమయాయుక్తం॥

అన్నియక్షరములు గురువులైయున్న పాదమందు మొదటిగురువు క్రింద లఘువునువ్రాసి కుడిప్రక్క పంక్తినిపై పంక్తివలెనే వ్రాయవలెను. శేషస్థానములలో పైవిధముగనే. వ్రాయుచుండవలెను. ఇట్లు వ్రాయుచు ఊనస్థానముం దనగా ఎడమప్రక్కను గురువే వ్రాయుచుండవలెను. అన్నియక్షరములు లఘువులైనంతవఱకు నిట్లేచేయవలెను ఇట్లుచేయుట యనునదే ప్రస్తారమనబడును. ఉదా:—ఛందశ్శాస్త్రములో ఆఱుప్రత్యయములు గలవు 1 ప్రస్తారము, 2 నష్టము, 3 ఉద్దిష్టము, 4 ఏకద్వ్యాదిలగక్రియ, 5 సంఖ్యానము 6 అధ్వయోగము. ప్రస్తారమున కర్థమువ్యాప్తి. ఇన్నియక్షరములు ప్రతిపాదమందుండుగల ఛందమున కెన్ని భేదములు? అవి ఏయేభేదములు? అనుప్రశ్నకు సమాధానముగజేయు క్రియను ప్రస్తారమందురు. మూలోక్తరీతిగ నాల్గక్షరములు ప్రతిపాదమందునుగల ఛందముయొక్క ప్రస్తార మీక్రింద జూపబడుచున్నది—

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 | U U U U | 5 | U U I U | 9 | U U U I | 13 | U U I I |
| 2 | I U U U | 6 | I U I U | 10 | I U U I | 14 | I U I I |
| 3 | U I U U | 7 | U I I U | 11 | U I U I | 15 | U I I I |
| 4 | I I U U | 8 | I I I U | 12 | I I U I | 16 | I I I I |

# వచ్చేకాలం

శ్రీ రాచకొండ విశ్వనాథశాస్త్రి

**పాత్రలు:** చంద్రశేఖరం, కుటుంబయ్య, వెంకటరమణయ్య, నరసన్న, సోమనాథం, జగన్నాథం, మోహనరావు, పంతులు, రాజారావు, చిన్నా పార్వతమ్మ, కామేశ్వరి, అమ్మలు

* • రంగమంతా చీకటిగా వుండి వెనుకగదిలో నుంచి గుడ్డిగా వెలుతురు వస్తోంది.

[చంద్రశేఖరం ప్రవేశించి]

చంద్ర : కుటుంబయ్ గారూ!...కుటుంబయ్ గారూ!

కుటుం : (చీకట్లోంచి) ఎవరు బాబూ?

చంద్ర : నేనండీ చంద్రశేఖరాన్ని.

కుటుం : రా బాబూ రా! అంతా చీకటిగా ఉంది. ఉండు బాబూ ఉండు. కామేశ్వరీ! కామేశ్వరీ!

కామే : (లోనుంచి) ఏం నాన్నా.

కుటుం : ఇలా రామ్మా. ఒచ్చి బల్లమీ దీపం వెలిగించు. శేఖరంబాబొచ్చేడు.

కామే : (లోనుంచి) ఒస్తున్నా.

[కామేశ్వరి లోనుంచి చేతిలాంతరు పట్టుకొచ్చి గుమ్మంలో పెట్టి గదిలోకి వచ్చింది. గదికి వీధివైపు గోడదగ్గర ఒక బల్ల వుంది. దానిమీద వున్న ఒక పాతకాలపు మేజా దీపం అగ్గిపుల్ల గీసి వెలిగించి తిరిగి వెనక గదిలోకి వెళ్లిపోయింది కామేశ్వరి గుమ్మంలో పెట్టిన లాంతిరు పట్టుకుపోతూ.]

కుటుం : అలా కూర్చో నాయనా, ఆ కుర్చీమీ దలా కూర్చో.

చంద్ర : కూర్చుంటాలెండి.

[అంటూ బల్లదగ్గర కుర్చీలో కూర్చున్నాడు. అక్కడే మరొక బొక్కి కుర్చీ కూడా వుంది. బల్లమీద మేజాదీపం కాకుండా చిందరవందరగా కొన్ని కాయితాలూ, దొంతర్లుగా కొన్ని పుస్తకాలూ, ఒక పాత న్యూస్ పేపరూ, బోర్లించిన ఒక ఇత్తడి గ్లాసూ ఉన్నాయి. గది ఆట్టే పెద్దది కాదు. గోడలన్నీ మాసివున్నాయి, నేలంతా చెమ్మగా చల్లగా ఉంది. ఒక పక్క రెండు మూడు తుప్పుపట్టిన ట్రంకుపెట్టెలు ఒక దానిమీ దొకటి పెట్టివున్నాయి. బల్ల దగ్గర గోడని ఒక కాలెండరుంది. మరొక గోడని వున్న చిన్న బ్రాకెట్ మీద ఒక చిన్న కొబ్బరి నూనె సీసా, చిన్న అద్దం, చిన్న లక్క కుంకుమభరిణా కనిపిస్తున్నాయి. దానికి పక్కగా పాత దొక కోట్ హేంగర్ని, మాసిన బట్టలు కొన్ని వేళ్ళాడుతున్నాయి. బల్లకి ఎదురుగా గోడవార నొక చిన్న మంచం వుంది. మంచానికి పెనగ్గా మాసిన బట్టల బుట్ట వుంది. బుట్టమీద కొన్ని మాసిన బట్ట లున్నాయి. మంచానికి చేరువగా, మూడు చక్రాలది, కర్రది, చిన్నది తోపుడు బండీ వుంది. మంచంమీద చుట్టలు చుట్టేసి నవి రెండు చింకిపరుపు లున్నాయి. ఆ మంచంమీద పరుపులకి ఆనుకొని కూర్చొని వున్నాడు కుటుంబయ్య. కట్టుకున్నది మాసిన పంచె. తొడుక్కున్నది మాసిన చొక్కా. వలభయ్యాయిదేళ్ళవాడే అయినా సన్నగా నీరసంగా ఉండడంచేత ఇంకా ఎక్కువ

వయసువాళ్ళా కనిపిస్తాడు. ఆవేళ మరీ నీరసంగా ఉన్నాడు. జుట్టంతా రేగివుంది. కళ్లు ఎర్రగా ఉన్నాయి.]

చంద్ర : (కుర్చీలో కూర్చున్నాక) ఏమండీ, అలా వున్నారేం? ఇవాళ ఆఫీసు కూడా రాలేదు. ఏం, ఒంట్లో ఏమైనా బావు లేదా?

కుటుం : రోగం వొచ్చి నాకు చావొచ్చినా బాగానే ఉన్నయ్యా. అదీ లేదు.

చంద్ర : ఏమిటలా మాట్లాడుతున్నారు? ఏమిటి జరిగింది?

కుటుం : ఏం జరిగిందంటే ఏం చెప్పన్నాయనా?!

చంద్ర : ఏం జరిగిందో చెప్పండీ.

కుటుం : మొన్న కదా మా కుర్రాణ్ణి చూసేవు, శేఖరంబాబూ?

చంద్ర : అవును మొన్నే చూసేను. సాయంకాలం. ఆ బండీ తోస్తూ ఆడుతున్నాడు. చూసేను. ఏం? ఇప్పుడేం వయింది?

కుటుం : ఇవాళ్తో మా ఇంట్లో ఆటా పాటా అంతా ఆఖరయిపోయింది.

చంద్ర : ఏమిటి?...

కుటుం : వెళ్లిపోయేడు శేఖరంబాబూ, మా వాడు వెళ్లిపోయేడు.

చంద్ర : అరె!! ఎలా, ఎప్పుడు? ఇంత హఠాత్తుగానా?

కుటుం : అవున్నాయనా అంత హటాత్తుగానే! నిన్న పొద్దుటికి మామూలుగానే ఉన్నాడు. వాళ్లక్క కాలేజీకి వెళ్తాంటే తనూ ఓ పుస్తకం పట్టుకొని దాన్తోకూడా వెళ్తానని అల్లరల్లరి చేసేడు. మధ్యాన్నం పట్టెడన్నం తిన్నాట్ట, పడుకున్నాట్ట. లేచేసరికి జ్వరం, సరి, అంతే, ఆ జ్వరం జ్వరం మా కొంప ముంచేసింది.

చంద్ర : డాక్టరు మరి...

కుటుం : డాక్టర్ని పిల్చేను. ఒచ్చేడు. మందిచ్చేడు. కాని ఏం లాభం? ఏమీ లాభం లేకపోయింది, నేను సాయంకాలం ఇంటికొచ్చేసరికి నూరు డిగ్రీలుంది జ్వరం. అది నూటరెండయింది. నూటైదయింది. నూటాఆరయింది. అదీ దాటింది. మావాడికి నూరేళ్లూ నిండిపోయేయి.

చంద్ర : కుటుంబయ్ గారూ! 'అయామ్ వెరీసారీ' ఆఫీసుకి రాలేదు, ఏం చెప్పాల్లో అనుకున్నాను. 'అయామ్ సో వెరీసారీ'. ఉంగరాలజుట్టూ కుర్రాడూ ముద్దొచ్చేవాడు. ప్చ్...అయితే ఒక్కరాత్రే అన్నమాట.

కుటుం : ఒక్కరాత్రే కాని, శేఖరంబాబూ, పిల్లడిలా విలవిల్లాడి పోయేడయ్యా. అంత చిన్నపిల్లణ్ణిలా బాధపెట్టడం ఉందే భగవంతుడికది న్యాయంకాదు.

చంద్ర : చాలా చిన్నపిల్లడు కదండీ! రెండేళ్లయినా వెళ్ళేయో లేదో.

కుటుం : మొన్నిమధ్యనే రెండోయేడు వెళ్ళిందయ్యా రెండు వెళ్ళిమూడు, మూడేళ్లయినా నిండకుండానే...అంతే, ఆఖరు.

[ఇంతలో ఆయనభార్య పార్వతమ్మ వెనక గదిలోంచి ఏడుపు మొదలుపెట్టింది]

పార్వ : మూడేళ్లు, మూడేళ్లు, మూడేళ్లయినా నిండకుండానే మావాణ్ణి తీసుకుపోతావా, తండ్రీ?... సకలకష్టాలూ పడుతూనే ఉన్నావు, అన్నిబాధలూ పడుతూనే ఉన్నాం. కానీ పల్లెత్తుమాటన్లేదే నిన్ను. లెంపలు వాయించుకుంటున్నాం. తప్పులుంటే క్షమించమంటున్నాం, కాళ్లమీద పడి వేడుకుంటున్నాం. అందుకా మాకీ శిక్ష? అయ్యో దేముడా అందుకా, అందుకా మాకీ శిక్ష?...పుట్టించడమెందుకు పుట్టించేవు, పుట్టించినందుకు మాకేమిచ్చేవు తండ్రీ! మాకేమిచ్చేవు?...ఇవ్వకపోతే నిన్నేమైనా అడిగేనా? మళ్లా మాన్యాలా; మేడలా మిద్దెలా; వెండా బంగారమా? ఏమిచ్చేవు మాకు? ఏమైనా అడిగేనా నిన్ను? ఒద్దు తండ్రీ. నాకవేవీ ఒద్దు. అన్నీ నీదగ్గిరే నీ దగ్గిరే ఉంచుకో! కాని ఇచ్చినాయనా నా పిల్లణ్ణి నాకిచ్చి. రెండే, రెండేళ్లే వెళ్లేయి. అంత లేతనెత్తురే కావాలా

తండ్రీ, నీకూ...నన్ను రాసి రంపాన్న పెట్టు. నన్ను నరికి ముక్కలు చెయ్యి. నన్ను చంపి తీసుకుపో....కాని మా వాణ్ణి తెచ్చి ఇచ్చేయి తండ్రీ ఇచ్చెయ్. ఇచ్చెయ్ ఇచ్చెయ్...

[అని ఏడుస్తూ ఆమె తల నేలకి కొట్టుకొంటున్నట్టుగా వుంది. ఏం చెయ్యడానికీ తోచక శేఖరం లేచి నిల్చున్నాడు. కుటుంబయ్య మంచం మీద కూర్చొని బాధపడుతున్నాడు. ఇంతలో గబగబా వచ్చేడు సోమనాథం. అతన్నీ కుటుంబయ్య వయసే ఉంటుంది. కాని ఇంకా బలంగా ఉన్నాడు. పంచె, పొట్టి చొక్కా, దగ్గరగా కత్తిరించుకున్న జుట్టు.]

సోమ : (బిగ్గరగా అరుస్తూ) ఏం కుటుంబయ్యా! ఇంకా మంచంమీద పడుక్కుని ఏడుస్తూనే ఉన్నావా? (వెనక గది గుమ్మం దగ్గర నిల్చొని) ఏమిటి పార్వతమ్మా మతి పోయిందా నీకు; మతిపోయిందా అంట? నా మాట వినవా? సరే. ఇంకా గట్టిగా మొత్తుకోవమ్మా. ఇంకా గట్టిగా మొత్తుకో. మొత్తుకుంటే భూమిలోంచిమళ్లీ లేచొస్తాడు మీ వాడు. అంతేనా? కాకపోతే ఏమిటమ్మా ఆ వెర్రిపన్లూ? కుటుంబం, ఓయ్, కుటుంబం! లేవోయ్ లే! ఆడదాన్లా అలా వాపోతావేం ఖర్మమయ్యా?! లేచిలా రా. ఆవిణ్ని లేవనెత్తు. ఊఁ లే (అంటూ కుటుంబయ్యని రెక్కపట్టుకు లేవనెత్తేడు. వెనగ్గదిలోకి పంపేడు)

కుటుం : (గది లోపల) లే పార్వతీ లే.

సోమ : (నాతో) ఏం శేఖరం, నువ్వంతే పిల్లనిలా ఏడిపిస్తున్నావా?

చంద్ర : ఊరుకోమని ఎలా చెప్పడమో నాకు తెలీడం లేదు సోమనాథం గారూ!

సోమ : ఎలా చెప్పడమా? గట్టిగా చెప్పాలి. కుర్చీలో కూర్చుని నసగడం కాదు.

కుటుం : (వెనక గదిలో) పార్వతీ లేలే. సోమన్నా, శేఖరంబాబూ ఒచ్చేరు. ఏడవకు లే.

సోమ : (గది గుమ్మం దాకా వెళ్లి) లేవమ్మా లేచి ఇంటి పన్లు చక్కబెట్టుకో, మన పనే కుదుట పడుతుంది. పిల్లలా? వాళ్లే ఒస్తారు. కుటుంబం! ఒచ్చే యేటికి మళ్ళీ కొడుకు నెత్తుకు నువ్వే చూపిస్తావు నాకు. అలా జరక్కపోతే చూసుకో! మనకి పిల్లలకే కొదవటయ్యా?!

[కుటుంబయ్య మళ్ళీ లోపల్నుంచి వచ్చి]

కుటుం : (మంచంమీద కూర్చొంటూ) అలా కూర్చో సోమన్నా, అలా ఆకుర్చీలో కూర్చో, మాటాడకుండా అలా కూర్చో, నీకు పుణ్యం వుంటుంది.

సోమ : మెల్లిగా చెప్తే వినవు, గట్టిగా చెప్తే వటవట వాగి చంపుతున్నా నంటావు. నీతో ఎలా వేగడం?

చంద్ర : అధైర్య పడకండి కుటుంబయ్యగారూ! అధైర్య పడొద్దనే చెప్తున్నారు సోమనాథం గారు కూడాను.

సోమ : మరింకివాళేం చెప్పి లాభం లేదయ్యా శేఖరం, అధైర్యపణ్ణీ. అధైర్యం కాకపోతే ఇంకేమిటి? శ్రీరామచంద్రు డంతటివాడు గోలగోల పెట్టేసేడు. చెప్పొద్దూ! నాకూడా అధైర్యంగానే ఉంటుంది. అంచేతనే అలా కేక లేసేస్తాను. కేక లేస్తే అంతా కమ్ముకుపోతుంది. ఏడ్చేవాళ్లని గావు కేక లేసి గాభరా పెట్టేసి ఊరుకో పెట్టేస్తాను (అంటూ వచ్చి నా పక్కన కుర్చీలో కూర్చున్నాడు. చుట్టా, అగ్గిపెట్టే తీసి చేత్తో పట్టుకున్నాడు) చూడూ శేఖరం బాబూ, బండవెధవని కాబట్టిలా మొండి కత్తేసి తిరిగేస్తున్నాను కాని నేను పడ్డన్ని కష్టాలెవడైనా పడగల్డయ్యా? నేపడ్డకష్టంలో వీస ఎత్తుచాలు నీలాటివాడు బండరాయి మెడ కట్టుకొని గంగలో కురకడానికి. అడుగు, కుటుంబాన్నడుగు, ఏం కుటుంబం?

కుటుం : ఏమిటోయ్? ఏం చెయ్యమంటావు? ఏడవొద్దంటావు అంతేనా? నే నేడవడం లేదు, సరా?

సోమ : అదికాదోయ్. నేనెన్ని కష్టాలు పడ్డానో చెప్పు శేఖరంతోనూ. నువ్వు చెప్పు నామాట నమ్మకుండా ఉన్నాడు.

కుటుం : బావుందోయ్.

చంద్ర : బావుందండీ! ఆయన్నెందుకూ అడగడం?

సోమ : నువ్వు నమ్మవు, నాకు తెలుసు, చూడూ నీకిప్పుడు పాతికేళ్లుంటాయా?

శేను : దాటేయి.

సోమ : దాటేయి కదా! అబ్బ, పాతిక దాటేయయ్యూ?! చెప్పేవుకావు. సరి బావుంది. పాతిక దాటేయి కదా. నీ వయస్సుకి నా కప్పటికప్పుడే పెళ్లవడం, ముగ్గురు పుట్టడం, ఇద్దరు చావడం అంతా జరిగిపోయింది. నీకు చూస్తే ఇంకా పెళ్లివాసనైనా లేదు.

చంద్ర : లేపోతే ఏం పుట్టి మునిగిపోయింది లెండి.

సోమ : అలా అంటావన్నారు తెలుసోయ్. పెళ్లాడవయ్యూ అంటే ఊహుఁ అంటావు. అహఁ అంటూ, పోషించలేనే, హమ్మో! అంటావు ఇన్నేళ్లొచ్చేయి; ఆపాటి ఆడదాన్ని పోషించలేవయ్యూ?

చంద్ర : అలా నేనేనైఁనా అన్నానా?

సోమ : వేరే అనాలా ఏవిఁటి? గుండెనిబ్బరం వుంటే ఈసరికే పెళ్లాడుదువు.

చంద్ర : ప్రస్తుతపు సొసైటీలో మన్లాటివాళ్లకి చాలా ఇబ్బందులున్నాయి.

సోమ : ఇబ్బందులెవడికి లేవు? పూటకి టికాణా లేని వాళ్లవిఁ—చూస్తే బత్తెకు భూఁ వెక్కడా లేదు; కొంప లేదు; గోళ్లేదు; గోచీ లేదు— అలాంటివాళ్లవిఁ, నేనూ కుటుంబయ్యా లాంటివాళ్ళవేఁ ఈ సంసారాల్ని ఈదుకొస్తున్నాం కదా! నీకేఁవయ్యా? తీపె దిగేసిందా?

చంద్ర : ఇప్పుడెక్కడి మాస్టేవిటి సోఁవనాథంగారూ?

సోమ : అవున్రా అలానే అనిపిస్తుంది నీకు. నిజం చెప్తే విన బుద్ధిపుట్టదు.

కుటుం : ఏవిఁటోయ్ సోఁవన్నా? ఏవిఁటలా మాట్లాడుతున్నావ్?

సోమ : మరేం లేదోయ్, ఈ కుర్రకుంక చంద్రశేఖరంతో వాడివయసులో మనంపడ్డ కష్టాల గురించి చెప్తున్నాను.

కుటుం : కష్టాలు. కష్టాలు! ఇహ నే భరించలేనండీ భరించలేను.

(అంటూ అగను శోకతీవ్రతలో లోనికి వెళ్లిపోయేడు.)

సోమ : (గొంతుకస్థాయి కొంత తగ్గించి) చూసేవురా శేఖరంబాబూ వాళ్ళెంతటి కష్టంలో ఉన్నారో?

చంద్ర : చూస్తున్నా. కాని మనవేం చెయ్యాలవోఁ బోధపడకుండా ఉంది.

సోమ : అందులోనూ మాకుటుంబాన్దెంత మెత్తటి మనసో నీకు తెలుసా?

చంద్ర : తెలుసు.

సోమ : కాని చూడు. వాడెంత మంచివాడో, ఎంత నెమ్మదైనవాడో అంత బాధా, అంత దుఃఖవూ అవే దక్కుడయేయి వాడికి.

చంద్ర : లోకం అలావుంది ఏంచేస్తాం?

సోమ : నిన్న కాక మొన్న పుట్టేవు. నీకేం తెలుసు, లోకం సంగతీ అందులోవున్న బాధల సంగతీను? నీకేం తెలీదు. కాని చూడూ లోకంలో ఉన్న అన్ని కష్టాలదారీ వేరు; కడుపుశోకం ఉందే ఆ కష్టం దాన్దారి వేరు. ఎంచేతో నీకు తెలుసా?

చంద్ర : చెప్పలేను.

సోమ : నే చెప్తున్నా విను. దీనిగురించి నే బాగా ఆలోచించేన్లే. ముందో మాటడుగుతాను. చెప్పు. మనకి కాలాలెన్ని?

చంద్ర కాలాలా?

సోమ కాలాలే! ఎన్ని?

చంద్ర మూడూ.

సోమ హాఁ! మూడు కదా? భూతకాలం, వర్తమాన కాలం, భవిష్యత్కాలం. అంతేనా?

చంద్ర అవును.

సోమ మరిప్పుడు విను. ఏ పూర్వజన్మ సుకృతాన పుట్టేవోఁ మనం గర్భదరిద్రులవిఁగా పుట్టేం.

వర్తమానంలో దరిద్రులంగానే ఉంటున్నాం. వెనక్కి మాస్తే భూతకాలం మనకో పెద్ద భూతంలాగే కనిపిస్తుంది. నిజవేఁనా?

చంద్ర : అవును.

సోమ : 'అమ్మా ఆకలే' అంటూ అమ్మకొంగు పట్టుకు వేళ్లాడుతూనో లేకపోతే వేలు పట్టుకొని వీళ్ల పంచలంటా వాళ్ల పంచలంటా దేవుళ్లాడుతూనో కాలం గడిపేం. కాస్త జ్ఞానంవొచ్చి జ్ఞాపకం ఉన్న దగ్గిర్నుంచీ తల్చుకుంటే గుర్తుకేవిఁ టొస్తుంది? వీడిచేత మొట్టికాయలు; వాడిచేత మొట్టికాయలు, తుంటిమీద తాపులు; వీప్మీద ఇస్పేట్లు. అవీ గుర్తుకొచ్చేవి. అదంతటితో అయిందా? చదువుకొనే ఈడొచ్చింది. మనకి చదువురాకపోడం; లేకపోతే చదువు సాక్కపోడం. రెండే భోగట్టాలు మనకి. ఆతరవాత వయసొచ్చింది. అదీ అంతే. మంచి తిండుండదు. తినకుండా ఉండలేవుఁ. మంచి బట్టుండదు. అలా అన్చెప్పి గుడ్డముక్కలే లేకుండా తిరగలేవుఁ. మంచి చదువుండదు. దానికైనా డబ్బుండాలి. ఎక్కడా నౌఖరీ దొరకదు. ముష్టెత్తితే వెయ్యరు. దిబ్బకొట్కులా ఉన్నావు తెగులా అని తిడతారు. కూలికి పోతే ఆరణాల్డబ్బులకంటె ఇవ్వరు. ఎక్కువిచ్చినా రోజూ దొరకదు. దొరికితే, నడ్డిరిగి పోయేలా రాళ్లు మోయిస్తారు; బండచాకిరీ అంతా నెత్తిని రుద్దుతారు. వింటున్నావురా అబ్బాయ్?

చంద్ర : వింటున్నాను. చెప్పండి.

సోమ : ఆ వయసులో అలా ఉండేది మనవస. కాని నే నేం చేసేవాణ్ననుకున్నావ్?

చంద్ర : ఏంచేసేవారు?

సోమ : ఇంట్లో భోజనం సప్టు ఎలావున్నా, పైని మాత్రం దొరికిందల్లా భక్షించీసేవాణ్ని.

చంద్ర : అంటే ఏంచేసేవారు?

సోమ : ఆకలెక్కువ, డబ్బులెక్కువ, జెబ్బసత్తువ ఉండి రికామీగా ఉన్న వెధవేం చేస్తాడో ఆ పన్లన్నీ చేసీసేను.

చంద్ర : అంటే!

సోమ : అంటే ఊరిమీద పడ్డవేఁ! రాజుగారితోట్లో మావిడికాయలు, నాయుడుగారి పొలంలో చెరుగ్గల్లు, కరణంగారింట్లోవి బొప్పాసికాయలు, వీళ్ళింటిముందు జాంకాయలు, వాళ్లపెరట్లోవి దబ్బపళ్లు, ఇక్కడ చల్దిపందిళ్లు, అక్కడ వనసంతర్పణ్లు, అన్నీ మనవే; ఎక్కడచూసినా మనవేఁ—దొంగతనవూఁ, దమాయింపు సెక్షనూను. రెండే పద్ధతులు. పల్లెటూరూ, చిన్నతనవూఁ కాబట్టి సరిపోయింది కాని మరాపన్లకే లక్షాయాభై మంది జెయిళ్ళకి పోతున్నారు.

చంద్ర : మంచి పన్లే చేసేవారే!

సోమ : అదంతా ఆ రోజుల్లో సంగతిరా అబ్బీ. ఇప్పుడు పూర్తిగా లొంగిపోయేను. అప్పుడా వయసులో పెళ్ళినాటి కలా ఉండేవాణ్ని?! ఘళఘళ్ళాడుతూ పగసలో ప్రభలా ఉండేవాణ్ని, మన సంగతంతా మానాన్న కనిపెట్టేడోరే! మనం మెట్రిక్కుడింకీ కొట్టించీసెం, ఇంటిపట్టునుండకపోడం, డింగరాయి గొడ్డులా తిరగడం, చుట్టలు కాల్చడం, వగైరా వగైరా లున్నాయి చూసేవుకదూ? అవన్నీ కనిపెట్టేడోరే! కనిపెట్టేంచేశేడు? వీడి సంకటం అణిచిపారెయ్డానికి ఒకటే మార్గవఁనుకున్నాడు. ఆ ప్రకారం చేసీసేడు.

చంద్ర : ఏం చేసేరు?

సోమ : ఏం చేసేడా? పెళ్లిచేసీడు. మన్ని సాఫు చెయ్యడానికి బెస్టు పద్ధతి కనిపెట్టేడు. దాన్తో మానాన్న అనుకున్న ప్రకారం సాఫై పోయేం.

[ఇంతలో వెనుక గదిలోంచి కామేశ్వరి ప్రవేశించి, గుమ్మందగ్గర నిల్చుండిపోయింది. ఆమెకి పద్దెనిమిదేండ్లుంటాయి. పల్చగా, వెడల్పుగా కాస్త పొడవుగా ఉంది. అందమైనదేనని చెప్పాలి. ఆసమయంలో ఆమెలో ఆత్రతా విచారవూఁకూడా కనిపిస్తున్నాయి]

సోమ : ఏం కావేఁశ్వరీ ఏం కావాలి?

కామే : పైమెంతయిందండీ?

సోమ : ఎంతరా అబ్బాయ్ అయింది?

చంద్ర : ఏడుంపావు.

సోమ : ఏడుంపావు.

కామే : (కొంచెంసేపు అక్కడే నిల్చుండి పోయింది ఏదో నిశ్చయానికి వచ్చి నట్టుగా వీధిగుమ్మం వైపు నడిచింది. ఈలోగా చుట్ట ముట్టించుకు సోమనాథం.)

సోమ : ఏం కామమ్మ తల్లీ, ఎక్కడికీ?

కామే (ఆగి) ఇక్కడకే... లక్ష్మీదేవి గారింటికి.

సోమ లక్ష్మీదేవెవరు?

కామే నాకు తెలిసినామె.

సోమ ఇప్పు డెందుకూ వెళ్ళడం? భోంచెయ్యలేదు కామోసు.

కామే వంటచేసేసేను, చెల్లిమాత్రం భోంచేసింది.

సోమ మీ నాన్నేడీ?

కామే పెరట్లో కూర్చున్నారు.

సోమ వేగిరం వెళ్ళి రామ్మా. ఇక్కడుంటే మీ నాన్నేడుపు, మీ అమ్మేడుపూ కాస్సేపెక్కడో అక్కడ కూర్చోన్రా.

[కామేశ్వరి వీధిలోకి వెళ్ళింది. మరో క్షణానికి గదిలోకి వీధిలోంచి మరో కుర్రోడొచ్చేడు. ఇరవైయ్యేళ్ళు దాటుండొచ్చు, చాలా బలంగా ఉన్నాడు. నిక్కరూ. నిక్కర్లోపల చొక్కా వేసుకున్నాడు. బట్టలు మాసివున్నాయి. కాళ్ళకి పాత ఎర్ర జోళ్ళున్నాయి. మేజోళ్ళు లేవు. రాగానే గుమ్మంలో జోళ్ళు విప్పుతున్నాడు.]

సోమ : ఏరా జగ్గన్నా డ్యూటీనించేనేట్రా రావడం?

జగ్గ : అవున్నాన్నా (అని జోళ్ళువిప్పుకొని ముందుకొచ్చేడు.)

సోమ : భోగట్టా తెల్సిందా?

జగ్గ : తెల్సింది. దార్లో సీతారావుగారు కనిపించి చెప్పేరు.

సోమ : సరి. వాడుకనపిస్తే చావుకబురు తెలియక పోదు.

జగ్గ : పిల్లడు పొద్దున్నే పోయాట్ట, పాపం.

సోమ : మనచావులకి వేళా పాళా ఉంటుందట్రా. సంకురోరికి తే చాలు మన పీకలమీదికి దున్నపోతో సహా తయారయిపోతా డాధర్మరాజు. ఏవంటావురా శేఖరం బాబూ?

చంద్ర : అవునంతే.

జగ్గ : మాఁవయ్యేడ్నాన్నా?

చంద్ర : పెరట్లో ఉన్నాడు.

సోమ : ఒరేయ్, అలావెళ్ళి వాణ్ణోసారి చూసిరా.

[జగ్గన్న ఇంట్లోకి వెళ్ళేడు.]

సోమ వాడెవడో తెల్సా?

చంద్ర మీ అబ్బాయీ.

సోమ ఎలా పోల్చేవురా; నా లా ఉన్నాడనేనా?

చంద్ర మిమ్మల్ని 'నాన్నా' అని పిలుస్తున్నాడు కదండీ, పోల్చడానికి ఇంకా ఏంకావాలి?

సోమ అలాగా పోల్చేవు. నేనింకా ఏమిటో అనుకున్నాను.

చంద్ర కుర్రవాడేం చేస్తున్నాడు?

సోమ వాణ్ణి మెకానికల్లో పెట్టేసేన్రా అబ్బీ. పాసవడమేమో మెట్రిక్కు పాసయేడు. పైచదువు చదివిస్తే బాగానే ఉణ్ణు. కాని, బాబూ, అది నాతిరవాఁ? మనం తూగ్గలవాఁ? అంచేత మెకానికల్లో పెట్టేసేను. ప్రస్తుతం వొర్క్‌షాప్లో ఇంకా తయారీలో ఉన్నాడు.

చంద్ర : ఏదైతేనేవిఁట్లెండి. ఏదోవిధంగా బతకడమే కదా కావల్సింది!

సోమ : కుర్రాడివేకాని వెంట్రుకలన్నీ పండిపోయిన వాళ్ళా చెప్పేవు. కాని అందరి కుర్రాళ్ళకీ అలా అనిపిస్తుందట్రా. పడుచుకాలంలో తినడానికి మంచి తిండీ, వేసుకుందుకి నచ్చిన బట్టా లేకపోయినా, నచ్చిన చదువు చదవడానికి, నచ్చిన పిల్లని పెళ్ళాడ్డానికీ అవకాశం లేకపోయినా, ఎలాఉంటుందో తెలుసా?

చంద్ర : కష్టంగా వుంటుంది.

సోమ : "ఛీ వెధవ బతుకు, ఇదేంబతుకు" అనిపిస్తుంది. అనిపించక పోతే వాడెందుకూ పనికిమాలిన

వెధవన్నమాట. అనిపించి ఆ విచారానికి లొంగిపోతే వాడు మరి ఎందుకూ పనికిరాని వాడన్నమాట. నిజమేనా?

చంద్ర : అవును.

[ఇలా మాట్లాడుకుంటూ ఉండగా కుటుంబయ్యగారి చిన్నకూతురు అమ్మలు గదిలోకొచ్చి మంచంమీద కూర్చొని తోపుకు బండీని చేత్తో అటూ ఇటూ తోస్తోంది. రెండు చేతుల్తోనూ ముందుకి తోస్తోంది. మళ్ళీ వెనక్కి లాక్కుంటోంది. ఆమెకో ఎనిమిదేళ్ళుంటాయి. పరికిణీ, జుబ్బా, పొట్టి పిలక. మిక్కిలి దీనంగా కనిపిస్తోంది.]

సోమ : మావాడున్నాడే. లొంగేరకం కాదులే. నిన్న కాక మొన్న పుట్టేడు. ఇరవయ్యేళ్ళంతే. అయితేనేం? కష్టమొచ్చినా సుఖమొచ్చినా తమాయించుకోగల్డు. ఏదీ తెలియనివ్వడు. పైకి తేలు.

చంద్ర : నెమ్మదైనవాళ్ళా కనిపిస్తున్నాడు.

సోమ : కనిపించడమేం కాదు. నెమ్మదైనవాడే.

చంద్ర : ఈ కుర్రాడేనా పెద్దవాడు?

సోమ : దక్కినవాళ్ళలో వీడే పెద్దరా నాయనా. వీడి పైవాళ్ళు ఇద్దరు మొగపిల్లలు. ఇద్దరూ పోయేరు.

చంద్ర : అరె! అలాగా?

సోమ : ఒకాడు నాలుగేళ్ళున్నాడు. ఇంకోడు రెండేళ్ళే ఉన్నాడు. నాలుగేళ్ళున్నవాడే పెద్దవాడు. వాడుండే వాడొరే శేఖరం బాబూ! దేదీప్యమానంగా యిలా సూర్యుడుదయించినట్టుగా ఉండేవాడ్రా. పుట్టినప్పుడు శ్రీరామచంద్రుడిలా వుండేవాడు, విక్రమాదిత్యుడిలా వుండేవాడు అని చెప్తారు విన్నావా? వెధవది చెప్పుకోగూడదు కాని ఆ వర్ణనలన్నింటికీ మావాళ్ళో స్పష్టంగా దాఖలా కనిపించిందనుకో. కాని యేం ప్రయోజనం? వాళ్ళంతా గొప్ప గొప్పవాళ్ళిళ్ళలో పుట్టేరు. గొప్పవాళ్ళయేరు. మా వాడు నా కొంపలో పుట్టేడు. దార్భాగ్యుడైపోయేడు. వాడేవుంటే నా కిప్పుడిన్ని కష్టాలేకపోను కదా! ... వాణ్ణి చూస్తూ రోజూ అనుకొంటూవుండేవాణ్ణి- వీడేం చేస్తాడు చెప్మా పెద్దయాకా—అని. ఉద్యోగాల్చేస్తాడా, ఊళ్ళేలేస్తాడా? కొండల్ని పిండిచేస్తాడా, బంగారాన్ని పండించేస్తాడా? చదువులు చదివేస్తాడా, సంఘాన్నుద్ధరించేస్తాడా? అనుకొనేవాణ్ణి. అల్లా ఆలోచిస్తూంటే వాట్లో మావాడు ఏది చెయ్యలేడనిపించేది. అన్నీ చేసేవి ఎంతో ఇదిగా వుంటాడనుకున్నాను. తను బాగుపడి ఓ పదిమందిని బాగుచేస్తాడనుకున్నాను. అసమం నాకేదో విధంగా సాయపడగలడనుకున్నాను. ఎంతో ఆశ పెట్టుకున్నాను. ఏంలాభం? నాబతుకువెధవబతుకైపోయింది. వాడలా వెళ్ళిపోయేడు...చూడూ శేఖరం, నాయనా, మనకి పెద్దకొడుక్కుదుటయ్యాటార్చి చేరరూ?! నే చచ్చేక నిజంగా వాడేకాని నిప్పుపట్టుకొని సాక్షాత్తూ అగ్నిదేవుళ్ళాగ ముందు నడుస్తూ ఉంటే ఎంత బావుణ్ను! పిల్లా పాపా ఆడా మగా అంతా ఎగబడి చూద్దురు గదా! వెధవది ఆరిపోయిన ఒత్తిని నన్ను కాదు చూడ్డం. ఆ ముందు నడిచే దీపాన్ని, ఆ వెలుగుని చూసి ప్రజ యావన్మందీ ఎంత సంబరపడే వారో కదా!... ఏమనుకుంటే ఏం ప్రయోజనం. వొరే ఏం ప్రయోజనం...

(అని కొంత సేపు మాట్లాడకుండా ఉండిపోయేడు సోమనాథం. మంచంమీద కూర్చున్న అమ్మలు తోపుకు బండీ మీంచి చేతులుతీసేసింది. వెక్కి వెక్కి ఏడవబోయి అపుకొని పరికిణీతో కళ్ళు వత్తుకొంది. మళ్ళీ వెక్కింది. సన్నగా ఏడ్చింది. సోమనాథం ఒళ్ళు విదిలించుకొని లేచి ఆమె దగ్గరికి వెళ్ళేడు.

సోమ : ఏడవకే అమ్మడూ ఏడవకే! ఎంతకష్టమొచ్చిందమ్మా మీకూ, ఎంతకష్టమొచ్చిందే బువ్వ తిన్నావే అమ్మలూ, బువ్వ తిన్నావా?

అమ్మలు: (ఏడుపు తగ్గించుకుంది కష్టంమీద, భోంచేసినట్టుగా తలవూపింది. 'ఊ' అంది)

సోమ : అక్కయ్య పెట్టిందా?

అమ్మలు: ఊఁ

సోమ : భోంచేయిస్నేవు కదూ. మరింక పడుకో అమ్మలూ పడుకో. అలా బజ్జో అలా బజ్జో (అంటూ ఆమెని పగుపులమీద తలపెట్టి పడుకోబెట్టేడు) అలా బజ్జో. చూడూ ఒచ్చేయేటికి నీకు మరోమంచి తమ్ముడొస్తాడూ, వాణ్ని ఊరంతా ఎత్తుకు తిప్పుదువుగాని, ఏం? మరలా బజ్జో.

అమ్మలు కళ్ళు మూసుకు పడుక్కుంది.

సోమ : నేనిందాట్లా చెప్తున్నాను జ్ఞాపకం వుందా?

చంద్ర : ఏవిఁటి?

సోమ : పిల్లలు పోతే మనకెందుకంత కష్టంగా ఉంటుందో చెప్తున్నా కదూ

చంద్ర : అవును. ఏంచేతంటారు?

సోమ : చెప్తున్నా. ఏంచేతో మరి విను. మనకింత వరకూ వళ్ళిన రోజులన్నీ దరిద్రపు రోజులే. అష్టకష్టాలూ పడ్డాం. పెట్టూన్న రోజులూ. మనకలాంటివే. ఇప్పుడుకూడా అష్టకష్టాలూ పడుతూనే ఉన్నాం. మంచేదైనా ఉంటే మనకి భవిష్యత్తులో వుండాలి. అవునా? మంచిరోజులొచ్చేసరికి మనంవున్నా లేకపోయినా మన పిల్లలుంటే చాలు మనం వున్నట్టే లెక్క. అంచేత పిల్లలు పోయేరూ అంటే మనకి భవిష్యత్తే పోయిందన్నమాట. అందుకూ మనకంత కష్టంగా ఉంటుంది.

చంద్ర : చావంటేనే జెనరల్‌గా కష్టంగా ఉంటుంది కదండీ?!

సోమ : జనరల్ కష్టవేఁకాదు; మన కదొక స్పెషల్ కష్టం. ఎలా అంటావా? చెప్తా విను. ఇందాట్లా చెప్పేను కదూ. వాడిలా పోయేడు. వాడి తరవాత మరో పిల్లడు రెండేళ్ళవాడ్డా. ఎండిపోయి ఎలా ఉండేవాడంటే కునుకు నక్క మాసేపూ కునుకునక్కంటే కునుకు నక్కే అనుకో. పుట్టిందగ్గిర్నుంచీ జబ్బులూ, మందులూ, ఏడుపులూ రాగాలూను. తెల్లారేస్తే డాక్టరింటికి పరిగెట్టడం; మందులకోసం కేటాడ్డవూఁను. డబ్బు తగలడ్డం అటుంచి. చెంగకి చెంగా శ్రమకి శ్రమాను. అలా ఉందా? అలా వుండగా ఓరోజు ఆదివారం. మిట్టమధ్యాహ్నం. పన్నెండో ఒంటిగంటో అయుంటుంది. ఆదివారం కదూ; స్కూల్లేదు. గదిలో అలాగే మంచం ఉంది. ఊరంతా తిరిగి తిరిగొచ్చి—ఇంకా అన్నం తిన్లేదు—అలా మంచంమీద కూర్చున్నాను. ఎదురుగ్గా వరండాలో చూరుకి గుడ్డవుయ్యాల ఉంది. అందులో కిరకిర చుట్టుకుపోతూ ఇలా పేగులెగిపోయేలా ఏడుస్తున్నాడు పిల్లడు. ఆ పక్కనే మా ఆవిడ చాపేసుకు చాగోరింది; కొట్టేసినట్టుగా పడుకుంది. చలికాలం. నేలమీద కాలేస్తే జివ్వున లాగేస్తోంది. గదిలో కూర్చుంటే మంచు పెట్టెలో కూర్చున్నట్టుగా, మిట్టమధ్యాహ్నవేఁ గజగజలాడించేస్తోంది. నాకు ఒంట్లో నీరసంగా ఆకలిగా ఉందన్న గుర్తే లేదు. పిల్లణ్ని ఎత్తుకుచూసేను. లాభం లేదు. ఉయ్యాల్లో పడుకోబెట్టి ఊపేను. లాభం లేదు. మరిహ వాణ్నలా ఒదిలేసి ఒచ్చి మంచంమీద కూర్చున్నానన్నమాట. వాడి బాధేవిఁటో వాడు చెప్పలేడు; మనకి తెలీదు; ఏవీఁ చెయ్యలేవుఁ; ఆ ఏడుపు విన్లేవుఁ; మరిహ విన్లేక చెవులు మూసుకున్నాను. మూసుకున్నా అంతే. ఓంకారంలా ఏం చేసినా వినిపిస్తోంది. ఏం చెయ్యాఁరా భగవంతుడా అని ఆలోచిస్తూ అలా కూర్చున్నాను. అదేదో కొత్తమందు కొని పట్రమ్మన్నాడు డాక్టరు. ఊరంతా తిరిగేను. దొరకలేదు. రెండ్రోజుల్లో ఒస్తుందని ఒహడన్నాడు. రెండ్రోజుల కిందటే అయిపోయిందని మరొహడన్నాడు. రెండ్రూపాయల లెక్కవవుతుంది, సాయంకాలం వొస్తే ఇస్తానని ఇంకొహడన్నాడు. పది రూపాయలు పోతేపోయిని సరే బాబూ సాయంకాలం అలానే ఒస్తాను అన్చెప్పి ఇంటికొచ్చేనన్నమాట.

(అని చెప్పి కొంతిసేపు ఏం మాట్లాడకుండా అటూ ఇటూ పచారు చేసేడు. ఆగేడు.)

# వచ్చేకాలం

సోమ : ఏవిఁటీ చెప్తున్నానూ?

చంద్ర : మందుకి మిమ్మల్ని సాయంకాలం రమ్మన్నాడు. సరేనని మీరింటికొచ్చేరు.

సోమ : ఒచ్చేనా! మరింక టూకీగా చెప్పేస్తా విను. మావాడలా ఏడుస్తున్నాడుకదూ. మావాడలా ఏడుస్తూనే ఉన్నాడు. నేనలా ఆలోచిస్తూ కూర్చుంటే, నీరసం చేతనో ఎంచేతనో ఎలా ఒచ్చిందో కాని నిద్దరొచ్చేసింది. పది నిమిషాలో, పావుగంటో, అంతకంటెక్కువ లేదు, అలా కునికేసేను. కునికేస్తే ఒళ్ళంతా కొరకుబారిపోతున్నట్టనిపించింది. గుబుక్కున లేచేను. లేస్తే గుండెలు దడదడ కొట్టుకుంటున్నాయి. కాళ్ళూ చేతులూ గడగడ వొణుకుతున్నాయి. చూస్తే ఇంట్లో ఏదో తేడా కనిపిస్తోంది. ఇందాట్లా ఇల్లులా అవుపించడం లేదు. ఏవిఁట్రా అనుకున్నాను. గదిలో సామాన్లన్నీ ఎక్కడివక్కడే ఉన్నాయి. చారేసిన వీధితలుపు చారేసినట్టుగానే ఉంది. చాప్మీద పడుక్కున్న మా ఆవిడ చాప్మీదే పడుక్కుంది. ఉయ్యాల్లో పిల్లడు ఉయ్యాల్లోనే ఉన్నాడు.

చంద్ర : అయితే మరేవిఁటయింది?

సోమ : హోరెత్తిపోయే సముద్రమంతా ఒక్కసారి చల్లారిపోతే ఎలా ఉంటుంది? అలా అంత నిశ్శబ్దంగా ఇల్లంతా గోరీలా ఉంది. ఇత్తడి చెంబు, పాలగిన్నె; నల్లపిల్లి; చింకిచాప; నూనెబుడ్డి; మందుసీసా; అన్నీ కూడా— బల్లమీద గడియారం, వాకిట్లో ఎండ సమేతం—అన్నిటితోనూ ఇల్లంతా కూడా చచ్చిపడున్నట్టు పడుంది.

చంద్ర : ఏం జరిగిందేవిఁటి?

సోమ : ఏం జరిగిందా? పిల్లడు ఏడవడం లేదు. ఏం చెప్మా అని ఉయ్యాలా దగ్గర కెళ్ళి చూసేను. చూస్తే మరేఁవుంది? నేను పడుక్కుని లేచేలోపల ఇంట్లోకి మృత్యువొచ్చి వెళ్ళిపోయింది. అదీ జరిగింది.

చంద్ర : అరె!

సోమ : అంతా అయిదు నిమిషాల్లో అతి నిశ్శబ్దంగా చడీ చప్పుళ్ళేకుండా జరిగిపోయింది. అంతేరా, అబ్బాయ్. చావుకాళ్లు చప్పుడు చెయ్యవు; చప్పుడు చెయ్యవు.

చంద్ర : అవును. చప్పుడు చెయ్యవు.

సోమ : సరి. అలా చూస్తే ఇంకేఁవుంది? ఇంకేం లేదు. ఛాప్టర్ క్లోజు. మరి మా ఆవిణ్ని లేపకుండా అక్కణ్ణించి వొచ్చేసి మంచంమీద కూర్చున్నాను. పిల్లడు చనిపోడం, ప్రాణం లేనట్టు ఇల్లంతా అలా పడుండడం చూస్తే నాకు చెడ్డ భయంవేసింది. నేకూడా అలా కొయ్యయిపోతున్నట్టనిపించింది. బుర్ర గింయ్యిఁ మంటోంది తప్ప వేరే ఆలోచనేవీఁ లేదు. మనసు కూడా మన్నయిపోతున్నట్టుగా అనిపించింది. భయంతో గిరత్తిపోయి అలా కూర్చుంటే అంతవరకూ ఎదురుగ్గా చింకిచాప్మీద పడుక్కున్న నల్లపిల్లి లేచి ఒళ్లు విరుచుకొని నడవలో కెళ్ళి పాలగిన్నె నాకుతోంది. గాలి ఒక్కసారి నెయ్యడంలో వీధితలుపు కదిలింది. మా ఆవిడ పడుక్కోడంలో అట్నుంచి ఇటు తిరిగి పడుక్కుంది. అవతల సందు మలుపులో కిళ్ళీకొట్టు దగ్గిర కాబోలు ఎవరో గ్రామఫోనుపాట పెట్టేరు. ఎక్కడో కాని పిల్లలంతా గొల్లుమనినవ్వేరు. దాన్తో మళ్లీ మామూలు ప్రపంచంలో పడ్డాను. పిల్లడు పోయాడని మనసుకి స్పష్టంగా బోధపడింది. దాన్తో నాకేవిఁటొచ్చిందనుకున్నావు? ఏవిఁటొచ్చిందో చెప్పుకో చూదాం?

చంద్ర : విచారం ముంచుకొచ్చుంటుంది.

సోమ : విచారవూఁ కాదు. ఏడుపూ కాదు.

చంద్ర : మరేవిఁటి?

సోమ : మరేవిఁటా? రిలీఫ్ అంటారే, అదీ; రిలీఫొచ్చింది. ఏదో ఒకటి తేలిపోయింది కదా అనిపించింది. అంతే కాదు. మరింక డాక్టర్ల కోసం పరిగెట్టక్కర్లేదు, మందులకోసం తిరగక్కర్లేదు కదా అనిపించింది. ఆఖరికి, హమ్మయ్య సాయంకాలం పది రూపాయలూ పోసి ఆమందేదో అది కొనక్కర్లేదు కదా అనిపించింది.

చంద్ర : నిజం?

సోము : నీ మీద ఒట్టు. నిజంగా అలా అనిపించింది. దాంతో ఏడ్చిపోయేనాలే. అంతవరకూ ఏడుపు రాలేదు. కాని ఆ మీదట నేలంతా దొర్లి దొర్లిపోయేను. "పిల్లడి ప్రాణంకంటే పదిరూపాయల డబ్బు లెక్కువైపోయాయా నాకూ? నా చేత ఎలాంటి బతుకులు బతికిస్తున్నావురా భగవంతుడా" అని గోల గోల పెట్టేసేను. నూరుగురు కొడుకులూ చచ్చిపోయినప్పుడు ఆ ధృతరాష్ట్రుడైనా అలా ఏడ్చుండడు. వీధంతా గగ్గోలెత్తిపోయింది. తలుపు తోసుకుని ఇంట్లోకి జనమంతా తిరగబడిపోయేరు. కాని నన్నెవడికైనా పట్ట శక్యమైందేనా? ఆ బతికిన రెండేళ్ళ బతుకులోనూ వాడికి తాగడానికి పాల్లేకపోడం, ఆడుకుండికి బొమ్మల్లేకపోడం, చలేస్తే బట్టల్లేకపోడం, జబ్బుకి మందుల్లేకపోడం, ఏడుస్తే అంత చిన్నవాడికీ దెబ్బలు తప్పకపోడం, ఆఖరికి వాడు చస్తేనే నయం అనిపించడం అన్నీ తల్చుకు తల్చుకుని రావణాయేడుపు ఏడ్చేసేను. అందుకురా బాబూ చెప్తున్నాను. జనరల్ కష్టమేం కాదు. చావంటే మనకదొక స్పెషల్ కష్టం. ఇప్పుడొప్పుకుంటావా?

చంద్ర : అవును.

[జగ్గన్న లోపల్నుంచి వచ్చాడు]

సోము : ఏవిఁరా అబ్బాయ్. ఇంటి కెళ్తున్నావా?

జగ్గ : వెళ్తున్నా.

చంద్ర : మరి నేనూ వెళ్ళొస్తానండీ.

సోము : నువ్వుండరా. (జగ్గన్నతో) నువ్వెళ్ళరా జగ్గన్నా.

[జగన్నాథం వెళ్ళిపోయేడు]

చంద్ర : నేనూ వెళ్ళాలండీ. ఆలస్యమైతే హోటలు కట్టేస్తారు.

సోము : కట్టేస్తే మా ఇంట్లో భోంచేదువుగాని.

చంద్ర : ఇంటికి పోదామంటే చాలా దూరం పోవాలి కూడాను.

సోము : అంతదూరంలో ఎక్కడుంటున్నావ్?

చంద్ర : పాత్రుడిగారితోట్లో కొత్తగా చిన్నిల్లు కట్టేరు, మూడంకి, అక్కడందులో ఉంటున్నాను.

సోము : ఊరి కొసనా?

చంద్ర : అవును ఊరికొక్కసే అది.

సోము : ఇగస్తా పరస్తా ఇక్కులేవు. ఇంట్లో సాయానికి రెండో మనిషిలేదు కాబోలు? ఎవడైనా ఒచ్చి తన్నినా దిక్కుండదే!

చంద్ర : ఆఁ మన్నెవడొచ్చి తంతాడ్లెండి.

సోము : అలా అనకు.

చంద్ర : ఆపూసెందుకు లెండి. మరినాకు వేళవుతూంది. పోతాను. కుటుంబయ్య గారితో చెప్పండి.

సోము : నీతో చిన్న విషయం మాట్లాడాల్రా, ఒక్కయిదు నిమిషాలు కూర్చుందూ.

చంద్ర : మరకేవో వేగిరం చెప్పండి.

సోము : ఆలా కూర్చో మరి.

చంద్ర : అలాగే కూర్చుంటా లెండి (అని కూర్చున్నాడు) మరి వేగిరం చెప్పండి.

సోము : ఏం లేదు. వెంకట్రటరణయ్యగ్గాని నీకు తెలుసు కదూ.

చంద్ర : బావుందండీ, ఆయనకి నేను సెక్రెటరీని కదా. ఆయన్ని తెలుసా అని అదొక ప్రశ్నా?

సోము : వాణ్ణి నీకు తెలుసా అని అడగడం లేదురా బాబూ, అలా కోప్పడతావేఁవిఁటి? బాగా తెలుసుకదా. అంచేత ఓ వుపకారం చేసి పెట్టమంటున్నాను.

చంద్ర : ఏవిఁటా ఉపకారం?

సోము మీవాడి దగ్గిర నాకో అయిదువందలప్పుప్పుట్టించాలి, అంతే.

చంద్ర అయిదు వందలా?

సోము అవును,

చంద్ర అప్పా?

సోము అప్పే.

చంద్ర లాభం లేదు.

సోము లాభం లేదూ?

# వచ్చేకాలం

చంద్ర : చెప్తున్నాకదూ? లాభంలేదు.

సోమ : ముందే అపశకునం పలకాల్రా? పోనీ ఏదో మార్గాంతరమైనా అనకూడదూ?

చంద్ర : అతని సంగతి తెలుసు కాబట్టి ముందే చెప్పేను.

సోమ : ఆపాటుపకారం చేసిపెట్టలేని వాడివి నువ్వేం సెక్రెటరీవిరా?!

చంద్ర : మీకూ నాకూ ఉపకారం చేసిపెట్టడానికి డబ్బుగణించేడనుకుంటున్నారేవిటి సెంక్రటరణయ్య?

సోమ : మరంత డబ్బా మూటకట్టుకు పోతాడా ఏవిటి?

చంద్ర : మూటకట్టుకు పోడు. పెద్దకోడలి షోకులికీ చిన్నకొడుకు గుర్రప్పందేలకీ మూటకట్టిందుతున్నాడు.

సోమ : వాళ్ళలా అయితే చావనిగాని, ముందు నేనడిగిన మాటేవిటంటావు? లాభంలేదంటే ఊరుకునేది లేదు.

చంద్ర : అయితే, మాద్దాంలెండి.

సోమ : మాదాంలెండి, గీదాంలెండంటే పనికిరాదు. ఇది చాలా జరూరు విషయం. నాకేవీ కరచరణా లాడ్డంలేదు. ఇప్పుణ్ణువ్వ కష్టపడి తీరాలి. ఊ...హూఁ అండానికి వీల్లేదు. తెల్సిందా?

చంద్ర . అయిదు వందలూ ఎందుకేవిటి? సంగతేవిటో కొంచెం చెప్పండిమరి.

సోమ : అపశకునం మాటలాడ్డం తిప్పించి. సంగతేవిటో వింటేనా మర్నువ్వా?

చంద్ర : వింటున్నా చెప్పండి.

సోమ : ఇప్పుడు, మావాడు జగ్గన్నున్నాడు చూసేవు కదూ? !

చంద్ర : చూసేను. అతని కేవిటొచ్చింది?

సోమ : వాడికేవీ రాలేదు. పెళ్ళీడొచ్చింది.

చంద్ర : పెళ్ళి చేస్తున్నారా?

సోమ : చేస్తున్నారా అంటే ఇప్పుడిప్పుడే చెయ్యడం లేదు. ఇహ ముందుకి చెయ్యాలి. సమ్మంధాలు రావడవేమో ఒస్తున్నాయి. అయితే పైకి చెప్పను కాని వాడి మనసులో చిన్న దోకటుంది.

చంద్ర : చిన్న దోకటంటే ఏవిటి?

సోమ : (కొంచెం నిమ్మదిగా) మాకుటుంబం కూతురు కావేశ్వరుంది కదూ?

చంద్ర : అవును, కావేశ్వరి.

సోమ : చిన్నదోకటుంటేసం అంటే, అదీ విషయం. బోధపడిందా?

చంద్ర : బోధపడింది.

సోమ : అదంతా నా అంచనాలేస్మా. వాడెక్కడా తేల్లేదు. ఎక్కడైనా అనేవు గనక.

చంద్ర : బావుందండీ. నేనెందుకూ ఎక్కడైనా అంటం?

సోమ : మాట వరసకన్నాను. అయినా వీడు చూస్తే మెట్రిక్కే చదివేడు (నెమ్మదిగా) అది చూస్తే కాలేజీలో ఇంటర్మీడియేటు చదువుతోంది.

చంద్ర : దానికేవిట్లెండి.

సోమ : దానికేం లే?! (నెమ్మదిగా) ఎక్కువ చదువైతే ఏలుకోలేడా ఏవిటి?

చంద్ర : బాగా చెప్పేరు.

సోమ : అయినా ప్రస్తుతప్పరిస్థితుల బట్టి దానికలా అనిపించచ్చాను.

చంద్ర : అవును మరి.

సోమ : అంచేత ఆ సంగతలా ఒదిలెయ్. ఇప్పుడు వాడిగురించి కాది తొందరంతాను.

చంద్ర : మరెవరి గురించి?

సోమ : వాడి తరవాత ఆడపిల్లుంది. దానికిప్పుడు పెళ్ళి చేసెయ్యాలి. మొన్నీమధ్యే దానికి పద్దెనిమిదో యేడు కూడా ఒచ్చింది. మరిం కాలస్యం చేస్తే మంచిదికాదు. పిల్లలకి మనం ఏ కాలాని కది సమకూర్చక పోతే ఇహ వాళ్ళంతట వాళ్ళు వెళ్ళి అది తెచ్చుకుంటారు. ఏది మంచిదీ అంటే నే చెప్పలేను. కాని మన మీద ఆ పూచీ కొంతవరకూ ఉందంటావా, లేదంటావా?

చంద్ర : ఉంది.

సోమ : అంచేత పెళ్ళి సమ్మంధం కుదుర్చుకొచ్చేను. పెళ్ళికొడుకు మంచివాడూ బుద్ధిమంతుడూను, ఆరోగ్యంగా ఉన్నాడు. నౌఖరీ చేసుకొంటున్నాడు.

చంద్ర : ఏంచేస్తున్నాడు ?

సోమ : ఎలాగో అలాగ కష్టపడి రెయిల్వేలో దూరేడు. ప్రస్తుతం ఫైర్‌మన్‌గా చక్రధర్‌పూర్లో ఉన్నాడు. ఏదో చిన్న నౌఖరీవే అనుకో. కాని ఎప్పటికో అప్పటికి డ్రైవరవకమాన్దు. విన్నావా ? మరిహా ఒచ్చే మాఘమాసంలోతప్ప ముహూర్తాల్లేవుట. ప్రస్తుతం నాదగ్గిర కొంతుందనుకో. కాని మరో అయిదువందలైనా ఉంటేగాని కథనడవదు.

చంద్ర : అయితే వెళ్ళి వెంకట్రమణయ్యని అడగమంటారా ?

సోమ : నువ్వెందుకూ అడగడం ? కావలసినవాణ్ని నే నేవెళ్లి డుగుతాను. నువ్వుకొంచెం రికమెండేషను చేసిపెట్టాలి. పక్కనుండి మద్దత్తియ్యి; చాలు.

చంద్ర : సరే చూదాం.

సోమ : ఇవాళ రాత్రి...

చంద్ర : మీరిప్పుడేవెళ్ళాలంటే కుదరదుస్మండీ.

సోమ : ఇవాళ రాత్రసలు కుటుంబయ్యని తీసుకొని వెళ్దామనుకున్నాను. మీ రమణయ్యకీ మాకుటుంబయ్యకీ కొంచెం దూరబ్బంధుత్వం ఉంది తెలుసుకదూ ?

చంద్ర : అవునెప్పుడో కుటుంబయ్యగారే చెప్పేరు.

సోమ : మావాడు పైపాటున్నవాడూ ఎక్కువ్వాడూను. వీడుమాస్తే—ఈయిల్లూ వాకిలీ ఈ సంసారం.—ఎలాఉన్నాడో చూసేవు కదూ. వాడు కొంపమీదఉన్నాడు. వీడు గోర్లలో ఏడుస్తున్నాడు. అయినా ఏదో వీణ్ని తీసుకుపోయి తంటాలుపడదామనుకున్నాను. వీడిస్థితిమాస్తే ఇప్పుడిలాఉంది. వీణ్నింత వేగిరం రమ్మనాలేవు. కదిలే పరిస్థితిలో లేనూలేడు. చూసేవా ? మరి భారమంతా నీదే.

[ఇంతలో కుటుంబయ్యొచ్చి మంచంమీద కూర్చున్నాడు.]

సోమ : ఓయ్, కుటుంబం, మరి మనవాడు శేఖరాన్ని తీసుకువెళ్తానోయ్.

కుటుం : ఎక్కడికి ?

సోమ : రమణయ్యదగ్గరికి.

కుటుం : ఎందుకూ ?

సోమ : ఇప్పుణ్నీకేదీ జ్ఞాపకం ఉండదుమరి; అయిపోయిందేదో అయిపోయింది; ఇహ విచారిస్తూ కూర్చోకు. తెలిసిందా?...ఓయ్ శేఖరం మరి మనం ఎప్పుడువెళ్దాం ?

చంద్ర : అతని కెప్పుడు వీలుగాఉంటుందో తరవాచ్చెప్తాను.

సోమ : తరవాతా గిరవాతా అంటే మర్లాభంలేదు. రేప్పొద్దున్నే ఒచ్చేస్తాను. నువ్వూ ఉండక్కడ.

చంద్ర : రేప్పొద్దున్నే ?

సోమ : మరాలస్యం ఎందుకూ ? వేగిరం పండో కాయో ఏదో తేల్చేసుకుంటే తీరిపోతుంది. ఏమంటావు ?

చంద్ర : సరి, మీ ఇష్టం.

సోమ : మరైతే రేపెన్నిగంటలకి రమ్మంటావు ?

చంద్ర : రేపుఉదయం సరిగ్గా పదిగంటలకిరండి. నేనూ అక్కడేఉంటాను.

సోమ : ఉండాలిస్మీ—మర్చిపోయేవుగనక.

చంద్ర : ఉంటాను. మీరుమాత్రం పదోగంటకల్లా రావాలి.

సోమ : రానూమరి ? ఇదేంనాపనా, మరోడిపనా ?

చంద్ర : కుటుంబయ్యగారూ, మరి నేవెళ్లొస్తాను. మీరలా బెంగపెట్టుకూర్చోకండి. కొంచెం ధైర్యంగాఉండాలి, మరి నేనొస్తాను.

కుటుం : (లేచినిల్చొని) వెళ్లి రానాయనా. మాటామంతీ ఆడకుండా ఇందాకా నిన్నిక్కడ కూచోబెట్టి వెళ్లిపోయేను. ఏమనుకోకు.

చంద్ర : ఎంతమాటన్నారు. మరొస్తాను.

సోమ : వెళ్ళొబాబూ వెళ్లు. రేప్పదిగంటలు. మర్చిపోకు.

[చంద్రశేఖరంగుమ్మంపై పునడిచేదుఅంతట్లో కామేశ్వరి వీధిలోనుంచి తిరిగివచ్చింది. వస్తూనే జోగుతూ గదిమధ్యకివచ్చి పడిపోయింది. ఆఁ ఆఁ అంటూ కుటుంబయ్యా సోమనాథమూ ఆమెదగ్గరికి పరిగెత్తేరు. శేఖరం గాభరాగా అక్కడికి వెళ్లేడు. తెర]

## 2

* * రమణయ్యగారింట్లో పెద్ద హాలు. అందులోనుంచే మేడమీదికి మెట్లు. హాలుమధ్య పాతవి కొన్ని సోఫాలున్నాయి. సోఫాల పక్కన చిన్న చిన్న బల్లలూ, వాటి మీద యిత్తడి, మార్బులు, దంతం వగైరాలవి చిన్న చిన్న ఫాన్సీ బొమ్మలున్నాయి. అడుగున తివాసే పాతది. గోడల్ని అద్దాలూ, కొన్ని పెద్ద ఫోటోలు. విక్టోరియారాణీ చిత్రం ఒకటి పెద్ద ఫ్రేంతో ఉంది. గోడగడియారం ఒకటుంది. ఉదయం తొమ్మిది గంటలు దాటింది. కుడిచేతివైపు బల్లమీద రేడియో ఉంది, పాత సెట్టు, ద్వారాలకి బ్లూ కర్టెన్లు ఉన్నాయి. సోఫాలమధ్య ఓ పెద్ద బల్ల వుంది. దానిమీద కొన్ని పేపర్లూ కాయితాలూ ఉన్నాయి. చంద్రశేఖరం సోఫాలో కూర్చొని చదువుతున్నాడు.

ఇంతలో మేడమెట్లు దిగి మోహనొచ్చేడు. వాడూ శేఖరం వయసువాడే. అందగాడేనని చెప్పాలి. మనిషిలో 'డాష్' ఉంది. చలాకీగా ఉన్నాడు. నిద్రలేచి అట్టేసేపయినట్టుగా లేదు. స్నానం గీనం చేశాడనుకో వీలులేదు.

మోహ : గుడ్ మాణింగ్ బాబ్.

చంద్ర : (పేపరు చదువుతూనే) గుడ్మార్నింగ్.

మోహ : (సోఫాలో కూర్చొంటూ) నరసన్నా, నరసన్నా!

నర : (లోనుంచి) చిత్తం బాబయ్యా (అని జవాబిచ్చి హాల్లోకి వచ్చేడు) ఏం బాబూ కాఫీయా?

మోహ : సిరఫ్ కాఫీ, టిఫినొద్దన్చెప్పు. ఏం శేఖర్ నీక్కూడాని టిఫిను కావాలా?

చంద్ర : కావాలా అని అడక్కుండా ఇచ్చిన్నాడు తీసుకుంటాను.

మోహ : పోరా, నరసన్నా, పంతుల్ని ఒక్కడేకాఫీ పట్రమ్మను. తెలిసిందా వెళ్లు. ('చిత్తం' అంటూ నరసన్న వెళ్లిపోయేడు) అడిగితే కాని అమ్మయినా పెట్టదుట.

చంద్ర : ఆఖరికి తల్లొచ్చి అడిగినా నువ్వేదీ ఇయ్యవు.

మోహ : అలాగే అనుకో, నాకొచ్చిన్నష్టమేం లేదు. అసలు నన్నొచ్చి అడగడానికి తల్లే లేదుగా. అంచేత ఆ ఇబ్బందేం లేదు.

చంద్ర : పిల్లొచ్చి బిచ్చం వెయ్యమంటే వెయ్యవు నువ్వు

మోహ వెయ్యను.

చంద్ర ఆడపిల్లొచ్చి అడుగుతే...

మోహ తప్పక వేసేస్తాను.

చంద్ర ఏవింటి వేసేస్తావు?

మోహ ఏదడుగుతే అదిచ్చేస్తాను.

చంద్ర ఒట్టినే ఇస్తావా?

మోహ : ఒట్టినే ఎందుకిస్తాను? ఏతత్కించిత్ ఎంకరేజిమెంటు ఉన్న పక్షంబుననే ఏదైననూ ఇచ్చెదగాక.

చంద్ర : నువ్వే ఇచ్చేవాడివి! అట్నుంచెవైనా ఒస్తే లాగుతావుగాని కాణీ ఒదుల్తావా?

మోహ : ఆల్ రైట్రో అబ్బాయ్! ఎందుకీ నూటిపోటీమాటలన్నీనూ. నేను స్వార్థపరుణ్ణి. సరిపోయిందా? నీకు తృప్తేనా?

చంద్ర : స్వార్థపరుడివని చెప్పకుతిరగడం అదోగొప్ప కాబోలు.

మోహ : నాచేత ఒప్పించడానికేకదూ నీ ప్రయత్న మంతాను. సరే. ఒప్పేసుకున్నాను. నాకూ (ఒళ్ళువిరుచుకుని) హిపాక్రసీ ఇష్టంలేదురా భాయ్. అదంతా ఓల్డర్ జెనరేషన్ గాళ్లది. ఇప్పుడందరం ఓపెన్లోకొచ్చేసేం. నగ్న స్వార్థయుగం ఇది.

చంద్ర : ఈ బట్ట విప్పుకున్న స్వార్థపరుల్ని మరీమాల్లేకుండా వున్నాం (పేపరు మడత పెడుతూ) రాత్రి ఏనగ్న నాట్యంబున కేగితివి. కళ్లలా పీక్కుపోయేయి.

మోహ : ఎందుకురా అబ్బాయ్ ఆ జలసీ? చాతనైతే నువ్వూ రాకూడదూ?

చంద్ర : వేసుకుందికి బట్టల్లేక నే వస్తున్నాను. అన్నీ ఉండీ నువ్వు గుడ్డవిప్పుకు గెంతుతున్నావు. నీ ఆహ్వానానికి మెనీ థాంక్స్. నా కక్కర్లేదు.

[పంతులు ట్రేలో కాఫీ పట్టుకువచ్చి బల్ల మీద పెట్టి వెళ్లిపోయేడు]

మోహ : (కాఫీ తాగుతూ) నీకీఉద్యోగం ఇప్పించడం నాదిరా తప్పూ.

చంద్ర : ఏం? ఏం చేసేన్నిన్ను?

మోహ : జీతం పుచ్చుకొని మరీ సతాయిస్తున్నావు నన్ను. ఆడింగ్ ఇన్సల్ట్ టు ఇంజరీ, ఆ పేప రిలా ఇయ్యి.

చంద్ర : చదవాలంటె ఇక్కడికొచ్చి పట్టుకెళ్లు.

మోహ : నువ్వియ్యవా?

చంద్ర : ఇయ్యను.

మోహ : నర్సనా, నరసనా!

నర : (లోనుంచి) చిత్తం బాబయా (అంటూ వచ్చేడు) ఏం బాబూ?

మోహ : ఆ పేప రిలా ఇయ్యి.

నర : ఏది బాబూ?

మోహ : ఆ సోఫామీద్ది.

[నరసన్న పేపరు తీసి మోహను చేతికిచ్చేడు. మోహను కాఫీ తాగేసి కప్పూ సాసరూ బల్లమీద పెట్టేసి పేపరు తీసుకున్నాడు. కప్పూ సాసరూ పట్టుకొని నరసన్న వెళ్లి పోయేడు.]

చంద్ర : ఇక్కడున్న పేపరు తీసుకుందికి నౌఖర్ని పిలిపించేవే కాని సోఫానుంచి కదిలేవు కాదు. నిన్నేమనాలి?

మోహ : ఏమీ అనొద్దు. నౌఖర్లుండగా నే నెందుకు కదలాలి?

చంద్ర : ఆడపిల్లల వెనకాల పరిగెట్టినప్పుడు ఎక్కడికి పోతుందో ఈ బద్ధకమంతా?

మోహ : ఒరేయ్ అబ్బాయ్!

చంద్ర : ఏమిటి?

మోహ : అస్మదీయ ప్రాణస్నేహితుడవే కదా నీవు?

చంద్ర : అయితే?

మోహ : అవును కాబట్టి మరింక అట్టే మాట్లాడకు. మంచువలె, నిప్పువలె గాంధీమహాత్మునివలె నువ్వూ పవిత్రమైన వాళ్లా మాట్లాడతా వేమిటి? ఒంటికంటివాడి భార్యారత్నం కోసం భారీగోడ దూకబోతే ఏమిటయిందో మర్చిపోయేవు కాబోలు.

చంద్ర : షటప్. మర్చిపోయేనని నేనన్లేను.

మోహ : సుబాహుడూ దీర్ఘకాలుడూ కర్రలుచ్చుకు వెంట తరలినప్పుడు నీ బద్ధకమంతా ఎక్కడికి ఎగిరిపోయిం దప్పుడు? మైలు రేసులో ఫస్టు ప్రైజు కొట్టేసేవు జ్ఞాపకం ఉందా?

చంద్ర : నన్ను నాకు తెలుసు కాబట్టే నిన్నూ నాకు తెలుసు.

మోహ : అందుకే అట్టే వాక్కుని చెప్తున్నాను.

చంద్ర : నేను తెలిసి బుద్ధి పూర్వకంగా ఎవడికీ అపకారం చెయ్యలేదు.

మోహ : మీ పల్లెటూళ్ళో నీకు అమ్మమ్ముందా?

చంద్ర : ఉంటే?

మోహ : అక్కడకెళ్ళి చెప్పు ఈ కబుర్లు. మిత్ర రత్నమా, అట్లు చేయుము.

చంద్ర : సరే చేస్తాగాని, నువ్వింకా రన్నింగ్ ప్రాక్టీస్ చేస్తూనే ఉన్నావు. సాధకం మానీ లేదు.

మోహ : చెప్తున్నా కదూ. నాకు హిపాక్రసీ ఇష్టం లేదు. ఆడపిల్ల, పందెపుగుర్రం, మందుసీసా

ఈ మాటున్న ఈ జీవికి ప్రాణంబులు. అవి లేనిదో ఈ ధనమేల, ఈ బ్రతుకేల?

చంద్ర : శాబాష్! మీ ఫాదర్‌తో అలా చెప్పు.

మోహ : భయంవేసనుకున్నావా? అవసరమైతే చెప్పి గల్ను.

చంద్ర : వాటికోసమే కాబోలింతాస్తే మీ నాన్న గడిస్త?!

మోహ : కుక్క దండక్కి నీకు నెలనెలా జీతం ఇచ్చుకోగా లేంది, వాటికి నాకిస్తేనేనా ఏమిటి ముప్పొస్త?

చంద్ర : ఏం కనిపించినా నా జీతమే కనిపిస్తుంది నీకెప్పుడూను. అలాంటివాడివి నా కెందుకిప్పించేవూ ఈ ఉద్యోగం?

మోహ : ఎలాగా ఎవడో ఒకణ్ని వేసుకు నేప్పుడు మనవాణ్ని వేసుకుంటే మంచిదనుకున్నాను. నీ పేరు చెప్పడం నాదే పొరపాటు. ఉపకారం చేసినందుకు దమ్మిడీ ఎత్తు విశ్వాసం లేదు నీకు. దవార్ట్ ఫెయిత్ లెస్.

చంద్ర : నేన్నీకు చెయ్యాల్సిన ప్రత్యుపకారం ఏమిటో కాస్త చెబ్దూ.

మోహ : సెక్రటరీవికదా! తండ్రిచేత ఓ నూర్రూపాయలైనా ఎప్పుడైనా కొడుక్కిప్పించగలిగేవా? నీ హితుడికి అవసరాని కెన్నడైనా ఓ పాతిక రూపాయలైనా ఇచ్చేవా? ఏ గుడ్డూ లేదు.

చంద్ర : కొడుకువి! వెళ్ళి నువ్వే అడగరాదూ?

మోహ : అన్నయ్యాకి సంచుల్సంచులు పమ్మిస్తాడు. పైవాడివి నీకైనా ఇస్తాడు. నాకంటే నెక్కళ్లేని దరిద్రవూం ఒచ్చేస్తుంది.

చంద్ర : నీమొహంచూస్తే ఇవ్వ బుద్ధిపుట్టదుమరి.

మోహ : అలాగే అలాగే. ఎందుకివ్వ బుద్ధిపుట్టదో చూస్తాను. అన్నయ్య కీమధ్య మళ్లీ ఎంత పమ్మించేడు?

చంద్ర : నీకెందుకూ ఆ విషయం?

మోహ : అన్నయ్యెక్కడున్నాడు?

చంద్ర : మీ అన్నెక్కడున్నాడో నీకు తెలీకపోతే నాకా తెలుస్తుంది.

మోహ : పెళ్లి కాకముందే వాడు నా అన్నయ్య. పెళ్లయాక ఒదినెకి మొగుడే. ఎక్కడున్నాడేమిటి?

చంద్ర : ఎక్కడికి వెళ్లేడో తెలుసుకదూ!

మోహ : అక్కడే ఉన్నాడా?

చంద్ర : అక్కడే ఉన్నాడు.

మోహ : ఏంచేస్తున్నాడు?

చంద్ర : సేనటోరియంలో ఉన్నాడు.

మోహ : సేనటోరియంలోనా!!

చంద్ర : అవును.

మోహ : గుడ్ గాడ్! ఏమిటొచ్చింది?

చంద్ర : ఏమిటొస్తే సేనటోరియంలో ఉంటారు?

మోహ : జబ్బా?

చంద్ర : జబ్బే! మీ ఫాదరు చెప్పలేదూ?

మోహ : ఫాదరు నాతో మాట్లాడితేగా!... ఏమిటి జబ్బు? సీరియసా?

చంద్ర : సీరియసేం కావట.

మోహ : ఏమిటి జబ్బసలు? టీ బీ వా, టైఫాయిడా న్యుమోనియావా?

చంద్ర : వివరాలు మీ ఫాదర్నడుగు. ప్రమాదంలేదని మాత్రం నేను విన్నాను.

మోహ : మైగాడ్! నాకింతవరకూ ఏమీ తెలీలేదే! అయినా అన్నయ్యకి బుద్ధిలేదు.

చంద్ర : ఏం?

మోహ : లేదంతే.

చంద్ర : ఆ లేకపోడం నీకేం తెలుసు?

మోహ : ఆ పెళ్లాడ్డంలో తెలిసేం లేదూ?

చంద్ర : పెళ్లాడ్డమే తప్పా?

మోహ : ఆఁ, తప్పే. వీడు సరిగ్గా ఫారిన్ వెళ్ళే సమయానికి ఆవిడగారికి వీడిమీద 'లవ్' పుట్టుకొచ్చేసిందట లవ్వు. వీడో ఫూలు కాబట్టి నమ్మేసేడు.

చంద్ర : నీకైతే లవ్ అక్కర్లేక పోవచ్చు.

మోహ : అక్కర్లేదు. మనకి లవ్ గివ్ జాన్తానై. ఆ వేషాలు మందగ్గిర కుదరవు.

చంద్ర : నువ్వు సినికల్ ఫిలోవి. అలానే మాట్లాడతావు మరి (అంటూ రేడియోవైపు వెళ్లేడు.)

మోహ : సినికలే అనుకో. నాకేం భయంలేదు. కాని ప్రేమా గీమా మందగ్గిర పనికిరాదు. ఆ పేరు చెప్పి మన్నెవర్తే టోపీ వెయ్యలేదు.

చంద్ర : నీలా చాలామంది చెప్పేరు కబుర్లు.

మోహ : మన వ్యవహారం మందంతా ప్యూర్లీ బిజినెస్ లైక్. ప్రేమా గీమా జాన్తానై.

చంద్ర : నివంతా కిరాయి వ్యవహారం.

మోహ : అది వేరు. అక్కడి కక్కడ వ్యవహారమంతా ఫైసలైపోతుంది. ఆ తరవాత నువ్వెవరో నేనెవరో! చీకూ చింతా ఏమీ ఉండదు. ఈ ప్రేమించే ఆడవాళ్ళయినా నిన్నూ నన్నూ చూసి ప్రేమిస్తారనుకున్నావా? ఏమిటి? మా క్లబ్బులో ముసలాడు బ్రహ్మచారిగా వుడున్నాడు.

చంద్ర : ఎవరు, బట్టతల బ్రహ్మయ్యేనా?

మోహ : నీకూ తెలుసునేమిటి వాడు? వాడే.

చంద్ర : వాడూ ఓ బ్రహ్మచారే, నువ్వూ ఓ బ్రహ్మచారివే!

మోహ : సరే వాడేవేం వెధవపనులు చేస్తే మనకేల? వాడు చెప్పింది మాత్రం నిజం.

చంద్ర : ఏ స్టేషన్నించీ రావటంలేదు గుడ్ మ్యూజిక్కు.. —ఆఁ, ఏమిటంటాడూ బట్టతల బ్రహ్మయ్య?

మోహ : అల్టిమేటుగా ఆడదానికి ఇల్లూపిల్లలూ కావాలంటాడు.

చంద్ర : అలా కావాలంటం తప్పా?

మోహ : తప్పో రైటో నాకు తెలీదు కాని ఆడపిల్ల వాటికోసమే. ప్రేమ-ట్రిక్కంతా మన మీద ప్రయోగిస్తుంది. హాయిగా వుండడానికి పెద్దమహలూ, బాంకులో దాచుకొని వాడుకుందికి బాగా డబ్బూ, ఊరంతా తిప్పడానికి కొత్త కారూ ఉంటే ఆడదానికి మన మీద మూడువందల రెట్లు పెరిగిపోతుంది ప్రేమ ప్రే...మ.

చంద్ర : నీలాటివాళ్ళనే ఎవర్తో ఒకర్తె ఎప్పుడో అప్పుడొచ్చి చల్లగా బుట్టలో వేసి దాముకు పట్టుకు పోతుందిరా అబ్బాయ్.

మోహ : అదెన్నటికీ కుదరదు గాని — ఒ గ్రెబ్రెవర్ మొన్నీమధ్య గొప్పతిసువొచ్చింది.

చంద్ర : ఇదిమర్లాభంలేదు. (అని రేడియో ఆపేసి నిల్చుండిపోయి) ఏవిఁటి తగువు?

మోహ : కొంప మునిగిపోవల్సింది.

చంద్ర : ఎవరికొంప, ఎందుకు మునిగిపోవల్సొచ్చింది?

మోహ : ఎవరికొంపో మునిగితే నాకేం కావాలి? నాకొంపే?

చంద్ర : ఏంజరిగిం దేవిఁటి?

మోహ : చెప్తాను. ఇప్పుడు కాదు, సాయంకాలం చెప్తాను. వాన్నొస్తాడో ఏవిఁటో (అంటూ మేడమెట్లవైపు చూసేడు.)

[ఇంతలో వీధివైపునుంచి గప్పునగదిలోకి ప్రవేశించింది కామేశ్వరి. వస్తూనే "మోహన్ బాబూ" అని ఆత్రుతతో పిల్చింది. నేనూ ఆశ్చర్యపోయేను, మోహనూ ఆశ్చర్యపోయేడు. వాడు వంటనే లేచి నిల్చుండిపోయేడు. వాళ్లో ఎక్కువగా గాభరా కనపడుతోంది. సోఫాని గట్టిగా ఓచేత్తో పట్టుకొని నిల్చున్నాడు. కామేశ్వరి చేతిలో పుస్తకాలున్నాయి. చెవుల్ని దుద్దులు తప్ప ఆమెకి మరే ఆభరణాలూ లేవు. ఆ హాల్లో ఆమె మిక్కిలి బీదగానూ దీనంగానూ కనిపిస్తోంది. ఆమెనన్ను చూడలేదు. మోహన్నే చూస్తోంది]

కామే మోహన్ బాబూ!

మోహ ఏవిఁటి? ఎందుకు?

కామే : మీకోసవేఁ ఒచ్చేను.

మోహ నాకోసం...ఎందుకూ?

కామే మీకోసం...ఎందుకా?

మోహ ఆఁ ఎందుకనే అడుగుతున్నాను (అని ఆమెకి దగ్గరగా వచ్చి) మరో మనిషున్నాడు చూసుకో (అని చెప్పినట్టుగా నాకు అస్పష్టంగా వినిపించింది) ఎందుకమ్మాయ్ ఒచ్చేవూ?

కామే : మీరు కనిపించడం మానీసేరు మోహన్ బాబూ!

మోహ : నేనెందుకూ కనిపించడం? ఏం కావాలి? మీనాన్న బావున్నాడా? ఏవిఁటిసంగతి?

కామే : (ముందుకు నడిచింది. మోహన్ చేతులు పట్టుకుందామని కాబోలు. ఆమె చేతిలోంచి జారి కిందపడ్డాయి పుస్తకాలు. మోహను వెనక్కి తగ్గేడు) నాగ్గాభరాగా ఉంటోంది మోహన్ బాబూ. పదిరోజులయి కనిపించడం మానీసేరు. సంగతేవిఁటో నాకు

తెలీడం లేదు. రోజూ ప్రతిరోజూ మీకోసం చూస్తున్నాను. దార్లో ఎక్కడా కనిపించరు. ఏడుగంట్లకి పార్కుకొచ్చేవారు. అక్కడికీ రాడం మానీసేరు. నాకెందుకో గాని భయవేస్తోంది. మాటిమాటికీ కళ్ళు చీకట్లు కమ్ముతున్నాయి. ఏ త్తుల్చుకున్నా ఏడుపొస్తోంది. మోహన్‌బాబూ మాతిమ్మకు నిన్న చచ్చిపోయేడు. మా కొక్కడే తమ్ముడు. మాతిమ్మడు చచ్చిపోయేడు.

మోహ : దానికి నే నేంచేసేది. ఇక్కడకెందుకూ రాడం ?

కామే : ఇంట్లో కూర్చుంటే నాకు దిగులుగా ఉంటోంది. నాకెవిటో భయంగానూ గాభరాగానూ ఉంటోంది. మా అమ్మకి ఒంటిమీ తెలివి లేదు. మా నాన్న మతిపోయి నట్టుగా తిరుగుతున్నాడు. మా చెల్లి ఏడుపే ఏడుపు. మా ఇల్లంతా పట్టపగలు కటిక చీకటిగా ఉంది మోహన్‌బాబూ! పట్టపగలే చీకటిగా ఉంది.

మోహ : ఏవిటే మాటలన్నీ ? నాకేం బోధపడ్డం లేదు.

కామే : నాకు ఒంట్లో బాగోడం లేదు.

మోహ : ఏవిటొచ్చింది ?

కామే : ఏం చెయ్యాలో ? నాకేం బోధపడకుండా ఉంది మోహన్‌బాబూ, నా గ్గాభరాగా ఉంది. మాటిమాటికీ వమనవయ్యేట్టుగా ఉంటోంది. వమనొస్తుంటే ఒళ్లుతూగుతోంది. ఎవరితో ఎలా చెప్పుకోడవో నాకు తెలీడం లేదు. మీరు కనిపించడం మానీసేరు. మా ఇంట్లో నే నేం చెప్పలేను. ఎలా చెప్పగల్ను ? మీరే ఆలోచించండి. మీతో చెప్దావంటే మీరు కనిపించరు. చెప్పక తప్పదు ఇహ చెప్పక తప్పదు.

మోహ : ఏవిటలా మాట్లాడుతున్నావ్ ? మతిపోయిందివిటి ?

కామే : నాకు మతిపోతోంది మోహన్‌బాబూ, నేనయి చెప్పలేను. చెప్పలేను. మీరే చెప్పాలి. మీరే చెప్పి వేగిరం నిశ్చయం చేసెయ్యాలి. ఆలస్యం చేసి లాభం లేదు.

మోహ : ఏవిటి నిశ్చయం చెయ్యాలి?(వాడిలో గాభరా తగ్గింది. చేతులు కట్టుకొని నిల్చున్నాడు. ఏదో నిశ్చయానికి వచ్చినట్టుగా ఉన్నాడు.)

కామే : ఏవిటి నిశ్చయం చెయ్యాలి? ముందు మీ నాన్నగారితోనూ మా నాన్నగారితోనూ చెప్పాలి. చెప్పి నిశ్చయం చేసేయండి. వేగిరం...

మోహ : ఏవిటి నిశ్చయం చెయ్యాలి ?

కామే : మోహన్‌బాబూ ! పెళ్లి కాకపోతే నాకింక చావు...చావుతప్ప మరిగత్యంతరం లేదు.

మోహ : ఎవరికి పెళ్ళి ? ఎవరికి ఎవరితో పెళ్ళి ?

కామే : పెళ్ళెవరికా ?

మోహ : ఎవరిక నే అడుగుతున్నాను !

కామే : అలా మాట్లాడుతున్నా రేవిటి మోహన్ బాబూ !

మోహ : ఎలా మాట్లాగుతున్నాను ? నీకు నచ్చినట్టుగా మాట్లాడ్డం లేదు. ఏం ?

కామే : అలా చూస్తున్నారేవిటి ? అలా ఉన్నారేవిటి?

మోహ : నే నెవర్ననుకుంటున్నావో ఏవనుకుంటున్నావో పిల్లా ! నువ్వే కాదు గట్టిదానివి. వీడూ గట్టివాడే ! నీకంటే గట్టివాడు. తెలిసిందా ?

కామే : అదేవిటలా మాట్లాడుతున్నారు? నాకేం తెలీడం లేదు మోహన్‌బాబూ, నాకేం తెలీడం లేదు.

మోహ : అబ్బే! చాలా అమాయకురాలివి, నీకేం తెలీదు. ఏం?

కామే : మోహన్ బాబూ! (అని ఇందాకటి కంటే గాబరాపడింది. అమితంగా ఆశ్చర్యపోతుంది)

మోహ : శేఖర్! చూసేవా తమాషా?

చంద్ర : ఎవరి తమాషా?

కామే : (మొదటిసారిగా ఆగదిలో శేఖర్ను చూసింది. నిద్దరలేచి కలో నిజవో తెలుసుకోలేని మనిషిలా నిల్చుండి పోయింది. ఆమెకేమీ అర్థం కానట్టుగా ఉంది.)

మోహ : (కామేశ్వర్ని చూపించి) ఈ తమాషా! చూసేవా? వీళ్ళు ఫాదరు మాకేదో డిసెంట్

తిరిగేవను. పోనీకదా అని చేరదీసి ఏదో నౌకరీ ఇచ్చేడు మా ఫాదరు. ఈ అమ్మాయి కాలేజీలో ఏదో చదువుతోంది. ఏం టమ్మాయ్ చదువున్నావ్? ఇంటరు కాబోల్చదువుతోంది. రెండు మూడుసార్లు కాబోలు పోనీకదా అని పలకరించేను. అంతేనమ్మా. ఎలా కథల్లేసి ఎంత పన్నాగం పన్నేస్తోందో చూడు.

కామే : మోహన్ బాబూ?

మోహ : బాబూ గీబూ అని పిలవకు నన్ను. పిల్లట! పెళ్ళి! గుడ్ గాడ్! ఏం నాటక మేన్నాటకం! ఇలాంటి బ్లాక్ మేల్ కి లొంగే రకంకాదు పిల్లా నేను!

కామే : మోహన్ బాబూ!

మోహ : నీకూ నాకూ ఎలాంటి సంబంధమూ లేదు. నిన్ను ముట్టుకోనైనా లేదు. తెలిసిందా? నీలాటివాళ్లు చాలామంది రావాలి నాకు టోపీవెయ్యాలంటే.

కామే : మోహన్ బాబూ! మోహన్ బాబూ (అంటు వాడిదగ్గరకి నడిచింది. వాడు రెండడుగులు వెనక్కి వేసేడు)

మోహ : అక్కడే ఉండు. దగ్గరకి రాకు.

కామే : దగ్గరకి రానివ్వరా? మీరే నన్ను దగ్గరకి రానివ్వరా? అయ్యో (తలచేత్తో పట్టుకొంది) తల తిరుగుతోంది; నాకు తల తిరిగిపోతోంది మోహన్ బాబూ!

మోహ : త్వరగా ఇంటికి వెళ్ళడం మంచిది.

కామే : నన్నిప్పుడిలా నట్టేట్లో ఒదిలేస్తారా మోహన్ బాబూ?!

మోహ : ఈ మాటింక కట్టిపెట్టు.

చంద్ర : మోహన్! నీమాటలింక కట్టిపెట్టు

కామే : నాకొంట్లో బాగలేదు మోహన్ బాబూ! బాగలేదు. కళ్లు మండిపోతున్నాయి. నుదురు పేలిపోతోంది. నే చచ్చిపోతాను... మోహన్ బాబూ నన్ను చంపేకండి. ఈ సంగతెలిస్తే నాన్న పొడుచుకు చచ్చిపోతాడు. అమ్మ నూతిలో పడుతుంది. మా చెల్లెలేడుస్తోంది. అది నన్నొదిలుండలేదు. మోహన్ బాబూ నన్నొదిలుండలేదు. నన్ను చంపేకండి.

మోహ : ఏవిటే అల్లరి! నేను లొంగే రకంకాదు. నన్ను ముట్టుకోవద్దు. నువ్వెవరో నాకు తెలీదు. నువ్వు చెప్పిందంతా అబద్ధం. ఇక్కణ్నించి మర్యాదగా వెళ్లిపో వింటున్నావా? వెళ్ళిపో!

చంద్ర : ఏవిటి మోహన్! ఆడపిల్లనలా దబాయిస్తున్నావ్? అబద్ధం ఎవరాడుతున్నారో నాకు తెలీదనుకున్నావా?

మోహ : యు జస్ట్ షటప్!

చంద్ర : షటప్పూ గిటప్పూను! మూతిమీ త్తన్నే నాల్లేక.

కామే : చంద్రశేఖరంగారూ! మీరైనా చెప్పరూ? నన్నిలా ఇప్పుడొదిలేస్తే నేనేం చెయ్యాలి, మీరైనా చెప్పండి శేఖరంగారూ! నా అవస్థలన్నీ మీకు తెలుసు. ఇప్పుడీ సంగతి ఇంట్లో తెలిస్తే మాయిల్లు కూలిపోనా తప్ప ఇంకేవీ లేదు. అడగండి శేఖరం గారూ ఆయన్నడగండి. ఎన్ని కబుర్లు చెప్పేరో, ఎంత నమ్మించేరో ఆయన్నడగండి. ఇంత అధర్మవా శేఖరం గారూ; ఇంత అధర్మవా? ఆయనే ఇప్పుడిలా చేస్తే నాకింకేద్దారి? నూతిలో దూకాలి? నిప్పంటించుకోవాలి. విషంతాగాలి, ఉరో సుకోవాలి, అవే దార్లు నాకు. అవే, మోహన్ బాబూ నాకవే దార్లు. నన్ను చంపేకండి; మీకు పుణ్యం వుంటుంది. మీరు నయ్యోబ్బా బతకండి. నన్ను బతికించండి. మా చెల్లె లేడుస్తోంది మోహన్ బాబూ. మా చెల్లెల్ని చూసైనా నన్ను బతికించండి. (అంటూ సోఫా ఓచేత్తో పట్టుకొని మోహన్కి దగ్గరగా కూర్చుండి పోయింది కామేశ్వరి)

చంద్ర : (కిందపడ్డ పుస్తకాలు తీస్తూ) లే, కామేశ్వరీ, లేచి నిల్చో.

కామే : శేఖరంగారూ, మీరే నాకిప్పుడు తల్లీ తండ్రీను. నన్ను కాపాడరా శేఖరం గారూ కాపాడరూ?

చంద్ర : ముందు లేచి నిల్చో.
(మోహను వెనక గదిలోకి వెళిపోయేడు)

కామే : అయ్యో, మోహన్ బాబూ! మోహన్ బాబూ...

మోహ : (వెనకగది గుమ్మందగ్గర నిల్చున్న నరసన్నని రెక్క పట్టుకులోనికి తీసుకు పోయేడు)

కామే : నన్నిలా ఒదిలేస్తారా? ఒదిలేసి వెళ్లిపోతారా మోహన్ బాబూ, వెళిపోతున్నారా?

చంద్ర : వెళ్లిపోయేడు. ఇప్పుడు మరేం లాభంలేదు. లేచి నిల్చో. (ఆమె లేవలేదు. సోఫాకి ఆను కొని అలానే కూర్చుండి పోయింది.) కామేశ్వరీ! నే చెప్పేమాట వింటావా? (ఆమె కదల్లేదు) వినవా?

కామే : నేనేం చేసేది శేఖరం గారూ? నేనేం చెయ్యాలం?

చంద్ర : నామాట విని ఇప్పుడు తిన్నగా ఇంటికి వెళ్ళిపో. నీకేం ఫరవాలేదు. మోహన్ని దారికి తీసుకొచ్చే పూచీనాది. హామీ ఇస్తున్నాను సరా?;

కామే : (కళ్లు తుడుచుకొంటూ) ఇలా నేను భూమిలోకి దిగిపోయినా బావుణ్ను శేఖరం గారూ!

చంద్ర : ఆ మాటలలా వుంచి ముందులేచి నిల్చో, (కామేశ్వరి కదిలింది) నరసన్నా, నరసన్నా (కామేశ్వరి లేచి నిల్చుంది) ఈ పుస్తకాలు పట్టుకో. (పట్టుకొంది.)

నర : (ప్రవేశించి) ఏంబాబూ?

చంద్ర . అర్జంటుగా వెళ్లి రిక్షా తీసుకురా. ఈ పక్క గేటు దగ్గిరకి తీసుకురా. వేగిరంవెళ్లు.

నర : చిత్తం (అని వీధివైపు వెళ్ళేడు)

చంద్ర : కామేశ్వరీ! ఇప్పుడు మరిక కాలేజీకి వెళ్లకు. తిన్నగా ఇంటికి వెళ్లిపో. మరేం ఫరవాలేదు.

కామే : నాకు మరింకేవైనా ఫరవాలేదు శేఖరం గారూ.

చంద్ర : అలా అధైర్యపడొద్దనే చెప్తున్నది. నువ్వేం బెంగ పెట్టుకోవద్దు. తొందరపడి ఏపనీ చెయ్యొద్దు. వాళ్లి నాన్న ఇంట్లో ఉన్నాడని భయపడి అలా మాట్లాడుంటాడు మోహను. నేను సంగతింతా వాడితో మాట్లాడతాను. నీకొచ్చిన ఫరవా మరేంలేదు. ఇప్పుడు ఇంటికి వెళ్లు.

కామే : నే నెక్కడకెళ్లినా ఒకటే.

చంద్ర : ఎక్కడ కెళ్ళినా ఒకటే అంటే అదెలా అవుతుంది? నువ్వింటికి వెళ్లకపోతే మీ చెల్లెలేమవుతుందో ఆలోచించుకున్నావా?

కామే : (జవాబు చెప్పలేదు)

చంద్ర : మీ చెల్లెలికోసమైనా నువ్వు ధైర్యంగా ఉండాలి. తొందరపడకూడదు. తెలిసిందా?

కామే : (అవునన్నట్టుగా తల ఊపింది)

చంద్ర : మరి నువ్వు వెళ్లాలి. ఇప్పుడిక్కడకి పదిగంటలకి సోషలిస్టు వాళ్ళు (?) ఒస్తారు. ఇహ ఒస్తాడో ఏమిటోకూడా. మాసేడంటే ఎందుకొచ్చేవో చెప్పేదాకా ఒదల్డు.

నర : (హాల్లోకి ఒచ్చి) రిక్షా ఒచ్చింది బాబూ.

చంద్ర : కామేశ్వరీ వెళ్లు, నే చెప్పిన ప్రకారం చెయ్యి. (మోహను కనిపిస్తాడేమోనని కాబోలు ఇంట్లోకి ఓసారి చూసి నెమ్మదిగా వెళ్లింది కామేశ్వరి. ఆమె గుమ్మందాకా వెళ్లేక ఆగమన్నాడు)

చంద్ర : కామేశ్వరీ ఆగు. (ఆమె ఆగింది) తొందరపడి ఏపనీ చెయ్యనని నాకు మాటిచ్చినట్టేనా?

కామే : (అవునన్నట్టుగా తల ఊపింది)

చంద్ర : మరి వెళ్ళు. తరవాతొచ్చి మాట్లాడతాను.

[కామేశ్వరి వెళ్ళింది. ఆమె వెనక నరసన్న కూడా వెళ్ళి తిరిగి వచ్చేడు. శేఖరం హాల్లో పచారుచేస్తున్నాడు.]

చంద్ర : ఏం నరసనా! వెళ్లిందా?

నర : వెళ్లేరండి (అంటూ దగ్గరగా వచ్చి) చిన బాబుగారు చేసిన పనుండి...('చాలా తప్పు' అన్నట్టుగా ముక్కు మీద వేలు వేసుకున్నాడు. 'అన్నిటికీ పైన ఆ భగవంతుడే ఉన్నాడు' అన్నట్టుగా చేతులుజాచి పైకి తలెత్తి చూసేడు. అతగాడికో నమస్కారం చేసేడు)

మోహ : (ప్రవేశిస్తు) ఎవరికిరా దండం పెడుతున్నావూ ?

(నరసన్న జవాబివ్వకుండా చురచుర చూస్తూ ఇంట్లోకి వెళ్ళిపోయేను.)

చంద్ర : నిన్ను పుట్టించినందుకు భగవంతుడికి.

మోహ : ప్రస్తుతానికొచ్చె వెళ్లిపోయిందా? చెప్పు, నేనూ ఒహాటి పెట్టుకుంటాను.

చంద్ర : వెళ్ళిపోక ఏం చేస్తుంది. కొట్టగల్దా తిట్టగల్దా?

మోహ : వెళ్లిపోయింది కదా! థాంగ్ గాడ్!

చంద్ర : (కోపంగా) థాంక్ గాడ్!

మోహ : ఏవిట్రోయ్? మన్య నీకెందుకంత కోపం?

చంద్ర : కుటుంబయ్య గారని ఒక అమాయకు డున్నాడు. ఆయన నీకు బంధువూ నాకు నాకు స్నేహితుడూను.

మోహ : అహోఁ అలాగా? నాకింతవరకూ తెలీ దుసుమా! అయితే ఇప్పుడు వెళ్లిన పిల్లేవిటవు తుంది నీకు?

చంద్ర : నువ్వేవిఁటవుతావు నాకు?

మోహ : స్నేహితుణ్ని

చంద్ర : అయితే ఆమె నాస్నేహితుని భార్య కాబోతుంది.

మోహ : తమాషాగా మాట్లాడ్డానికేం గాని, బ్రదర్, ఇప్పుణ్ను వువ్వ నాకు సలహా చెప్పాలి. ఇప్పుడు చమత్కారంగా కబుర్లు చెప్పి పమ్పించేసేవు, చూసేవా? అలాగే నాకేదో ఉపాయం చెప్పి దారి చూపించాలి. లేపోతే లాభం లేదు.

చంద్ర : ఎందుకోసం నీ కుపాయాల్చెప్పడం?

మోహ : ఏదో విధంగా తగువు సెటిల్చేసి పారే య్యాలి.

చంద్ర : సెటిల్చేసి పారెయ్యాలా?

మోహ : అవున్రా బాబూ! సెటిల్చేసేస్తివా ఇహ మీదట త్వదీయ అనుంగు చెలికాడను కాను, అనుచరుడను. కృతజ్ఞుడను.

చంద్ర : ఏవిధంగా సెటిల్చేసి పారేయాలంటావ్?

మోహ : ఏదో విధంగా చేసిపారేరా బాబూ. పారే స్తివా ఇహమీదట బుద్ధిగా ఉంటాను.

చంద్ర : బుద్ధిగా ఉండడం అంటే?

మోహ : పెళ్లికానివాళ్లవైపు కన్నెత్తి చూణ్ను.

చంద్ర : శాబాష్.

మోహ : చెప్తున్నా కదూ! బుద్ధొచ్చింది. ఇపుణ్ని న్నెలాటి గోతులో దించిందో చూడు. పెళ్లిచేసుకోవాల్ట పెళ్లి! గుడ్ నెస్ గ్రేషస్! ఆమాట వినేసరికి—చెప్తేనమ్మవు — 'హా' అని మూర్ఛపోవాలనిపించింది. గుండె ధైర్యం ఉంది కాబట్టి నిలబడ గలిగేను.

చంద్ర : నీకైతే పెళ్లక్కర్లేదు. కాని ఆమె నింగంటి అవస్థలో తెచ్చిపెట్టేవు కదా! ఇప్పుడాపిల్ల గతేం కాను?

మోహ : దానికేఁ వుంది? ఏడాక్టర్నో బతిమాలుకుంటే తీరిపోతుంది. ఇన్ఫాక్ట్, నాకో మంచివాణ్ని బాగా తెలుసు అంతా గప్‌చిప్‌గా జరిపించే వచ్చు.

చంద్ర : అంతేకాని పెళ్లాణ్నంటావు?

మోహ : పెళ్లా? నాకెందుకురా భాయ్ ఇప్పుడు పెళ్లి?

చంద్ర : మరెప్పుడు కావాలి?

మోహ : పెళ్ళి, పెళ్లాం, పిల్లలూ! నాకక్కర్లే దురా బ్రదర్! ఏదో ఇలా గోముల వెళ్లనీ! ఎప్పుడో అప్పుడు ఏదో విధంగా కొంత లాభిస్తుంది అంటే అప్పుడు చూసుకుందాం పెళ్లిమాట! ప్రస్తుతం కథ నడిచిపోతూందికదా?!

చంద్ర : పెళ్లాడితేనే తప్ప వీల్లేదని ఆపిల్ల అల్లరి పెడితే ఏం చేస్తావు?

మోహ : పెళ్లాణ్నని స్పష్టంగా చెప్పేస్తాను. ఇప్పుడు చెప్పేసేనుకదూ?!

చంద్ర : పెళ్లాడతానని నువ్వు చెప్పేవా లేదా? అని అడుగుతారు కోర్టువారు.

మోహ : అడిగనీ! లేదని చెప్పేస్తాను.

చంద్ర : పెళ్లాడతానని నువ్వామెతో అన్లేదూ? నిజం చెప్పు.

మోహ : అన్లేదు.

చంద్ర : మరేవిఁటన్నావు? "నిన్ను పెళ్లి చేసుకోడం మాత్రం ఎన్నటికీ చేసుకోను. అయినా రా నా దగ్గిరికి రా" అంటే "సరే, నవ మోహనా కారా" అన్చెప్పి ఒచ్చి నీ ఒళ్లో వాలిపోయిందా?

మోహ : (విరగబడి నవ్వేడు) బాగా అడిగేవురా అబ్బాయ్ బాగా అడిగేవు. కాని అలా జరగ

లేదురా. ఇందాట్లా చెప్పేను చూసేవా, ప్రేమాగీమా జాంతానై అని. ఈపిల్ల కొచ్చిన్లో మాత్రం ప్లేటు కొంత మార్చాల్సొచ్చింది. పూర్తిగా ఇనో సెంటు గర్లేమో ననుకొని ప్రేమా గీమా అంటూ ఏవోగఫ్ఫీకులు కొట్టేను. అసలామాట లుపయోగిస్తేనే కాని లొంగింది కాదు. పెళ్లాడతానూ అని మాత్రం నేనసలికి అన్లేదు. "ప్రేమించుచున్నాను. మనసారా ప్రేమించుచున్నాను" ఇలాంటి వెధవ మాటలు ప్రయోగించడం మాత్రం బహుళముగా ప్రయోగించితిని. అదియే నా కొంప ముంచినది.

చంద్ర : నీకంతా తమాషాగా కనిపిస్తోంది. ఏం? ఇప్పుడాపిల్ల ఉరేసుకు ఛస్తే ఏం చేస్తావు?

మోహ : ఆఁ! చస్తుంది! నేనూ చస్తాను.

చంద్ర : నువ్వూ నేనూ ఇంత వేగిరం చావ్వుఁ. ఇంకా ఎందరి కొంపలకి నిప్పంటించాలో!

మోహ : అలాగే నిప్పంటించేదాం గాని, ఒరే అబ్బాయ్, ఎవరో ఒస్తున్నారు తరవాత మాట్లాడదాం. ఏం? (అంటూ మేడ మెట్లెక్కి వెళ్లిపోయేడు)

(సోమనాథం ప్రవేశించేడు వీధివైపునుంచి)

సోమ : ఏమిరా శేఖరం బాబూ! ఉన్నావు కదా.

చంద్ర : రండి కూర్చోండి.

సోమ : (సోఫా మీద కూర్చుంటూ) ఉండవేమో ననుకొంటూ ఒచ్చేను.

చంద్ర : ఉంటానని చెప్పేకదా! ఎందుకుండనూ?!

సోమ : ఏమో ఎవరు చెప్పేరు. గుమ్మం దిగే సరికి అమోఘమైన శకునం—ఒంటి బ్రాహ్మడు—అందులోనూ నీలమేఘశ్యాముడు. వాడి వెనక తిలఘాతకి—అందులోనూ పూర్వ సువాసిని. ఆతరవాత యమవాహనం.

చంద్ర : మంచి శకునాలే!

సోమ : మంచివా మరీ మంచివా! యాభైమందిని ఏట్లో కలిపేడానికి చాల్ను; అంతిమంచివి. దాని మీదట—ఇహ సరి, నేనుదాట్లో ఏ కారు కిందోపడి ఆస్పత్రికి పోవడమో లేక నువ్వు చచ్చి నీ శవాన్ని నా కొడుకుగా తీసుకు రావడమో జరుగుతుందనుకున్నాను. సరి, అటువంటిదేం జరగలేదు. అంచేత శకునంలో ఏం లేదని తేలిపోయింది.

చంద్ర : తేల్చేసుకున్నారు కదా! మరి ఫరవాలేదు. శకునాలగురించి మరెప్పుడూ అలాంటి పిచ్చి పెట్టుకోకండి.

సోమ : కాని మరి మీ యజమాని, ఉన్నాడా? శకునం దెబ్బ వాడికేం తగల్లేదు. కద.

చంద్ర : మెల్లిగా మాట్లాడండి. ఆయన మేడ దిగుతారు.

సోమ : అహాఁ! అయితే ఉన్నట్టే కదా?!

చంద్ర : ఉన్నారండీ ఉన్నారు.

సోమ : ఏమో లే. ఈ పూటకి స్కూలికి సెలవుపెట్టి మరీ ఒచ్చేను. అన్నట్టు, మాడ్రా బాబూ. ఇదిగో! ఏది ఎక్కడుంది? ఆఁ ఇదిగో. సెలవు చీటి.

చంద్ర : ఎవరి సెలవు చీటి?

సోమ : కుటుంబాన్దిరా. నీచేతికిమ్మన్నాడు. ఇవాళా రేపూ కూడా ఆఫీసుకి రాలేడు మరి. చీటీ నీకిచ్చేసేను, సరిపోయిందా?

చంద్ర : ఆఫీసులో ఇచ్చేస్తా లెండి; కాని, ఆయనేనైనా తేరుకున్నాడా?

సోమ : తేరుకోకపోతే తీరుతుందిట్రా అబ్బాయ్! ఆఫీసుకొచ్చి ఏదో బక్కుగుతేనే కదా నాలుగ్గింజలింట్లో కొచ్చేది. రేపు మరి ఆడదాన్నీ ఆఖరిదాన్నీ కాకినాడ తోలేస్తాడు. ఎల్లుట్నుంచీ ఆఫీసు కొచ్చేస్తాడు.

చంద్ర : అవిణ్ని కాకినాడెందుకూ పంపడం?

సోమ : నాల్రోజులపాటు పుట్టింట అన్నదమ్ముడి దగ్గరుంటే మనసే కుదటపడుతుందని నమ్ముతున్నాడు.

చంద్ర : మంచి మాటే.

సోమ : ఎల్లుట్నుంచీ వీడూ ఆఫీసు కొచ్చేస్తాడు. అంతా సర్దుకుపోతుంది. వారాలకొద్దీ ఏడుస్తూంటే జరుగుబాటవొద్దూరా? ముప్పొద్దులా ఎవడైనా తిండి పడేస్తూ ఉంటే ముప్పొ

మూడ్రోజులు తీరిగ్గా కూర్చొని ఏడవొచ్చు, ఏం? నే చెప్పినమాట బావుందా?

చంద్ర : బాగానే ఉంది. నిజం చెప్పేరు.

సోమ : (కోటు జేబులోంచి అగ్గిపెట్టే చుట్టలపెట్టే బైటికితీస్తూ,) మన్లాటివాళ్లం మొండికత్తేస్తే నే గాని బతికలేంరా! మా(డా బాబూ! చుట్ట ముక్క కాల్చుకోమంటావా? ఒద్దంటావా?

చంద్ర : ఆయనొస్తాడు. ఆట్టే ఆలస్యం ఉండదు. కాస్సే పోర్చుకోండి. తరవాత బైటికిపోయి కాల్చుకుందాం.

సోమ : 'వినదగు నెవ్వరు చెప్పిన; మంచి మాటే చెప్పేవు. అవును. చుట్ట పొగ మొహామ్మీది కొదిలి పెబ్బిమ్మంటే ఏవడిస్తాడు?. ఆనక కాల్చుకుందాం (అని వాటిని జేబుల్లో పెట్టుకున్నాడు)

రమ : (మేడమీంచి) నరసన్నా! నర్సనా!

నర : (లోనుంచి హాల్లోకివస్తూ) ఒస్తున్నా బాబూ!

రమ : సెక్రెటరీ బాబొచ్చేడ్రా?

నర : (మేడమెట్లెక్కబోతూ) ఒచ్చేరుబాబూ!

రమ : సరే. ఉండమన్చెప్పు. ఒస్తున్నా.

నర : చిత్తం! (శేఖరం వైపుతిరిగి) బాబుండమంటున్నారు మిమల్ని.

చంద్ర : వింటున్నాను.

నర : (లోనికివెళ్లే గుమ్మందగ్గర నిల్చున్నాడు.)

సోమ : ఏవిఁరా, మనిషి మంచివాడేనా? లేకపోతే చేసబువు మనిషా?

చంద్ర : ఇప్పుడా అడుగుతారు?

సోమ : మరి, అడక్కపోతే ఎలా తెలుస్తుంది?

చంద్ర : ఆయనొచ్చేస్తున్నారు.

సోమ : (నెమ్మదిగా) మంచివాడేనా?

చంద్ర : కొంచెం ప్రథమకోపి. అంతే, అయినా మరేం ఫరవాలేదు.

సోమ : కోపమైతే ఎవడికొక్కవాలి; కోపం లేకపోతే ఎవడికొక్కవాలి? అడిగేదేదో అడిగేస్తాను.

చంద్ర : నెమ్మదిగా అడగండి.

సోమ : నెమ్మదిగా అడక్కపోతే కసుర్తానా? కొడతావా?

[రమణయ్య మేడమెట్లుదిగి హాల్లోకి వచ్చేడు. సుమారు అరవై సంవత్సరాల మనిషి. లావుగా పొడవుగా ఉన్నాడు. మేలురకం పంట్లాం షర్టూ తొడుక్కున్నాడు. జోధ్‌పూర్ కోటు వేసుకున్నాడు. తొడుక్కున్న నల్లబూట్లు తళతళ మెరుస్తున్నాయి. జుట్టు పండిపోయింది. మనిషికి పొట్టవుంది. చేతిలో— చుట్టూ లతలున్నది, లేత బ్లూరంగుది— మార్వాడీ టోపీవుంది. వానిటీ, మూర్ఖత్వం మనిషిలో మామూలుగా కనిపిస్తాయి. ఆ రోజున కొంచెం చింతతో ఉన్నట్టుగా ఉన్నాడు. చింతతోపాటు, చిన్న చిరాకు కూడా కనిపిస్తోంది. శేఖరం సోమనాథవూ నిల్చున్నారు.]

చంద్ర : గుడ్ మాణింగండీ.

రమ గుడ్ మాణింగయా! ఉత్తరమేదైనా ఒచ్చిందా?

సోమ నమస్కారాలండీ రమణయ్యగారూ!

రమ నమస్తే నమస్తే! మీ రెవరు? అలా కూర్చోండి. (శేఖరంతో) ఏంరా లేదయ్యా?

చంద్ర పర్సనల్ లెటర్సేం రాలేదండి.

రమ ఏర్ మేలొచ్చిందా?

చంద్ర ఇంకా రావాలి.

[రమణయ్య సోఫాలో కూర్చున్నాడు.]

రమ : అబ్బాయి కెలా ఉందో ఏవిఁటో?

చంద్ర : మరేం ఫరవాలేదండి.

రమ : ఏమో.

చంద్ర : ఒంట్లో ఏదో కొంచెం ఇదిగా ఉంది, మరేం పెద్ద చెప్పతగ్గ విషయంకాదని రాసేరు కదండీ?!

రమ : ఏమో. మళ్ళీ స్పష్టంగా బావుందని తెలిస్తే గాని నాకదోలా ఉంది.

సోమ : అబ్బాయి కొంట్లో బావులేదా ఏవిఁటి?

రమ : ఈయనెవరు? అలా నిల్చున్నారేం? కూర్చోండి.

సోమ : అలాగే కూచుంటాలెండి. కూచోమంటే కూచోనూ? నువ్వూ కూచ్చోరా అబ్బాయ్!

[అంటూ రమణయ్యకి ఎదురుగా సోఫామీద కూర్చున్నాడు.]

రమ : ఆఁ! ఏవిఁటయ్యా శేఖరం? నువ్వూ కూర్చో గాని ఇవాళ మన కిప్పుడు ఏం పనుంది? ఇప్పు డెక్కడికో వెళ్లాలికదూ?

చంద్ర : ముందు బాంక్కి వెళ్లి ఏజెంటుని చూడాలి.

రమ : అవును. ఏజెంటుని చూడాలి. తరవాత?

చంద్ర : ఇవాళే పి.యే.వో.ని మీటవుదాఁ వంటారాఁ?

రమ : మీటవాలి.

చంద్ర : మధ్యాహ్నం ఆఫీసుకు మిస్టర్ బెనర్జీ ఒస్తాఁ వన్నారు.

రమ : ఎన్నిగంటలకి?

చంద్ర : మూడు గంటలికి.

రమ : మూడుగంటలిక్కడా—ఆల్ రైట్, అయితే ఇప్పుడు బాంక్కి వెళ్దాఁ?

చంద్ర : ఓ యస్.

రమ : నర్సనా!

నర : (ఏదో ఆలోచిస్తూ పలికేడు కాడు)

రమ : (గట్టిగా) నర్సన్నా!

నర : చిత్తం బాబయ్యా (అంటూ ముందు కొచ్చేడు)

చంద్ర : వెళ్ళి కారు సిద్ధం చెయ్యమన్చెప్పు.

రమ : పిలిస్తే పలకవేం?

నర : లేదు బాబూ, వెళ్తున్నా (అంటూ వెళ్లిపోయేడు)

సోమ : (శేఖరంతో) వెళిపోతున్నారు కాబోలు మరి నా మాటేవిఁట్రో?

రమ : (శేఖరంతో) ఈయనెవరు? (సోమనాథంతో) మీ రెవరండీ?

సోమ : హనుమంతరావుగారి హైస్కూల్లో టీచర్నండి.

రమ : సరే, ఏవిఁలా ఒచ్చేరు? ఎందుకోసం?

సోమ : చెప్పరా బాబూ శేఖరం! (రమణయ్య శేఖరంవైపు చూసేడు)

చంద్ర : ఈయనా—మనాఫీసులో పన్చేస్తున్నారు, కుటుంబయ్య చూసండి.

రమ : అవును. కుటుంబయ్య.

చంద్ర : ఆయనకీయన కావలసినవారు.

సోమ : కావలసినవాళ్లేఁవంటే ప్రాణస్నేహితులవఁన్నమాట, నాకోసం వాడు పీక తీసేసి ఇచ్చేమంటే ఇచ్చేస్తాడు. నేకూడా అంతే.

రమ : అయితే ఏఁవిఁటంటారిప్పుడు?

సోమ : ఏఁవీఁ లేదు. ఉన్నమాట చెప్పేను. కావలిస్తే వెళ్ళి వాణ్నే అడగండి, నే చెప్పిందాంట్లో అబద్ధఁవుందేమో.

రమ : అది చెప్పడానికా ఇక్కడికొచ్చేరు?

చంద్ర : సోమనాథంగారూ!

సోమ : ఏవిఁరా బాబూ! నే చెప్పిందబద్ధవాఁ?

చంద్ర : అదికాదండీ. ఏం పనిమీదొచ్చేరని అడుగుతున్నారు. మీక్కావలసిందేవిఁటో త్వరగా చెప్పండి. ఆయన వేగిరం వెళ్ళాలి.

సోమ : చెప్పేస్తున్నా రా బాబూ! చల్లకొచ్చి ముంత దాచడఁవెందుకు?

చంద్ర : మరి, చెప్పండి.

సోమ : చూడం డ్రవణయ్ గారూ! కుటుంబయ్యా నేనూ స్నేహితులవి.

రమ : ఆ సంగతప్పుడే చెప్పేరు.

సోమ : చెప్పేకదా. అంచేత వాణ్నే ఇవాళ తీసుకొచ్చి అడుగుదావఁనుకున్నాను.

చంద్ర : ఏవిఁటో చెప్పండి.

సోమ : మరేం లేదు రమణయ్ బాబూ. నా కూతురికి, మూడోదానికి, పెళ్ళి నిశ్చయమైపోయింది. డబ్బుకి యటామటీగా ఉంది. చూసేరు కదూ. అంచేత...

రమ : అంచేత?

సోమ : అంచేత మీ రెలాగైనా సాయపడాలి.

రమ : అంటే డబ్బు కావాలా?

సోమ : ఎంతో అక్కర్లేదు. ఒక్క యిదువందలు. మళ్ళీ మీకు పువ్వుల్లో పెట్టిచ్చేస్తాను. అలా ఇవ్వకపోతే ఇంటికి పిలిపించి మొహమ్మీద పేణ్ణీళ్లు జల్లండి. లేకపోతే మరే శిక్షయినా వెయ్యం డొప్పుకుంటాను.

రమ : నో నో నో. ఒక్క దమ్మిడీ స్పేర్ చెయ్యడానికి వీల్లేదిప్పుడు.

సోము : అలా అనీకండి. నా కొంతమంది పిల్లలో తెలిస్తే అలా అనరు మీరు. నాకైదుగురు మొగపిల్లలూ, అయిదుగురు ఆడపిల్లలూను. ఒంటిగాణ్ని, ఏదో సంసారాన్నిలా ఈదుకొస్తున్నాను. చూస్తే దమ్మిడీ ఎత్తు వెనకదన్ను లేదు. అంచేత, మరింక ఆస్తీ పాస్తీ ఏం వున్నా పిల్లలే ఆస్తి.

రమ : పిల్లలే ఆస్తి! అదిపెట్టి ఆడపిల్లకి పెళ్లి చేసుకోండిప్పుడు.

సోము : ఆగ్రహించకు బాబూ! పిల్లలే ఆస్తంటే వాళ్లే రూపాయిలూ, అణాలూ, పైసలూ అవా? అదికాదే!

రమ : అదికాదు ఇదికాదు. ఏమిటి కాదయ్యా? పదిమంది పిల్లల్ని ఎత్తుకుని నా పీకలమీద సవారీ అయిపోదామంటే లాభంలేదు. తెలిసిందా? నోయూ. ఎవడు కనమన్నా డంతమందిని?

సోము : ఒకడు కనమనేదేమిటి? మిమ్మల్ని మిమ్మల్ని అడిగి పిల్లల్ని కంటారండీ? ఇదెక్కడైనా ఉందా?

రమ : మీరింకొట్టే మాటాడక ఇక్కణ్నించి దయచెయ్యండి (అంటూ తలమీద టోపీపెట్టుకున్నాడు).

చంద్రి : సోమనాథంగారూ, ఆయన పనిమీద వెళ్లాలంటున్నారు. తిరవాత నింపాదిగా మాట్లాడుకోవచ్చు. ఇప్పుడు మరి, లెండి.

సోము : ఈమాట దానికి మళ్లీ మనోవ్యాధెందుకురా?! బాబూ, రమణయ్య బాబూ! తప్పులుంటే క్షమించు. మనవాళ్లలోకల్లా నువ్వే శ్రీమంతుడివనేవు. కలిగినవాడివి. కలకాలం వర్ధిల్లు. దానికితోడు ఆపదలో ఉన్నవాడి కష్టాపడితివా—ఆనాడే పేరు పెట్టుకున్నందుకు—ఏకాకొంపల చంద్రవంశ మూర్తిలాంటి వాడివేనని నీకందరూ జోహార్లు చెయ్యకపోరు, విన్నావా?

రమ : ఏమిటి విసం? ఇక్కడెవరికీ ప్రసంగం చెయ్యకు (శేఖరంతో) ఎవడయ్యా ఇతనూ, పొద్దుటే తగులుకున్నాడూ?

సోము : (రమణయ్యకి దగ్గరగా వెళ్లి టోపీమీద చేతులు వెయ్యబోయేడు. అతను తలవెనక్కి తీసుకున్నాడు.)

రమ : వాటిజ్ దిస్? ఏమిటి చేస్తున్నావ్?

సోము : రమణయ్య బాబూ! నెత్తిని కిరీటం పెట్టుకున్నావు. నాకు తండ్రిలాంటి వాడివి. ఈ కష్టంలో సాయపడితివా నా మనవడికి నీ పేరు పెట్టిస్తాను. విన్నావా? అల్లుళ్లని తప్పించి నేనెవడి కాళ్లూ పట్టుకోలేదు, చూడు బాబూ చేతులుపట్టుకు అడుగుతున్నాను. పిల్లలవాణ్ని, ఈ కాస్త సాయం చేసి కాపాడు నన్ను.

రమ : (గట్టిగా కేకలేస్తూ లేచి) పిల్లలూ! పిల్లలవాళ్లూ! పూటకి టకాణా లేనివాడికి పదిమంది పిల్లలా?! బుద్ధీ జ్ఞానం ఉండొద్దూ? పైసా లేనివాడివి పదిమందిని కంటావా?

సోము : ఎందుకురా ఆ కేకలూ? (అని ఆశ్చర్యం పడ్డాడు.)

రమ : పదిమందిని కని వాళ్లకి చేసిందేమిటున్నావ్? తిండి పెట్టవు. బట్టలివ్వవు, చదువు చెప్పించవు, పెంచలేవు, పోషించలేవు, పిల్లలవాట్ట! పిల్లలవాడు! సిగ్గులేదూ చెప్పుకుందుకి?

సోము : దానికి సిగ్గెందుకూ? దానికే సిగ్గ?!

రమ (కూర్చొంటూ) సిగ్గూ లజ్జా లేని పశువులు, చదువుండదు. సంస్కారముండదు. పిల్లల్ని కని పారేసేం, వాళ్లు గాలికి బతికేసేం, తిండికి నిన్నూ నన్నూ ముష్టెత్తేసేం. లేకపోతే నీ ఇల్లూ నా యిల్లూ కన్నం వెయ్యడం (అని సోఫాలోంచి మళ్లీ లేచి) దొంగలు, దొంగలవుతారు మీ పిల్లలు, తెలిసిందా? దొంగలవుతారు (అని అరిచి ఆయాసపడుతూ కూర్చున్నాడు.)

సోము : ఏమిట్రా శేఖరం? ఇతగాడికి మతికాని పోయిందేమిట్రా? వాస్తేగు మనిషిలా మాట్లాడుతున్నా డేమిటి?

[కోపంవల్ల తనని తాను మర్చిపోయినట్టుగా కూర్చున్నాడు రమణయ్య]

చంద్ర : సోమనాథంగారూ, మరిప్పుడేం మాట్లాడకండి, వెళ్ళిరండి.

సోమ : నా కేదో తప్పయినట్టు మాట్లాడతావేంరా? వాడలా ఒగర్చుకొంటూ కేకలేస్తున్నాడు కదా, వాణ్ణేం అనవేం?

చంద్ర : సంగతేం బోధపడకుండా మీ రలా మాట్లాడితే ఎలాగండీ? వెళ్ళి రమ్మంటున్నాను. విన్నారేం?

సోమ : బావుందిగా బాబూ బావుంది. అప్పుడుగడానికొస్తే ఇచ్చేదిలేదు చచ్చేదిలేదు. ఇవ్వకపోతే అడేపోయిరి. "ముష్టెత్తుతారు, కన్నం వేస్తారు. దొంగలవుతారు." అని పైగా మాటలంటావా?

రమ : (గట్టిగా అరుస్తూ) ముష్టి వెధవలవుతారు మీ పిల్లలు. భ్రష్టు వెధవలవుతారు మీ పిల్లలు. ముష్టి వెధవలూ, భ్రష్టు వెధవలూ, దొంగ వెధవలూను, తెలిసిందా?

సోమ : (కోపంతో) ఏమిటయ్యా! అయిన కాయితమ్ముక్క లడగడానికొస్తే అబ్బద్ధ మాటలూ అంటున్నావూ?

రమ : (గట్టిగానే) అంటాను. మళ్ళీ మళ్ళీ అంటాను.

సోమ : అంటావా? అంటే మూతిపళ్ళు రాలగొడతారు.

రమ : షటప్ (అని గట్టిగా అరిచి ఆయాసపడుతూ గుండెలు పట్టుకొని చూస్తున్నాడు).

సోమ : నువ్వే షటప్...

చంద్ర : సోమనాథంగారూ!

సోమ : పోనీకదా అని ఊరుకొంటున్న కొద్దీ రెచ్చిపోయి మీదపడి కరుస్తున్నావు మరీను నువ్వు గొప్పవాడివయి నీ దగ్గిర డబ్బుంటే ఆ గొప్పా ఆ డబ్బూ మూటకట్టుకుని గంగలో కలుపు, నా కభ్యంతరం లేదు. మాట్లుమాత్రం మిగలకు. తెలిసిందా?

చంద్ర : సోమనాథంగారూ!

సోమ : ఉండ్రా! ముష్టి వెధవలూ భ్రష్టు వెధవలూ అని తిడితే ఊరుకుంటా రనుకుంటున్నావేమిటి?

చంద్ర : కొంచెం శాంతించండీ—

సోమ : నేను శాంతించను, మేం పిల్లల్ని కంటే వీడికేల? కనకపోతే వీడికేల? వీడేం పెట్టాలా పోషించాలా? డబ్బులేని వెధవలం మేం పిల్లల్ని కనేస్తే వాళ్ళంతా వచ్చి వీడు సంపాయించిన మూట పట్టుకుపోతారనేనా వీడి భయం? అంతేనా? వీడిగ్గుండె దడ పట్టుకుందని నేను కంటం మానెయ్యాలా? ఏది? అంతేనా?

చంద్ర : అదికాదండీ.....

సోమ : నువ్వూరుకోరా! పెళ్ళాల్లేని పిచికవి నువ్వూ మాట్లాడ్తావేం?! మాట్లాడకూరుకో, నాలాటి వాణ్ణి పెళ్ళాడి, ఇంటికి పెళ్ళాన్ని తెచ్చుకుని—ఓ జబ్బుదీ, గుడ్డిదీ, పొట్టిదీ కాదు—పిడికుచ్చు లాటిదాన్ని పెళ్ళాడి ఇంటికి తెచ్చుకొని ఏం చెయ్యమంటావు? దేవుడిపెట్టెమీద కూచోబెట్టి పూజచెయ్యమంటావా? ఏమిరా రమణయ్‌బాబూ పూజ చెయ్యమంటావా?

చంద్ర : సోమనాథం గారూ!

సోమ : ఊహూఁ. పూజచెయ్యమనవు — మరేం చెయ్యమంటావు? పుట్టకముందే పిల్లల్ని చంపేమంటావు. భ్రూణహత్య చెయ్యమంటావు, అదేనా అంటావు? లేకపోతే అదీ లేకుండా ఒక్క గొడ్డుబతుకు బతకమంటావు అంతేనా?

చంద్ర : సోమనాథంగారూ!

సోమ : అపన్లు సంసార్లు చెయ్యర్రా! వింటున్నావా? ఆ పన్లు సంసార్లు చెయ్యరు.

చంద్ర : మీరూరుకోండి సోమనాథంగారూ!

సోమ : నేనూరుకోన్రా! ఏం? వాడికి పిల్లలు కావాలా? నా కొద్దూ? ఏం చేత? వాళ్లాంటి మనిషిని కానూ నేను? నా వంశం నిర్వంశం అయిపోవాలా? వాడి వంశమే నిలబడాలా?

చంద్ర : మీ రేం ఊహించుకొని రెచ్చిపోకండి, కేక లెయ్యకండి. ప్లీజ్.

సోమ : వాడికెక్కువ మందక్కర్లేక పోతే పోయిరి.

రమ : షటప్! గెటౌట్ ఫ్రమ్ హియర్.

సోమ : నీ కొడుకు వ మందక్కర్లేదురా, హెచ్చుమం దుంటే నీ ఆస్తి చెదిరి పోతుందన్న భయం. ఉన్నదంతా దాచపెట్టి నిలబెడదామని చూస్తున్నావు నువ్వు. లేనిది సంపాయిద్దామని చూస్తున్నాను నేను. సాయానికి నాకొక్కవాలి పిల్లలు, తెలిసిందిరా రమణయ్‌బాబూ! వింటున్నావా? అరవచాకిరీ చేసి బతుకుతాను. ముష్టెత్తి బతుకుతాను. లేకపోతే నీ చెత్తీ నీచెత్తీ కొట్టి బతుకుతాను. బతక లేకపోతే ఛస్తాను. నే చస్తే నాకులేంది నా పిల్లలు తెచ్చుకుంటారు. వాళ్ళూ తెచ్చుకోక పోతే వాళ్లపిల్లలు తెచ్చుకుంటారు. ఎప్పుడో అప్పుడు తెచ్చుకు తీరుతారు. తెలిసిందా? ఇవాళ నీదైతే రేపు నాది. ఏం, వింటున్నావా?

రమ : గంటలేం? వాణ్ని గంటలేం? చూస్తావేం శేఖరం? నరసన్నా, పంతులూ, అప్పన్నా

నర : (వీధివైపు నుంచి) వస్తున్నా బాబూ.

రమ : వాణ్ని తగిలెయ్‌వోయ్ శేఖరం!

చంద్ర : మీరు గాభరా పడకండి (అని సోమనాథంతో) సోమనాథం గారూ...

రమ : (హాల్లోకి వచ్చిన నరసన్నని చూసి) నరసన్నా! ఆ మేష్టరు నోరు నొక్కి పట్టుగ్గొంటే; చూస్తావేం? గెంటే

[నరసన్న వస్తా యిస్తూ నిల్చున్నాడు. ముందుకి కదిలేడు.]

సోమ : రారా చెప్తాను! ఇల్లా చెప్తాను!!

(ఇంతలో హఠాత్తుగా వీధి వైపునుంచి "టెలెగ్రాం సార్" అని కేక వినవచ్చింది. అందరూ ఒక్కసారి నిశ్శబ్దంగా ఉండి పోయేరు. "సార్, టెలెగ్రాం" అని మళ్లీ విన వచ్చింది కేక.]

రమ : ఎవరికా టెలెగ్రాం? ఎవరికి ?

చంద్ర : చూస్తా (అంటూ ముందు వైపుకి వెళ్ళేడు; నరసన్న కూడా వచ్చేడు. టెలెగ్రాం పుచ్చుకొని హాల్లోకి వచ్చేడు. నరసన్న కూడా వచ్చేడు. రెండు చేతుల్లోనూ తల పట్టుకు కూర్చున్నాడు రమణయ్య. అటూ ఇటూ పచార్లుచేస్తున్నాడు సోమనాథం)

సోమ : (ఆగి) ఏవిట్రా టెలిగ్రాం?

చంద్ర : రమణయ్‌గారికి.

రమ : నాకా? ఏదీ కళ్ళజోడు? ఇలాతే (అంటూ కళ్ళజోడు తీసి తగిలించుకున్నాడు. శేఖరం టెలిగ్రాం అతని చేతికిచ్చేడు చించి చదువుకొని, కంపించి పోతూ కాయితాన్ని జారవిడిచేడు)

నర : అడటి బాబోవ్! (అంటూ అరిచేడు)

సోమ : కళ్లు తేలేసేస్తున్నాడ్రా!

[రమణయ్య కుర్చీలో ఒరిగి పోయాడు. శేఖరం నరసన్నా దగ్గరకెళ్లి పట్టుకున్నారు]

సోమ : ముసలాడు చచ్చిపోలేదు కద!

చంద్ర : ముందు మీరీయన్నిలా పట్టుకోండి.

[సోమనాథం అతని మీద చెయ్యి వేసి నిల్చున్నాడు. శేఖరం వీపు మీద చెయ్యి వేసి చూసి.]

చంద్ర : మరేం ఫర్వాలేదు.

నర : ఏం టయిందేటో? ఒక్క సారి ముంచుకొచ్చింది.

సోమ : ఆ టెలెగ్రాం వేమిటో చూడ్రా!

చంద్ర : చూద్దాం వుండండి. కోటూ, షర్టూ కాస్త ఒదులుచెయ్యండి. పెయింటయేడు. నరసన్నా నువ్వెళ్లి కొంచెం నీళ్లు పట్రా. మీరాలేడీ? పిలువు.

న : చినబాబ బెనగెటం వెళ్లిపోనారండి.

చంద్ర ముందు నువ్వెళ్ళి నీళ్లు పట్రా.

నర చిత్తం (అంటూ వెళ్ళేడు)

సోమ (రమణయ్య కోటు వదులుచేసి) ఆ టెలిగ్రాం చూడ్రా.

చంద్ర (టెలెగ్రాం తీసి చదివి) అరె!

సోమ ఏమిటయింది?

చంద్ర పెద్దబ్బాయి పోయాట్ట.

సోమ ఏమిటి, పెద్ద కొడుకే!

చంద్ర అవును.

సోమ శివశివా శివశివా! ఎంతమాట విన్నాన్రా!

చంద్ర ఇక్కడే ఉండండి.

సోమ నువ్వెక్కడికి కెళ్తావు?

చంద్ర డాక్టర్కి ఫోన్ చేస్తాను.

సోమ మరి వేగిరం చెయ్యి.

[నరసన్నా, పంతులూ నీళ్ళు పట్టుకొని వచ్చేరు. రమణయ్య ముఖం మీద నీళ్ళు జల్లేడు సోమనాథం. శేఖరం డాక్టరుకి ఫోన్ చెయ్యడానికి వెళ్ళేడు—తెర]

[సశేషం]

# కలగూరగంప

## ఉపసర్గ సంధియతి

### శ్రీ రావూరి దొరసామిశర్మ

సంస్కృతభాషలోఁ బ్రాదు లిర్వదింటికి నుపసర్గలని వ్యవహారము.

శ్లో॥ ప్రపరా ప్రతిపర్యత్యన్వ భ్యవానూప సంస్వప
నివినిర్దురుదప్యాజ త్యుపసర్గాస్తు వింశతిః.

ప్ర, పరా, ప్రతి, పరి, అతి, అధి, అభి, అవ, అను, ఉప, సం, సు, అప, ని, వి, నిర్, దుర్, ఉత్, అపి, ఆఙ్—ఇవి యిరువదియు నుపసర్గలు; ప్రకారోపసర్గం బాదియగుటంజేసి ప్రాదులనంబడును.

ఈ ప్రాదులకు స్వరములు పరములై సంధి గలిగినచోట్ల నుభయయతి (పరస్వరమునకేని, వ్యంజనమునకేని యతి) ఘటింపవచ్చు. దీనికే ప్రాదియతి యను పేరు ఛందఃకర్త లొసంగిరి.

అబ్జయోని రజోగుణ+ప్రాప్తిఁదనకు
పద్మనాభుఁడు సాత్త్విక+ప్రాప్తిఁదనరు
(అప్పకవీయము-3-133)

ఇందు ప్ర+ఆప్తి-ప్రాప్తి అని సంధి. యతిస్థానమునఁ బ్రథమపాదమున స్వరమునకు, ద్వితీయ పాదమున వ్యంజనమునకు మైత్రి గూర్పఁబడియె. భారతాదిగ్రంథములలో నీప్రాదియతులకు లక్ష్యములు పెక్కులు గానవచ్చుచున్నవి.

ఇఁక, ఉపసర్గసంధియతి—ఇది ప్రాదియతియని పైకి స్ఫురింపవచ్చునుగాని యట్లుగాక యందులకు భిన్నమయి యొప్పుచున్నది. ఉపసర్గలు పరములగునపుడుభయయతి ఘటించుట యుపసర్గ సంధి యతి యనఁబరఁగును. అనఁగాఁ బ్రాదు లిందుఁ బూర్వమునఁగాక పరమున నుండవలయు 'వృషభ+అధిప' అనుచోట 'అధి' యను నుపసర్గ పరమందు నిలిచి సంధి ఘటిల్లినది. 'వృషభాధిప' యనుచోట సంహితాక్షరమునకు స్వరముతోఁగాని వ్యంజనముతోఁగాని యతిమైత్రిసేయవచ్చు. ఇట్టిది ప్రాదియతిగాక యుపసర్గసంధి యతి యగును.

అధి+ఈశ-అధీశ-ఇందుపసర్గ పూర్వపదము.

వృషభ+అధిప - వృషభాధిప - ఇందుపసర్గ యుత్తరపదము.

పైరెండుభయయతిభేదములే. మొదటి దానికిఁ బ్రాదియతియని, రెండవదాని కుపసర్గసంధియతి యని పేళ్లలో భేదము గ్రహింపవలయు.

ఉపసర్గసంధియతి కప్పకవి చూపిన యుదాహృతులు—

చంద్రికా పరిణయమునందు,

అంతట రుక్మబాహు వసు+ధాధిపనందన
యొక్కనాఁడు...(3—133)

అంతట...వసుధ+అధిప (స్వరమునకుయతి)
కవిజనాశ్రయమునందు,

ఉ. మానుగవిశ్రమాక్షర సమంచితమై
స్వరమూఁదినం దదీ
యానుగుణాక్షరంబకొనియైనను జెప్పఁగ నొప్పనీ క్రియన్
భానుసహస్రభాసి వృష+భాధిపుఁ డున్నటు లర్థయుక్తమై
పూనినచో నఖండవడి పొల్పగు నాదికవి ప్రణీతమై (3—134)

భానుసహస్ర...వృషభ+అధిప (వ్యంజనయతి)

అప్పకవి యీ యుపసర్గసంధియతిని బ్రత్యేకముగాఁ గాక నిత్యసమాసయతుల క్రింద నుదహరించినాఁడు. ప్రాచీన లాక్షణికులగు భీమన పెద్దనానంతామాత్యులు చెప్పిన ప్రాదియతి కియ్యది భిన్నమగుటచేఁ గాఁబోలు నప్పకవి ప్రాదియతి క్రింద దీనిని జెప్పక నిత్యసమాసయతుల క్రిందఁ జేర్చి వైచె. దీనిని బ్రత్యేక యతిభేదముగాఁ జెప్పియుండిన రమ్యతరముగా నుండును. ఈ యుపసర్గసంధియతినప్పకవికి ముందు

గాని వెనుకఁగాని లాక్షణికు లెవ్వరు చెప్పినట్లు లేదు. దీని ప్రత్యేకతా విషయ పట్టుంచనిచ్చి కవిజనాశ్రయ లక్ష్య మెంతవఱ కప్పకవిమతానుసారియో యించుక పరామర్శింపవలసి యున్నది.

కవిజనాశ్రయము వేములవాడ భీమకవికృతమని పూర్వ లాక్షణికుల వ్రాఁతలనుండి తెలియనగుచున్నది కాని రేచన కృతమని నేఁటి కొందరు విమర్శకుల మతము. ఆ వాదముతో మనకిటఁ బ్రసక్తి లేదు. ఆ విషయ మొండెడఁ జర్చింపఁదలఁచియున్నాను. కవిజనాశ్రయమునఁ బదియతులు చెప్పబడినవి. అంగుఁ బ్రాదియతి గలదు. అప్పకవి చెప్పిన నిత్యసమాసాద్యుభయయతుల కన్నింటికి మాఱొక యఖండవడియందు జెప్పఁబడియె. స్వరసంధిఁగూడిన శబ్దద్వయమునఖండ శబ్దముగా (ఏక శబ్దముగా) భావించి హల్లునకు (ప్రాణికి) యతిగూర్చుట యఖండయతి యనఁబడును. భీమనచెప్పిన యీ యఖండవడిచేత నప్పకవి చెప్పిన యుభయయతిభేదము లన్నియు గతార్థము లగును. అప్పకవి కీయఖండవడి యిష్టము గాదు. అఖండవడి సమ్మతించితి మేని సాధారణ స్వరసంధి ఘటితశబ్ద జాలమునకంతయు వ్యంజన మైత్రి చెల్లుబడి కావలసి వచ్చు. 'రాముఁడితఁడు, నాకిష్టము, వేల్పుటావు, సుగుణాకర, భూసురోత్తమ' ఇత్యాది స్వరసంఘులం దెల్ల హల్మైత్రికి నఖండవడి యఖండముగా సాగుత్వము కల్పించును. ఇట్టి యతివ్యాప్తి వరికట్టఁదలఁచి యప్పకవి పూర్వ లక్షణములను బ్రయోగములను బరిశీలించి యుభయయతి భేదములఁ గొన్నింటిని (పంద్రెండును) గల్పించె. ఇట్టి యుభయయతి కల్పన కప్పకవి ప్రథముఁడు గాఁడు. ఇది యప్పక వ్యుపజ్ఞము గాదు. పెద్ద నానంతాదులు గొంత యిందులకు దారి చూపిరి. అప్పకవి యా మార్గమునకుఁ జక్కని కట్టుదిట్టములు గావించి యఖండవడిని నిరసించె. అఖండవడి చెప్పుదుమేని యిఁకఁదక్కిన యుభయయతు లావశ్యకములుగావని మున్నే చెప్పితి. ఇది యాలోచించియే యప్పకవి యఖండవడిని ఖండించె. అఖండవడి చేసిన యొక కొన్ని భారత ప్రయోగములు గానరాఁగా నా పాఠము లసాధువులని యపపాఠములని స్వీయమతానుసారముగాఁ బాఠాంతరముఁ జూపెను. (మా. అప్ప. 3 ఆ. 202—212.)

ఇటఁజెప్పఁదలఁచిన దేమనఁగా, భీమన 'మానుగ విశ్రమాక్షర' అను పద్యములో నఖండవడిని జేర్కొనుచుండఁగాఁ, దన కఖండవడి సమ్మతము గామిచే భీమన గారి లక్షణలక్ష్యముల దుష్టమనుటకు వల్లగాక నిత్యసమాసయతులక్రిందఁజేర్చి యుపసర్గసంధిచే నుభయయతి చెల్లుబడియగునని యప్పకవి తనమతమున కనుగుణముగా సరిపుచ్చుట గమనింపఁదగి యున్నది. కవిజనాశ్రయకారుఁ డఖండవడిభేదముఁ జేర్కొని యందులకు లక్ష్యముగా నిచ్చిన పద్యము నిత్యసమాసయతికి లక్ష్యముగా నప్పకవి సరిచేయుట యసమంజసము తప్పదు. ఇఁకఁ జంద్రికా పరిణయ లక్ష్యపద్యము స్వరమైత్రిని జూపుటచే నది స్వరప్రధానవడికి లక్ష్యము నైకాని దానిచే నుపసర్గసంధి యతి సాధింపరాదు: హల్మైత్రికిఁ బ్రయోగాంతర మప్పకవి చూపలేదు. నా పరిశీలించిన గ్రంథములలో నీ క్రింది ప్రయోగము లుపసర్గ సంధియతికి లక్ష్యములుగా లభించినవి.

ఎఱ్ఱన—హరివంశము—

శ్రమవేగంబునఁదూఁగ నంవలు విహా + రాపేక్షులై డిగ్గి. (పూర్వ—6—97).

(విహార + అపేక్ష)

కల్పతరుశీ, లాకల్పదయావిలాస లాలిత సుజనా (ఉత్త—6—44.)

(శీల + ఆకల్ప)

## కేయూరబాహు చరిత్ర

అనేకబంధుహం, సావళియుం బ్రహృష్టిరతి + శాంతి సముత్కర.

(హంస + ఆవళి) షట్పదంబులై (1-1)

## భీ మ ఖ ం డ ము

ద్వాదశక్షేత్ర తీర్థయా + త్రాభివృద్ధి (4-30)
(యాత్రా + అభి).

## కవికర్ణ రసాయనము

పై నిగిడించునూర్పు ప్రస + భాచర ణంబుల (3-53).

(ప్రసభ + ఆచరణ)

కృ, పాయతమతి నొసఁగవలయుఁ + బ్రత్యుత్తరమున్ (5-12).

(కృపా + ఆయతి)

## రామాభ్యుదయము

దనుజాధీశుఁడు మేడిగ్గి యతిచింతా క్రాంత చిత్తంబునన్ (7-207).

(చింతా + ఆక్రాంత)

## అల్లసానిపెద్దన యుత్పలమాలిక

పూఁత మెఱుంగులున్ ...... గోఘృతపాయస ప్రసా, రాతిరసప్రసార రుచి + రప్రతిమంబుగ సారపారకున్.

(ప్రసార + అతి)

వెల్లంకి తాతంభట్ట ప్రణీత కవిచింతామణిలో వళిప్రాసాధికారమునందు నీప్రాదియతి లక్షణలక్ష్యము లిట్లున్నవి (*).

'ఋషి విధేయ గుణస-మృద్ధ జగద్వంద్య
అంతకుఁడు కృపాప-రాఙ్ముఖుండు
భంగమతనివలనఁ-బ్రాపింపకుండను
దగ్రకరుణఁజూడు-దైత్యదమన'.

ఇందుఁ బూర్వార్ధమునఁ బ్రాగులకు స్వరముతోను నుత్తరార్ధమున హల్లులోను యతిమైత్రి పాటింపఁబడినది. ఇది యప్పకవ్యాగులు చెప్పిన ప్రాది యతి లక్షణమే యగు కాని తరువాతి యీ క్రింద పద్యము పరికించునది.

'ధాత్రిఁ బ్రాదియోగ మాత్రంబు గలిగిన
నుభయమును రచింప నొనరు యతికి
సాతిరిక్త భక్తి + శక్రసేవిత కమ
లాలయా నివాస + లక్ష్యమిదియ'

ఇందలి యతి యితర లాక్షణికులు చెప్పిన ప్రాది యతికి భిన్నము. స + అతిరిక్త—సాతిరిక్త—ఇందు 'అతి' యను నుపసర్గ పరమునఁ గలదు. ఇది యప్పకవి చెప్పిన యుపసర్గసంధి యతి యగుచున్నది. అటిదే కమల + ఆలయ—ఇందు 'ఆఙ్' ఉపసర్గ; రెంటను వ్యంజనమైత్రి. తాతంభట్టీయతిమైత్రిని బ్రాదుల క్రిందనే చూపెను. అతని మతమునఁ బ్రాదులు పూర్వమందున్నను బరమందున్నను స్వర సంధిఁ గూడియో నుభయము (స్వరవ్యంజనములు) చెల్లుబడి యగునని స్పష్టపడుచున్నది. అప్పకవియు నీమార్గ మనుసరించి యున్న మెఱుఁగుగా నుండెడిది. అట్లుగాక నిత్యసమాసయతిక్రింద నుపసర్గసంధియతి నిరూపించుట భిన్నముగాఁ గన్పట్టగు. కవిచింతామణిఁ బరికించిన యప్పకవి యిట్టి భిన్న మార్గము నేల త్రొక్కెనో దుమాహము.

కవిచింతామణిలోని యితరకవుల లక్ష్యములు—

విరాటపర్వము

శ్రీయన గౌరినాఁ బరఁగు చెల్వకు
జిత్తము పల్లవింప భఁ
ద్రాయత మూర్తియై హరిహ +
రంబగు రూపము దాల్చి.. ...

నాచన సోముఁడు—

† ఆ పాద శిరోలంకా
రాపాదిత చారు తాభి + రామాకృతియై...

ఇందుఁ దిక్కన పద్యములో 'భద్రాయత మూర్తి' యనుపాఠము గ్రాహ్యము. ఇది క్యఙ్ ప్రత్యయాంతరూపము. 'భద్ర + ఆయత' అను రీతి సవర్ణదీర్ఘ సంధి (భద్రాయత) చేసిన రూపము గాదిది. ఇవ్విషయము నప్పకవి నిత్యసమాస విశ్రాంతులక్రింద వ్యాఖ్యానించె. అతఁడీ తిక్కనపద్యమును, దీనికిముందు నన్నయ పద్యమును (కుమారాయిత శక్తిశాలి ధృతరాష్ట్రిఁ...) లక్ష్యములుగా నొసఁగి యీ క్రింది వచనమున నిట్లు పరామర్శించె—

'ఈ రెండు పద్యములయందును నన్నయ తిక్కన గార్లు కుమార భద్ర శబ్దములు క్యఙ్ ప్రత్యయాంతములు చేసి సంయుక్త విశ్రామంబులుగాను బ్రయోగించిరి. అది గానకఁ గొందఱ రెండు శబ్దములమీఁదను, ఆకారములున్నవి. నిత్యసమాన విశ్రాంతులని భ్రమయుదురు. శబ్దమాత్రమువలన వానికే దీర్ఘములు వచ్చినవి గాని అందులోపల అక్షులు లేవు.' (3–189)

బహుశా, అతఁడీ తాతంభట్టు ప్రాదియతి క్రింద నిచ్చిన యీ తిక్కన లక్ష్యము మనసునం గుంచుకొనియె యీ రీతి రచించెఁగాఁబోలు. క్యఙ్ ప్రత్యయాంతముగా గ్రహించిన నిందుఁ బ్రాదియతికి బ్రసక్తి లేకపోవును. 'భద్ర + ఆయత' అని సంధి విభాగము గ్రహించితిమేని 'ఆఙ్' ఉపసర్గ నిలిచి తాతంభట్ట మతమున నీ లక్ష్యము ప్రాదియతిక్రింద నుదాహార్యమగు. ఇఁక సోమనగారి పద్యములో 'అలంకార + ఆపాదిత' అనుచోట 'ఆఙ్' ఉపసర్గ పరమందుఁ గలదు; హల్మైత్రి గూర్పఁబడ్డది. ఈ యతియప్పకవి మతమున నుపసర్గ సంధియతి నాఁబడును. క్యచ్ ప్రత్యయాంత శబ్దములందు స్వరమైత్రి చేయరాదని యప్పకవీయలక్షణము. స్వరమైత్రి ఘటిత ప్రయోగమొకటి కనుపర్తి యబ్బయామాత్యుని కవిరాజ మనోరంజనములోఁ గానవచ్చెడు.

మతల్లి, కావలీవర్తనోపదే + ష్టాయమాన
(5-76)

ఇంక నిట్టి ప్రయోగము లున్నవేమో పరిశీలింపవలయు.

ఈ క్రింది ప్రయోగము పరికింపుఁడు—
రాఘవ పాండవీయము (4-155)

* కవిచింతామణి యముద్రితము. దీని ప్రతులు మదరాసు ఓరియంటల్ లైబ్రరీలోను, కాకినాడ యాంధ్రసాహిత్య పరిషద్గ్రంథాలయములోను గలవు. ఈ ప్రతుల సంప్రతించి పరిశోధించి టీకతో నీ గ్రంథము వావిళ్ళవారికోర్కెపై ముద్రణార్థము వ్రాసి యిచ్చితి.

† పద్య ముత్తరహరివంశములోఁ గానరాలేదు. ఇది యాతని పూర్వ హరివంశములోనిదేమో ?

క॥ వేమఱు మనగురువశ్వ
త్థామలకీ ఘోరవీర + తరుబాణకరం
బామిత వర్షము.........

రామాయణపక్షమున 'గురు—అశ్వత్థ—ఆమలకీ' అని,

భారత పక్షమున గురు—అశ్వత్థామలకు—ఈ' అని పదచ్ఛేదము గ్రహింపవలయు. ఇందు ద్వితీయ చరణాదియందు భారతపక్షమున 'త' కార వ్యంజనమును, రామాయణ పక్షమున ఆకార స్వరమును సిద్ధించును. యతి రెంటికిఁ బొందు పొసఁగి యుండవలయు. యతిస్థానమున తకార వ్యంజనమే (తగు) నిలిచి యున్నది. రామాయణ పక్షమున 'అశ్వత్థ + ఆమలకీ' అనుచో స్వరప్రధానవశి గూర్చవలసియున్నను 'ఆఙ్' ఉపసర్గ పరమందుండుటచే నుపసర్గసంధియతి ప్రకారము వ్యంజనమైత్రి (త్థా—త) చెల్లుబడియగును. భారతపక్షమున వ్యంజనమైత్రి యనివార్యమేకదా?

* ఇటీవలి రాఘవపాండవీయవ్యాఖ్యాతలు భాష్యకారాచార్యులు (కవి భావ ప్రకాశికా వ్యాఖ్య-ఆనంద ప్రెస్సు ప్రకటితము) ఈపద్య వ్యాఖ్యలో నిది ప్రాదియతి యని పేర్కొని పై కవిచింతామణి లక్షణమునే (ధాత్రిఁ బ్రాదియోగ...) ప్రమాణముగాఁ జూపిరి.

హరిశ్చంద్ర నలోపాఖ్యానవ్యాఖ్యాత చిత్రకవియనంతయు,

'సీ॥...గంగ, వాహ సమున్మిళి + ద్వ్యాలోలజిహ్వాల' అనుచోటఁ బ్రాదియతియని పేర్కొని పైకవిచింతామణి లక్షణమే వ్రాసి, తర్వాత 'అశ్వత్థామలకీ ఘోరవిరతపు' అను పై రాఘవపాండవీయ పద్యమునందులను లక్ష్యముగాఁ జూపెను. ఇందు సూక్ష్మముగాఁ బరిశీలింపదగిన యంశ మొకటి గలదు.

'వాహ......వ్యాలోల' అనుచోట 'వి + ఆలోల' అని పదవిభాగము. వి, ఆ (ఙ్) రెండునుపసర్గలే, పూర్వ పదములందు నిలిచియున్నవి. పూర్వపదముపసర్గయై స్వరముపరమైనది గాన నిట్టి సంధియందుభయయతి ప్రాదియతి యగును. కాని యిందుఁ బరమందునుపసర్గగలదు. అప్పుడున నుపసర్గసంధియతియు నగును. అప్పకవిగారి మతము ననుసరించి యందుఁ బ్రాద్యుపసర్గసంధియతులు రెండు చెల్లుబడియగును. మొదట ప్రాదియతి చెల్లుచుండఁగాఁ దర్వాతి యుపసర్గ సంధియతి చెప్పికొనవసరము చూపట్టదు. మఱి రాఘవ పాండవీయపద్యమునన్ననో యుపసర్గసంధి యతి యొక్కటే చెల్లును. వ్యాఖ్యాత చిత్రకవియనంతయ 'వ్యాలోల' అనుచోటఁ బరంబుననున్న యుపసర్గనే మనసునందిడుకొని ప్రాదియతియని పేర్కొన్నాడని యాతఁడొసఁగిన లక్ష్య లక్షణములవలనఁ దెల్లమగుచున్నది.

ఇట్లే ప్రాదియతి, యుపసర్గసంధియతి యను భేదమును పాటింపక యుభయమును నొక్క ప్రాదియతి క్రిందనే పరిగణించుట సమీచీనము స్వరసముగానుండునని తోఁచెడు. ప్రత్యేకముగా గ్రహింపఁదలఁచినచో నుపసర్గసంధియతిని నిత్యసమాస యతిలోఁ జేర్పక యుండుటే సంగతమగు నని యెంచుచున్నది.

# కొన్ని పదములు: వాటియర్థములు

## శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి

### ౧. బాడుదల

శ. ర. "బాడు=ముసుఁగు" అనియు, "బాడుదల (బాడు + తలఁగించుట) = అవమానించుట" అనియు నర్థములు చెప్పి, 'బాడదల'కు ఈ క్రింది ప్రయోగములు చూపినది.

(1) "ఛీతిఁ బాఱెడు పురుహూతు వెన్కొని బాగుదలఁబట్టె" (లక్ష్మీన్ను. 2-116)

(2) "బాడుదలఁ బట్టె కొలమునఁ
గూడని చెడు గంచుఁ బెట్టుకొనఁ జూచియుఁ జే
యాడక విడిచిన నూడనిఁ
బాడెం గోణపుఁడు దైత్యపతి వెనువెనుకన్"
(కవికర్ణ. ౨. ఆ.)

("బాడదలఁబట్టు... చెడుగంతు ... దైత్యపతి వెనువెనుకన్" అని వావిళ్ళప్రతి పాఠము)

---

* రాఘవ పాండవీయమునకు రాఘవపాండవీయాదర్శమను పూర్వవ్యాఖ్య యొక్కటి గలదు. తత్కర్త ముద్దరాజు పెదరామన. ఇతఁడు కవిజన సంజీవని యను సుప్రసిద్ధ లక్షణగ్రంథమును రచించిన ముద్దరాజు రామనకు నగ్రజుఁడు. వ్యాఖ్యాత ముద్దరాజు పెదరామన, లాక్షణికుఁడు ముద్దరాజు రామన యన్నదమ్ములు. నాఁటి వీరేశలింగముపంతులు మొదలు నేఁటివఱకుఁ గల కవి చరిత్రకారు లందఱు దీనిని బరిశీలింపక కవి సంజీవనీ కర్త ముద్దరాజు రామనయే రాఘవపాండవీయ వ్యాఖ్యాత యని భ్రమసి వ్రాయుచున్నారు. ఇది పొరపాటు; ఇఁక నైన సవరించుకొందురు గాక.

(8) "బాడుదల నొండె పట్టుము పాంసుతినయ ముఖ్యు" (భార. కర్ణ ౨. ఆ. ౬)

శ. ర. చెప్పిన యర్థము సరియైనది కాదు. ఎందు వల్ల ననగా :—

బాడుదల=అవమానించుట- యనుచో, పై పద్యములలో—బాడుదలఁబట్టి = అవమానించుటను బట్టుకొని—అనియు, బాడుదలబట్టుము. అవమానించుటను బట్టుకొనుము అనియు నర్థమగును. అది వికృతప్రసంగ మగును గాని సరియైనభాష కాదు.

పై పద్యములనుండి నిఘంటువు తీసికొనవలసినది—

'బాడుదలపట్టు' అను క్రియను గాని, 'బాడుదల' అను విశేష్యమును కాదు.

'బాడుదలపట్టు' శబ్దపల్లవక్రియ. చెఱపట్టు—అని యర్థము. అందు కీ క్రింది పద్యము ప్రమాణము.

"కడిఁది మగంటిమిం దొడరి
కయ్యమునం దన బాహుదర్పమే
ర్పడ నమరేంద్రు బాడుదలపట్టిన
రావణి రోషదీప్తుఁడై"

(భాస్కర. యుద్ధ. 443)

అమరేంద్రు బాడుదలపట్టిన రావణి—యనగా, ఇంద్రుని చెఱపట్టిన యింద్రజిత్తు—అని యర్థము.

తా నింద్రుని జెఱపట్టినట్లు రావణియె చెప్పుచున్నాడు. వినుడు.

"జంభారిం జెఱగొన్న యేఁ
గలుగఁగా శాఖామృగశ్రేణిచే
సంహారాశకి లంకకుం కలిగ దైన్యంబు"

(,,—,,—542)

'బాడుదలపట్టు'—ఏకపదక్రియ గావున అందలి 'బాడుదల'ను విశేష్యముగా తీసికొనుటయు, 'అవమానించుట'—యని యర్థము చెప్పుటయు సరికా దన్నది యిక్కడి సారాంశము.

నేటి ముద్రితప్రతులలో పాఠములు శ. ర. లో నున్నట్లే యున్నవి. మరియు కర్ణపర్వము (వావిళ్ళ ప్రతిలో,—"అనిలనందనుని బాడుదలంబట్టి" (1.42) అని యున్నది.

పై పద్యముల నన్నింటను 'బాడుదలపట్టు'అని క్రియగానే యుండుట యుచితము. (బాడుదలన్—పట్టు—అని వ్యస్తపదములుగా నుండుట యుచితము కాదు.

'బాడుదల నొండె పట్టుము'—అనుటయు సరి కాదు. 'బాడుదలయొండె పట్టుము'—అని యుండ నగును.

బాడుదలపట్టు; చెఱపట్టు;నిజముపట్టు వంటి యేక పదక్రియలలోని విశేష్యములను వేర్పఱచి యర్థము చెప్పుట పొరపాటు. ఈ పొరపాటు శ. ర. లో పలుమారు జరిగియున్నది.

N. B. శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు సవరించిన - నృసింహపురాణములో 'బాడుదలపట్టి' అనియే యున్నది.

## ౨. పలుగఱసేయు

శ. ర. "పలుగఱ (పలు+కఱ) = పండ్లపొడి" అని యర్థము చెప్పి, "పలుగఱసేయక పసుపును నలిపించుకొనక" అను (ప్రభా. ౫. ఆ.) పద్యము నుదాహరించినది.

పలుగఱ — 'పండ్లపొడి' యనుచో—పలుగఱసేయక=పండ్లపొడి (తయారు) చేయక—అని యర్థమగును. ఆ యర్థమున కా పద్యమున ప్రసక్తిలేదు.

పలుగఱసేయక=పండ్లుతోముకొనక—అని సరియైన అర్థము.

పలుగఱ—అనగా (పల్లు+కఱ్ఱ) పల్లుతోము పుల్ల (దంతకాష్ఠము) గాని 'పండ్లపొడి' కాదు.

పలుగఱ—అను విశేష్యము, చేయు—అను క్రియ యేకమై శ. ప. క్రియగా మారి 'పండ్లుతోము' అను నర్థము నిచ్చుచున్నది.

అందువల్ల ఆ రెండు పదములను విడదీసి యర్థము చెప్పరాదు. అంతేకాదు. 'చేయు' కు 'పలుగఱ' ను కర్మగా భావించి 'పలుగఱఁజేయు' అనరాదు.

## 3 బానగిల్లు

శ. ర. "బానగిల్లు=బలాత్కృతమగు" అని యర్థముచెప్పి, యీ క్రింది పద్యము నుదాహరించినది.

"పూనినరీతి రాని తలఁపుల్ వడిప్రాసములున్ జలంబునన్ బానగిలంగ నీడ్చి యొకపద్యముఁ గూర్పఁగ వచ్చుఁగాక యాఖ్యానకథానుకూలముగఁ గావ్యముఁ జెప్ప వశంబె" (ద్వా. ౧. ఆ.) ("వాని తలఁపుల్వడిఁప్రాసములున్" అని ముద్రిత ప్రతిపాఠము)

బానగిల్లుట—యనగా, - బలాత్కరించినప్పుడు రాక యీడిగిలఁబడుట గాని, బలాత్కరింపఁబడుట కాదు.

భావములు, యతిప్రాసాదులు తన యిచ్చ వెంట రాక యీడిగిలఁబడుచున్నను, చలపట్టి యీడ్చి తెచ్చి యెట్లో ఒకపద్యము చెప్పవచ్చునే గాని,— కావ్యము—దక్కని కావ్యముచెప్ప వశమగునా? అని పద్యభావము.

కావున శ. ర. చెప్పిన యర్థ మొప్పదు.

బ్రౌను, ఈ పదమును 'పానగిల్లుట' అని పరుషాదిగా చూపి, 'To hesitate' అని యర్థముచెప్పి, పై పద్యము నే ఉదాహరించి, — "పానగిలంగ —

అనగా బలాత్కారముగా అంటే సరసముగా వున్నది అయితే దానికి ఏక సాధకమున్నూ కనుపడలేదు" అన్నారు.

కాని, పానగిలంగన్ = బలాత్కారముగా— అనుట పొసగదు. (శ. ర. కర్త, బ్రౌణ్యము మీద ఆధారపడియే—'బలాత్కృతిమగు' అన్న యర్థము చెప్పినాడు)

బ్రౌను,—"...వశించె సన్నమై! కావగ జల్లి నేయు నది కట్టెడుపుట్టము నేయ నేర్చునే?" అని పద్యము పూర్తిగా నిచ్చియున్నారు.

దానిని బట్టి,—జల్లి (=సాలె పురుగు) సన్నగా వస్త్రమును పోలిన-అల్లిక యేదో అల్లునే గాని, అది కట్టుకొనదగిన పుట్టములను నేయ నేర్చునా? అట్లే కాకవియు నేదో ఒకపద్య మల్లగలడే గాని-కావ్యము చేయజాలడు-అన్న యర్థమొకటి స్ఫురించుచున్నది.

కాని, 'జల్లి'కి సాలెపురుగన్న యర్థమే నిఘంటువులోను లేదు. విచారింపవలసియున్నది.

మరియు, బానగిల్లు; పానగిల్లు అను రెండు రూపములలో సరియైనదేది? అన్న విషయము కూడా విచారణీయమే.

పానము + ఇల్లు = పానగిల్లు-అయ్యుండు నని నా యూహ. (పానము=లింగపీఠము. శ. ర) పానగిల్లుట యనగా, పీఠము వేసికొని - (కదలక పాదుకొని యుండుట, యని యర్థము కావచ్చును.

## ౪. కుమ్మ్రి

శ. ర. "కుమి=కుసూల విశేషము" అని చెప్పి,-- "తద్విశేషనామంబులు తినగు చుండుఁ గొట్టె కూటు పాడక కుమి బొట్ట యనగ" అను ఆం. భా. పద్యమును చూపినది.

మరియు, "కుమ్మ్రి-'కుమి'కి మీఁదిటిరూప" మని చెప్పి, "మూసి ముల్లడిచి కుమ్ముల కొల్చుపై మెత్తులూడ్వఁడు పస్తైన నుండుఁ గాని" అను 'పాండురంగ' (౪. ౧౪౯) పద్యము నుదాహరించినది.

(సూ. ని., వా. ని. కూడా-కుమి; కుమ్మ్రి అను రూపములనే గ్రహించి, పాండురంగ-పద్యమును 'కుమ్ముల కొల్చు' అను పాఠముతోనే చూపినవి.)

కుసూలవిశేష-మను నర్థము నిచ్చు పదము 'గుమ్మి' గాని 'కుమ్మ్రి' కాదు.

(1) బ్రౌను,-"గుమ్మి A high basket for holding corn బుట్ట" అని వివరించి,-"పడతుక నిత్య మైనగుఱు భక్తుల కన్న మొసంగి కాని వే,కువ దినవు నీ గృహంబునను గుమ్ములు గాదెలు కావ మెక్కడన్" (చెన్నబసవ. IV. 102.) అను ప్రయోగము నిచ్చి యున్నాడు.

(ఈపద్యములోని గుమ్ములను కూడా సూ. ని., వా. ని. 'కుమ్ములు' గానే భావించి, యీ పద్యమును 'కుమ్మ్రి' క్రింద చేర్చినవి.

౧౮౭౩ లో అచ్చైన 'ఆంధ్రదీపిక' అను నిఘంటువులో,

(2) "గుమ్మి=ధాన్యాగారము" అని యున్నది.

(3) "గుమ్మి=ధాన్యాగారము" అని ఆంధ్రపద పారిజాతము.

(4) "గుమ్మి=గాదె" అని ఆంధ్రవాచస్పత్యము. గుమ్మి, గుమ్ములు-అను రూపములు నేడు నెల్లూరు-గుంటూరు మండలములలో-వాడుకలోనున్నవి. (కుమ్మ్రి కుమ్ములు—నా కెక్కడను వినబడలేదు.)

ఎందు కెక్కువ చర్చ :—'పాండురంగ' పద్యములో నున్నవియును 'గుమ్ము'లే. కుమ్ములు కావు.

ఆ పద్యమును 'కుమ్మ్రి' క్రింద,—'కుమ్ముల కొల్చు' అను పాఠముతో చూపిన ఆ శ. ర. యే,—'మెత్తు' క్రింద—'గుమ్ముఁ గొల్చు' అను పాఠముతో చూపినది.

తెన్కంవారి (1922) ప్రతిలో,—'గుమ్ముల కొల్చు' అను పాఠమూ—'గుమ్ముల కొల్చు = బుట్టల లోని ధాన్యము' అను అర్థమూ ఉన్నవి.

1952 లో, శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు పెక్కు ప్రతులను పరిశోధించి, సాధు పాఠములను సంతరించి, తమ టీకతో ప్రచురించిన ప్రతిలోను 'గుమ్ములకొల్చు' అను పాఠమే యున్నది.

కాబట్టి శ. ర. యిచ్చిన 'కుమ్మ్రి'—'కుమి' అను రూపములును, 'కుమ్ముల కొల్చు' అను పాఠము సరియైనవి కావని నా యభిప్రాయము.

## ౫. గుమ్ములకొల్చు

శ్రీ వేంకటరమణయ్యగారు,—

"మూసి ముల్లడిచి గుమ్ములకొల్చు పై మెత్తు
లూడ్వఁడు పస్తైన నుండుఁ గాని"

అను సాధు పాఠమునే గ్రహించినారు గాని అర్థము చెప్పటలో చాల పొరపడినారు.

"మూసి=(ధాన్యపు రాసులను) కప్పి; ముల్లడిచి మూఁతలకు మేకులుకొట్టి; గుమ్ముల కొల్చుపైన్ = గోఁతులలోని (పాతరలలోని) ధాన్యముపై; మెత్తులు మెత్తఁబడిన పూఁతలు; ఊడ్వఁడు = తీయఁడు" అని వారి టీక.

(౧) పద్యములోని 'గుమ్ములు' గాదెలుగాని, 'ధాన్యపు రాసులు' కావు; 'గోఁతులు'—'పాతరలు' ను కావు.

మందముగా మట్టితో మెత్తఁబడి - సున్నగా పూయఁబడు పెద్ద గాదెలు గుమ్ములనఁబడును. పూ. టీ. లో—"గుమ్ముల కొల్చు = బుటలలోని ధాన్యము" అని యర్థము చెప్పబడి యున్నను బులుసు వారు గ్రహించ లేదు.

వారు, గుమ్ములను 'ధాన్యపురాసు' లని యొక మారును, 'పాతర'లని యొకమారును అనుటవలన వారికి గుమ్మి-ధాన్యపురాశి - పాతర- అనువాని రూపభేదము తెలియ దనుకొనవలసి వచ్చుచున్నది.

(బి) "ముల్లడిచి = మేకులుగొట్టి" అనుటయును తప్పే. ముల్లు అనగా చెట్టునబుట్టు కంటకము. (గుమ్మ ముల్లు, బలుసుముల్లు, ఈతముల్లు మొదలయినవి.)

మేకు—అనగా ఇనుముతోను, కొయ్యతోను చేయబడు చీల, గసిక మొదలయినవి.

బ్రౌను ఇట్లు తెలిపియున్నారు :—

"ముల్లు—A thorn a spur, a prikle."

"మేకు—A wooden or iron peg, a nail a stake or spike - గూటము- మేకును పెరికిన కోతి."

"ముల్లడిచి"—అనగా కంప కొట్టి—అని సరియైన యర్థము.

(1) "ముల్లిడు—to plant thorns. ముల్లిడి- setting up a hedge. చుట్టూ కంప వేసి" (బ్రౌణ్యము)

(2) "మును దవసీము చేసికొని ముల్లిడి" (ఆముక్త. 4. 219)

"ముల్లిడి — సరిహద్దుగా ముండ్లకంచెను. నాటి"—అని వేదంవారి వ్యాఖ్య.

ధాన్యమును గుమ్ములపోసి, గడ్డికప్పి, దానిమీద పేడతో కలిపిన మట్టి మెత్తి, ఆ మెత్తును ఎలుకలు కొట్టకుండుటకై రేగుకంప పఱతురు. ఈ ప్రక్రియ తెలిసిన వారికి గాని పై పద్య మర్థము గాదు.

(c) కొల్చుపై మెత్తులు—అనగా కొల్చుమీది మెత్తులు—అని యర్థము. కావున 'పైన' అనుట సరికాదు.

(d) "మెత్తఁబడిన పూఁతలు" అనుటయును సరికాదు. మెత్తఁబడునవి "మెత్తు" లగును గాని "పూఁతలు" కావు.

## ౭. కుబేరాక్షకేళి

"క్రీడించు నొకవేళఁ దోడి బాలురఁగూడి
యక్షింగతిఁ గుబేరాక్షకేళి" (పాండు. ౪. ౧౩౪.)

ఇందలి "కుబేరాక్షకేళి" కి నిఘంటువులు, వ్యాఖ్యానములు అర్థము నిట్లు చెప్పినవి.

(1) "కుబేరాక్షము=బాలక్రీడా విశేషము" (శ. ర.)

(2) "కుబేరాక్షకేళి=వెన్నెల కుప్పలయాట— (తెన్నేరంవారి టీక) కుబేరాక్షము=బాలక్రీడా విశేషము. (వెన్నెల కుప్పలయాట — యని వ్యాఖ్య)" సూ. ని.

(3) "కుబేరాక్షము = బాలక్రీడావిశేషము, దాఁగుడు మూఁతలు" (వా. ని.)

(4) "కుబేరాక్షకేళి=బాలక్రీడావిశేషమును- వెన్నెల కుప్పయాఁటను" (బులుసు వారి వ్యాఖ్య)

నిఘంటుకర్తలు, వ్యాఖ్యాతలు కూడా — కుబేరాక్ష=కుబేరాక్షకేళి శబ్దముల యర్థమును గూర్చి అంతగా విచారించినట్లు లేదు.

"కుబేరాక్ష" మనగా గచ్చకాయ.

కుబేరుని కొక కన్ను కాయకన్ను. "కాయ కంటి" అని యతనికి పేరును కలదు. కాయకన్ను గచ్చకాయను పోలియుండును. కుబేరుని యక్షివంటె

దన్న యర్థముచేతనే గచ్చకాయ "కుబేరాక్షు" మైనట్లూహింపదగి యున్నది.

బ్రౌన్యములో,—"కుబేరాక్షి—A Kind of nut same as గచ్చకాయ" అని యున్నది.

వెన్నా వేంకటశేషశాస్త్ర్యుని (1898 సం.) సంస్కృతాంధ్ర నిఘంటువులో,— "కుబేరాక్షి=కలుగొట్టుచెట్టు, గచ్చచెట్టు" అనియున్నది.

అందువలన కుబేరాక్షకేళి=‘గచ్చకాయలాట’ యనునుగాని పేరులేని ‘బాలక్రీడావిశేషము’ కాదు—వెన్నెల కుప్పయాట కాదు; దాగుడుమూతలును కాదు. ‘పాండురంగ’ కవి గచ్చకాయల ఆటను యక్షాక్షవిహరణ మనియు ననియున్నాడు.

"వెలయించె యక్షాక్షవిహరణం బలకాధి
రాజ కింకర శిరో రత్నరాజి" (3 178)

ఇక్కడ, బులుసువారు తమ టీకలో,— "యక్షాక్షవిహరణంబున్, వెలయించెన్=కుబేరాక్షమను ఆట నాడెను" అని పూర్వటీకలోని మాటలనే వ్రాసి, తాత్పర్యములో,—సొగటాలయాట పిల్లలు చిన్నతనమున నాడునట్టిది" అని వ్రాసినారు.

కుబేరాక్ష (యక్షాక్ష) కేళి-అను పదమునకు,-‘వెన్నెలకుప్పయాట’ అని యొకమారును, ‘సొగటాలయాట’ అని యొకమారును అర్థము వ్రాయుటవలన వారి కా యాటల తత్త్వము తెలియదని యేర్పడుచున్నది.

‘వెన్నెలకుప్ప’ లనగా, పిల్లలు వెన్నెలలో మట్టిని కుప్పలుగాపోసి ఆడుకొను ఆట.

‘సొగటాలయాట’ అనగా పెద్దలు పాచికలతో ఆడు ఆట.

కావున, కుబేరాక్షకేళి=‘వెన్నెలకుప్పయాట’ యనుటయు, వెన్నెలకుప్పయాటను ‘సొగటాలయాట’ అనుటయు, సొగటాలయాట "పిల్లలు చిన్నతనమున నాడునట్టిది" యనుటయు పొరపాటని నా మనవి.

చిన్నికృష్ణునికి – గచ్చకాయల (ఆట) తోడి సంబంధ మా గ్రంథమున పలుమారు వర్ణితమై యున్నది.

ఒక కొన్ని యుదాహరణములు :—

(1) "సంచిఁబట్టిన పద్మరాగాండముల లీల
వలకేల గ్రచ్చకాయలు ఘటిల్ల" (2.14.)

(2) "తొడల యుద్దతిత్తులు వ్రేలన్" (2.88)

‘తొడల యుద్దతిత్తులు=తొడల ప్రక్కలనున్న గ్రచ్చకాయల సంచులు’ అని బులుసువారే వ్రాసి యున్నారు.

(3) "కలుష ఖురళన విధానా
కలిత ఘుటికలనఁగ గ్రచ్చకాయలు వలచే
తెలకొను నల జిలిబిలి వె
న్నెల వన్నెల సంచి నిండి యింపలరన్"
(2.37.)

(4) "బర్హమణి బంధ మా పల్బు పచ్చవెగురు
గ్రచ్చకాయల తిత్తియుఁ గంబుశక్తి (?)
గలిగి విహరించుఁ బాండురీకంబు నంచు
నంచు లేఁబట్టి" (2.152.)

(5) "గ్రచ్చకాయల్ కరాధిష్ఠిత జాంఘమండంబులో నాఁ గడున్ జిత్రితవస్త్రంబునన్ నిల్పవన్" (4-77)

(6) "గ్రచ్చకాయ లెంచి చూడువాని.....పాండురంగ విట్ఠలున్" (5.197)

ఈ ప్రయోగములను బట్టి, కుబేరాక్షము=గచ్చకాయ. యనియు, కుబేరాక్షకేళి=గచ్చకాయల ఆట యనియు. నా నిశ్చితాభిప్రాయము. పండితులింకను విచారింతురుగాక.

# తెలుగుభాషా సమితి బహుమతులు

1954-55 బహుమతిపోటీలో ఈ క్రింది గ్రంథాలను ఉత్తమమైనవిగా నిర్ణయించారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం గ్రంథాలు వ్రాసిన ఈ క్రిందివారికి రూ. 500 చొప్పున బహుమతి ఇస్తారు: నాటకకళ వ్రాసిన శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి, అమరవీణ అనే కావ్యం వ్రాసిన శ్రీ వజ్ఝల వెంకటేశ్వర్లు.

1955-56 పోటీలో ఈ క్రిందివారికి బహుమతులు లభించాయి. ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము వ్రాసిన శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు, భూగర్భశాస్త్రము వ్రాసిన శ్రీ యస్. యల్. నరసింహం, పిల్లలనాటికలు వ్రాసిన శ్రీమతి పి. సీతారాజ్యలక్ష్మి, ఆంధ్ర శిల్ప పరిచయము వ్రాసిన డాక్టరు శ్రీపాద గోపాలకృష్ణమూర్తి, ఆరామ కల్పతరువు వ్రాసిన శ్రీ బి. నరసింహం.

# గ్రంథ విమర్శనము

## హైదరు చరిత్ర

తెలుగు వచనం; మద్రాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత గ్రంథాలయంవారి ప్రచురణ. సంపాదకులు: డాక్టర్ యన్. వెంకటరమణయ్య. వెల రు 2-4-0.

దీనిని ప్రాచ్యలిఖిత గ్రంథాలయంలోని (D. No. 2657) కాగితపుప్రాతప్రతి నుంచి ముద్రించారు. గ్రంథకర్త పేరు తెలియదు. వ్రాతప్రతి చివరను, యీ క్రింది విధంగా ఒక షరా. వుంది:

"షరా. ఇక్కడ ఇంకా కొంచెం మతలబు వుండవలెను. అయితే మహారాటా కృష్ణయ్య పుస్తకములో అంతమట్టుకే వ్రాసియున్నది."—

ఈ వాక్యాన్నిబట్టి శ్రీ వేంకట రమణయ్యగారు: ఈ గ్రంథం అనువాదమనీ, కృష్ణయ్య అనే మహారాష్ట్రుడొకడు, 'బహుశా ఇదే పేరుతో' మహారాష్ట్ర భాషలో దీని మాతృకను రచించి వుంటాడనీ నిర్ణయించారు. ఆ మాతృక లభించనంతకాలం ఇలాటి నిర్ణయం చెయ్యటానికి అవకాశమేమీ కనుపించదు. ఎందుచేతనంటే:

(1) పూర్వం మహారాష్ట్ర పండితులూ, తెలుగు పండితులూ పరస్పరం ఒకరిభాష నొకరు పరిచయం చేసుకుని ఉభయ భాషలలోనూ గ్రంథరచన చేసిన సందర్భాలున్నాయి. ఉదాహరణకు: అల్లాడి రామచంద్ర సుబ్బాజీభావు అనే ఒకగు (ఈయన మహారాష్ట్రుడో తెలుగువాడో తెలియదు) 'సిద్ధాంత శిరోమణి ప్రకాశము'నే జ్యోతిష గ్రంథాన్ని అటు మహారాష్ట్రంలోనూ ఇటు తెలుగు వ్యావహారిక వచనంలోనూ కూడా రచించారు. ఈ తెలుగు రచన 1837లో ఇక్కడ మద్రాసులోనే 'చర్చి మిషను ప్రెస్'లో అచ్చయింది.

ఈ తెలుగురచనకు శ్రీ వేంకట రమణయ్యగారు ఒకటిన్నర పేజీలలోపు చిన్నపీఠిక నొకదాన్ని వ్రాశారు. అదీ తెలుగులో కాదు, ఆంగ్లభాషలో రచించారు. అలా ఆంగ్లంలో రచించటంలో గల ఔచిత్యమేమిటో మనకు బోధపడదు. ఈ ఒకటిన్నర పేజీలలోనూ సగంభాగం హైదరూ వాడికొడుకు టిప్పూ దుర్మార్గులని చెప్పటానికి వినియోగించారు. మిగతా అర్థభాగంలో వీరు వెల్లడించిన అభిప్రాయాలు బహు చిత్రంగా వున్నాయి.

ఒకచోట:

'Though most of the events described in the work are not unfamiliar to the students of South Indian history, occassionally one comes across a few facts not noticed in other sources.' అన్నారు.

మరోచోట:

Although the 'Hydaru Charitra' does not add much to our knowledge of the history of Hyder and Tipu. it presents a true picture of their respective characters'— అని వ్రాశారు.

ఇంతకూ ఈ గ్రంథం చారిత్రకాధారంగా ఏ లేశమైనా ఉపయోగిస్తుందంటారా లేదా? ఆ సంగతి తేల్చరేం?

సారస్వతంగా ఈ గ్రంథం పనికిరాదని కొట్టి పారేసిన రమణయ్యగారు పాత్రా పౌశీల్యాల పరిశీలన ప్రసక్తి తెస్తారెందుకు?

అటు సారస్వతంగానూ ఉపకరించక, యిటు చారిత్రకంగానూ ఉపకరించక చెత్తగ్రంథమని తోచిన ప్పుడు ప్రజలసొమ్ము దండుగపెట్టించి ప్రభుత్వ పక్షాన దీన్ని అచ్చు వేయించటమెందుకు?

'The Telugu 'Hydaru Charitra' has no literary Pretensions. It is written in

the spoken Telugu, which was in current use in the Western Andhra and Mysore in the latter half of the 18th century. The language wich is replete with Persian military, and administrative terms, is very often crude'—

దీన్ని సాహిత్యగ్రంథంగా రచించాలనే అభిలాష గ్రంథకర్తకే లేదంటారేమిటి? అది శ్రీ వెంకటరమణయ్యగారికెలా తెలిసింది. 'అది వ్యవహారిక వచనంలో వ్రాయబడినది...' ('It is written in the spoken Telugu') అన్నది వారి అభిప్రాయానికి ఉపబలకమా? వ్యావహారిక భాషలో వున్నదేదీ సాహిత్యం కాదని శ్రీ వేంకటరమణయ్యగారి అభిప్రాయమైతే వీరి అభిప్రాయంతో మనం ఏకీభవించటం దుర్లభమౌతుంది. ఈనాటి సాహిత్యరంగం సంగతి అలావుంచి, ప్రాకృతభాషలలో వున్న ప్రాచీన సారస్వత సముద్రములన్నీ ఇట్లేంకు లెంకవలసినదేనా? పర్షియన్ పదజాలం వుంచటం, విషేశమా? 'బొబ్బిలి యుద్ధానికి' తెలుగు సారస్వతంలో స్థానం యివ్వరా? ఈనాటి తెలుగుభాషలో పర్షియన్ పదాలులేవా? అన్యదేశీయాల నన్నిటినీ ఏరివేస్తే తెలుగుభాష గతేమౌతుంది. శ్రీ రమణయ్యగారి ఈ ప్రవచనాలు చాలా అన్యాయంగా వున్నాయి. ఇలాంటి ఉదాసీన భావంతో ఈ సంపాదకత్వానికి పూనుకుని ఈ గ్రంథానికి అన్యాయం చేసినట్లే కనిపిస్తున్నది. ఏది ఏమైనా ఏదోరూపంలో ఈ గ్రంథాన్ని ముద్రించి అందజేశారు గనుక సహృదయులు ఈ గ్రంథాన్ని పరిశీలించి దీని ప్రయోజనాన్ని నిర్ణయించవచ్చు.

ఈ గ్రంథం ఆశ్వాసాలుగా విభజింపబడివుంది. ఈ ఆశ్వాసాల విభజన రచయితకు సాహిత్యదృష్టి లేదన్న వాదానికి ఆఘాతంగా వుంది. లభించినంత వరకు మూడు ఆశ్వాసాలుగా వుంది. మధురమైన వ్యావహారికంలో ఈ రచన వాహినిగావుంది. మనకున్న ప్రాచీన వచన గ్రంథాలే బహుకొద్ది. అనునాతనాంధ్రవాఙ్మయ రంగంలో జీవద్భాషయైన వ్యావహారికానికి రూపురేఖలు దిద్దటానికి నిరంతరం కృషి చేస్తున్న ఔత్సాహికులు ఈ గ్రంథాన్ని తప్పక పరిశీలించవలసి వుంది. ఈ రచన చారిత్రకమైన చక్కని నవలరూపంలో వుంది. దక్షిణభారతంలో నాటిప్రజానీకం యొక్క దుర్భరస్థితిని కళ్ళకు కడుతోంది. నాటి ఆర్థిక, సాంఘిక, రాజకీయ పరిస్థితుల నన్నిటినీ ద్యోతమానం చేస్తోంది. కేవలం తేదీలమీదా, రాజుల మీదా దృష్టివున్న కారణంగా, ఇలాంటి విషయ బాహుళ్యమంతా శ్రీ రమణయ్యగారి దృష్టిని ఆకర్షించలేక పోవటం, నిజంగా దురదృష్టం. ఇందులో అనేక విషయాలు వివరణలను అపేక్షించుతున్నాయి. శ్రీ రమణయ్యగారు మొదటి పదిపన్నెండు పేజీల వరకువా మాత్రం ఏవో కొన్ని వివరణలిచ్చారు కాని తరువాత బంజరుగా వదిలేశారు. ఇందులో కొన్ని వివరణలు అర్థంకావు. ఉదాహరణకు మొదటిపేజీ క్రింద-నెం. 3. వివరణ: "ఇంగ్లీషు తేదీ తప్పు—సరియైన సంవత్సరము."

శ్రీ రమణయ్యగారు చాలా శ్రమచేసి మొత్తం ఈ గ్రంథాన్నంతా ఆంగ్లభాషలోకి అనువాదంచేసి గ్రంథం చివరచేర్చారు. ఇది వృథాప్రయాసగా కనిపించుతుంది. ఈ అవకాశాన్ని, ఈ గ్రంథానికి సమగ్రమైన టీకను సంఘటించటంలోనూ, గ్రంథస్థ విషయాన్ని వివరించుతూ తగిన పీఠికను వ్రాయించటంలోనూ వినియోగించినట్లయితే ఉపయోగకరంగా వుండేది — వ్యావహారిక భాషావిషయం వ్యావహారిక వాదులకు వదిలివేసినా. ఈ గ్రంథాన్ని తెలుగుదేశంలోని అన్ని గ్రంథాలయాలూ తెప్పించి ఔత్సాహికులకు అందజేయగలరని ఆశించుతున్నాము.

## గ్రంథ విమర్శనము

### భరతసార సంగ్రహము

పద్యరచన : మద్రాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత గ్రంథాలయము వారి ప్రచురణ; సంపాదకులు . శ్రీ టి. వి. సుబ్బారావు; వెల 1-10-0.

పుస్తకం అట్టమీద "భరతసార సంగ్రహ"మనీ, లోపల "భరతశాస్త్ర పద్య కావ్య"మనీ అచ్చు వేశారు. ఇలా ఎందుకు వేయవలసి వచ్చిందో తెలియదు. గ్రంథకర్త: చిల్లకూరి దివాకర నారాయణదాసు.

సంపాదకులు పీఠికలో ఇలా వ్రాశారు: "[illegible]యగు నీ గ్రంథపరిమాణమును ఇందమర్చబడిన విషయ వైవిధ్యమును పరిశీలించినచో రచయితకుగల సునిశితమైన లాక్షణిక దృష్టి వెల్లడియగును. విషయ సంగ్రహమునకు కావలసిన స్పష్టతతో లక్షణగ్రంథమిది ముచ్చట గొల్పుచున్నది"—

ఈ గ్రంథముయొక్క విశిష్టతను సామాన్య పాఠకులు గ్రహించటానికి తగిన అవకాశములను వేటినీ చేకూర్చకపోయినా, పై వాక్యాలనుబట్టి సంపాదకులు ఈ గ్రంథ ప్రాశస్త్యాన్ని గుర్తించినట్టే మనం ఊహించవలసి వుంది.

ఇది భరతశాస్త్రాన్ని గురించి తెలుసుకోవాలనే ఔత్సాహికులకూ, భరత శాస్త్రాన్ని సాధన చేయదలచిన ప్రాథమికులకూ ఉపయోగించవలసిన గ్రంథం. కొట్టిన పిండిగా భరత శాస్త్రమంతా క్షుణ్ణం క్షుణ్ణంచేసి చూస్తున్నవారు ఈ గ్రంథాన్ని చదువవలసిన అవసరంలేదుకదా! అలాంటి సందర్భంలో భరతశాస్త్ర పరిచయంలేని ప్రాథమికులకు ఈ పద్యాలు అర్థమౌతాయా అనేది అనుమానాస్పదమైన విషయం. ఇది లక్షణ గ్రంథం. దీన్లో సాంకేతికమైన పదజాలం వాడబడింది. అందుచేత మామూలు మనిషికి అర్థంకావటం దుర్లభం. ఈ పద్యాలకు టీకగాని తాత్పర్యంగాని యిచ్చివుంటే బాగుండేది. సంపాదకులు అలాంటి శ్రమ తీసుకున్నారుగాదు. గ్రంథస్థమైవున్న నాట్య సంప్రదాయాన్ని గురించిగాని, రచయిత ఎక్కడివాడు, ఇలాంటి గ్రంథం రచించటానికి పూనుకోవటానికి ప్రయత్నించటంలో ఆయనకుగల పరమాశయమేమైవుంటుంది, ఇత్యాది విషయాలను అన్వేషించి, తగిన పీఠికను వెలయించటానికిగాని సంపాదకులు పూనుకున్నారుకాదు. సంపాదకులుగా వీరు నిర్వహించిన కార్యభారమేమో మనకు బోధపడదు. పోనీ నిర్దుష్టంగా గ్రంథం అచ్చువేయించి అందజేశారా అంటే అదీ కనుపించదు. 68 పేజీల చిన్న గ్రంథానికి 8 పేజీల అచ్చు తప్పులపట్టికను వెలయించారు. అసలు, తెలుగు భాష యందు లేశమాత్రం గౌరవంవున్నవాడికైనా ఇందులో అచ్చయివున్న విధంగా ఈ పద్యాలు చదివితే చిరాకుపుడుతుంది: ఉదాహరణకు: ఈ దిగువ పద్యం ఎలా అచ్చువేయించారో చిత్తగించండి:

'శా. వాణీకాంచన గర్భురాణి నుతగీ
ర్వాణీఘన శ్రోణి స
ద్వీణాపుస్తక పాణిబంభరల స
ద్వేణీ పురాణీ శుకీ
వాణీనారు విచిత్ర నర్తన కళా
వైచిత్రిధాత్రీజన
శ్రేణుల్గాంచి గణింపజేయున నినున్
సేవించి ప్రార్థింతదన్.'

ప్రాచ్యలిఖిత గ్రంథాలయంవారు ఈవిధంగా ఈ తెలుగు గ్రంథాలను అచ్చున వెలయింపజేయటానికి పూనుకోవటం శోచనీయం.

తె. సూరి.

## పంచామృతము

కావ్యసంపుటి; రచన : శ్రీమతి యం. ఆదిలక్ష్మి, ప్రాప్తిస్థానము : రచయిత్రి, 15 ముజఫర్ జంగ్ బహదూర్ వీధి, తిరువలిక్కేణి, మద్రాసు-5; వెల 1-8-0.

ఈ గ్రంథానికి శ్రీ నిడుదవోలు వెంకటరావు గారు ఆరుపేజీల ఆముఖం వెలయించారు. కాని ఆ ఆముఖంలో ఈ గ్రంథంలోని కావ్యఖండికల గుణాగుణములను గురించి లేశమూ పరామర్శించారు కారు.

దధి, క్షీరము, ఘృతము, శర్కర, మధువు యీ అయిదును కలిసినది పంచామృతము. ఈ సంపుటిలో, తిమ్మక్క, లీలావతి, రుద్రమదేవి, మొల్ల, తరిగొండ వెంగమాంబ—ఈ అయిదుగురు విదుషీమణులనూ సంస్మరించుచూ అయిదు శీర్షికలలో పద్యరచన లున్నాయి. అందుచేత 'పంచామృతము' అన్న పేరు సార్థకం. ఆదిలక్ష్మిగారికి తెలుగు భాషపైన చక్కని అధికారం వున్నట్టు కనుపించుతుంది. ఒడిదుడుకులు లేని సరళమైన వాక్కు; రచన నిర్మలవాహినిగా సాగిపోతుంది. పద్య నిర్మాణంలో కూడా ప్రాచీనులలో గల ఒడుపులను కొన్నిటిని కైవసం చేసుకున్నారు. ఉదాహరణకు :

ఆడుది తమ కెంతని, పా
రాడగ దొరకొన్న పురుషాధిపతుల్ చే
యాడక, కాలాడక, తల
లూడిపడన్ దగిరి పోరిలో రుద్రముచే.

కాని, కావ్యనిర్మాణానికి కేవల భాషాశక్తి, పద్య నిర్మాణాశక్తి మాత్రమే చాలవు. ఇవి నిజమైన కవితా శక్తికి అలంకారములు కాగలవేగాని యివే కావ్యంగా నిల్చలేవు. రసపుష్టి కావ్యానికి ప్రాణం. దానిని నిర్మించగలది ధ్వని. దీనిని సాధించుకోక పోతే రచయిత్రి కావ్యరంగంలో పైకి రాలేరు. కేవల వాచ్యం కావ్యంగా జీవించలేదు. కరుణరసాన్ని చిప్పిల చేయటానికి మహావకాశం గల లీలావతీ పరిణయం లాంటి కథావస్తువును స్వీకరించి కూడా, విజయం పొందలేక పోయారు.

కావ్యనిర్మాణం అసిధారావ్రతం. అది యెంతటి విషమమైనా సరే, మనకు అభిలాష వున్న సంగతులన్నీ తోచిన చోటల్లా చెప్పివేయటానికి అనువుగాదు. తిమ్మక్క కావ్యమంతా అయినతరువాత శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారిని గురించిన చివరిపద్యం పైరచనలో సాధించిన రసలేశాన్ని తుడిచి వేసేదిగావుంది.

మరొకటి: కేవల భావాభిమానం (Sentiment) ఈనాడు కావ్య నిర్మాణానికి చాలదు. కావ్య సాంకేతిక పరిజ్ఞానంతో పాటు, విస్తృతమైన వైజ్ఞానిక ప్రాభవాన్ని సంతరించుకుంటేనే గాని ఈనాడు యెవరూ కవితాపీఠాన్ని అలంకరించలేరు.

ఆదిలక్ష్మిగారి జన్మస్థానం ఆత్మకూరట; అంటే కవయిత్రి మొల్ల జన్మస్థానం. అకారణంగా మొల్ల యెడల వీరికి సహజంగా అభిమానం. అఘట్టాన్ని కొంత ఉదాత్తంగానే నిర్వహించారు.

కమ్మని తేట తెన్గునుడి
కారముతో సరసార్థయుక్తితో
ముమ్మరమైన నీకవనము-'

ఇత్యాది పదబంధాలు కొన్ని ముచ్చటగా వున్నాయి.

## శ్రీ త్యాగరాజ చరిత్రము

పద్యకావ్యము: రచన: శ్రీ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు; ప్రాప్తిస్థానం: రచయిత, గోవింద రాజులపేట-విజయవాడ 2. వెల రు 1-0-0.

రచయితకు సంస్కృతాంధ్రముల యందూ, పద్యనిర్మాణమందూ అత్యంతమైన ప్రతిభాసంపత్తులున్నాయి. భక్తిరసపూరితమైన ఈ రచన ప్రశంసాపాత్రంగా వుంది. త్యాగయ్య మధుర భాషలను వీరు పద్యములలోనికి సంతరించు కొన్న విధానం అద్భుతం.

బాల! సుశీలా! హాటక
చేలా! సుజనపరిపాల! శ్రీ రమణీహృ
ల్లోలా! వీరవిధృత విశిఖ
జాలా! దీప్తవనమాల! జలదవినీలా!

"బాలకనకమయచేల" అన్న కృతిని అలా పైవిధంగా పోతపోశారు. ఇలా అనేకం.

**Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambhu Prasad.**



# అమృతాంజనము

ఎంత భయంకరమైన
కాలి నొప్పి నైనా క్షణంలో ఉపశమింప
జేస్తుంది

అఖిలాంధ్ర ప్రజలు 1893 నుంచి దేశమంతటా అమృతాంజనాన్ని వాడుతున్నారు. అమృతాంజనము బెణుకులు, వాపులు, తలనొప్పి, పళ్లపోటు, జలుబులు, దగ్గులు మొదలైన వాటిని ఉపశమింపచేస్తుంది.






అమృతాంజన్ లిమిటెడ్, మద్రాసు-4, బొంబాయి-1, కలకత్తా-7.